# మహాశిల్పి
# జక్కన చరిత్రము

గ్రంథకర్త

డా. తిరుమల కృష్ణ దేశికాచార్యులు

విన్నిపెగ్, మానిటోబా, కెనడా



**యువభారతి**

సాహితీ సాంస్కృతిక సంస్థ

ఆంధ్రసారస్వత పరిషద్భవనములు

తిలక్ రోడ్డు, హైదరాబాదు – 500 001

**Mahasilpi Jakkana Charitramu** - A Telugu poetical work in Prabandha style on the life and work of a great Indian sculptor and architect who lived in the Hoysala kingdom of the 12th Century A.D., in the present day Karnataka State of India, by Dr. Tirumala Krishna Desikacharyulu, Winnipeg, Manitoba, Canada.

---



యువభారతి
ప్రచురణ క్రమసంఖ్య: **154**
ప్రథమముద్రణము: డిసెంబరు, 1994.
ప్రతులు: 1000

ముద్రణ కూర్పు: గ్రంథకర్త
ప్రతుల ముద్రణ: Prinfas printers, D.D.Colony, Hyderabad.
ముఖచిత్రరచన: శ్రీ షణ్ముఖాచారి

వెల: 50/- రూపాయలు

ప్రతులకు:
యువభారతి కార్యాలయము
ఆంధ్రసారస్వత పరిషద్భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు - 500 001

# అభినవప్రబంధం

సమాజశ్రేయస్సుకు సమున్నత ప్రమాణాలు గల సాహిత్యం, ఉత్తమ మూల్యాలను పెంచి పోషించగల సహృదయలోకం అవసరమని గుర్తించి, రెండింటినీ బలంగా పెంపొందించే సాహిత్య సాంస్కృతిక చైతన్యాన్ని కలిగించటానికి యువభారతి మూడు దశాబ్దాలకు పైబడి ఉద్యమిస్తున్నది

సాహిత్యం ఎటువంటి సాహిత్యేతర శక్తుల అజమాయిషీకి లోనుగాకుండా, స్వతంత్రవ్యక్తిత్వంతో సాత్త్వికశక్తిగా రూపొందాలనీ, అటువంటి సాహిత్యాన్ని సృష్టించే రచయితలు ఏకాలంవారైనా, వారి కృషినీ, సందేశాన్నీ సామాన్యప్రజానీకానికి అందేటట్లు వివిధ ప్రచురణల ద్వారా, కార్యక్రమాల ద్వారా యువభారతి యత్నిస్తోంది. అంటే రాజకీయకాలుష్యం లేని సాహిత్యోద్యమాన్ని యువభారతి అవిశ్రాంతంగా సాగిస్తోంది.

"చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటే, ప్రయత్నించి ఎంతచిన్న దీపానై నా వెలిగించటం మంచిది"- అనే లక్ష్యంతో సమాజంలో వ్యష్టిగా, సమష్టిగా, శాంతియుత సహజీవనాన్నీ, ప్రజాస్వామ్య విధానాన్ని, నిర్మాణాత్మక కార్యశీలాన్నీ, మానవత్వపు విలువలతో కూడిన సేవాభావాన్నీ ఆచరించి చూపిస్తోంది యువభారతి

యువభారతి **1963** సం॥ లో విజయదశమి నాడు పుట్టింది. ఈ ముప్పై ఏయేళ్లలో **150** కి మించిన ప్రచురణలు అందించి సమాజంలో సాహిత్యం మీద అభిరుచిని పెంచింది. ఒక జాతిలో రచయిత (త్రు) లు రచనలు చేయటం ఎంతగొప్పో, సహృదయులు అధికశాతంలో అభివృద్ధి చెందటంకూడా అంతేగొప్ప. సహృదయలోకాన్నీ, సాహితీవాతావరణాన్ని సమాజంలో నిర్మించేకృషిలో సాహితీసంస్థల పాత్ర విశేషంగా ఉంటుంది. ఆబాధ్యతను గుర్తించి యువభారతి ఇన్నాళ్లుగా సాహిత్యోద్యమాన్ని సాగిస్తున్నది. అంతేకాదు. ఈమూడు దశాబ్దాలలో యువభారతి ప్రజల హృదయాల్లో తన ముద్రను పదిలంగా వేసుకొన్నది.

యువభారతి అన్ని ప్రక్రియలలాగానే పద్యకవితను మొదటినుండీ గౌరవిస్తూనే ఉంది. ప్రాచీనాధునికాంధ్రకవుల పద్యకవితావైభవాలను ప్రచురించి ప్రజాదరణాన్ని పొందింది. యువభారతి తొలి ప్రచురణ పద్యకవిత కావటం కూడా విశేషం. అది శ్రీఅనుముల కృష్ణమూర్తిగారి సరస్వతీ సాక్షాత్కారం. ఆతరువాత కవితాసంకలనాలను కూడా యువభారతి వెలువరించింది. వాటిలో పద్యఖండికలను కూడా పదిలపరిచింది.

మరొకప్రత్యేకత ఏమిటంటే పద్యకావ్యాలను గూడా ప్రచురించటం అయితేఅవి ప్రాచీనకవులవి కావు. ఆధునికులవి. అందులోను డాక్టర్ తిరుమల కృష్ణ దేశికాచార్యులవారి పద్యకావ్యాలను ఇదివరకే రెండింటిని యువభారతి ప్రచురించి, యిప్పుడు ఈ మూడోకావ్యాన్ని వెలువరిస్తోంది. ఒకే కవి రచించిన పద్యకావ్యాలను మూడింటిని యువభారతి ప్రచురిస్తోందంటే ఆ కవి వ్యక్తిత్వం, పద్యరచన ఉదాత్తమైనవని మాసంస్థ భావిస్తోన్నదన్నమాట.

డాక్టర్ తిరుమల కృష్ణదేశికాచార్యులు కెనడాలో స్థిరపడినా, గణిత, ఖగోళ శాస్త్రజ్ఞుడుగా నిరంతర పరిశోధనలు సాగిస్తున్నా, జన్మసిద్ధమైన ఆంధ్ర కవితాకళను సంరక్షించుకుంటూ మహాకావ్యరచనకు పూనుకోవటం తెలుగువారందరూ హర్షింపదగిన అంశం, పద్యమంటే దేశికాచార్యులవారు పరవశిస్తారు, పరమోదాత్తమైన కళగా భావిస్తారు. పద్యాన్ని శిల్పిలా చెక్కుతారు, పండితునిలా వివేచిస్తారు. అందువలన ఆచార్యుల వారిలో కావ్యభారతి కళామయంగా జీవిస్తోంది. యువభారతికి ఆకళాభారతి స్నేహచందనాన్ని అందిచటం మాసంస్థ చేసుకొన్న అదృష్టం.

కంప్యూటర్లమధ్య నడయాడుతున్నా కృష్ణదేశికాచార్యులవారు కావ్యతత్త్వాన్ని మననం చేసుకుంటూనే ఉంటారు. యంత్రాలు వారికి మంత్రాలను నేర్పాయి, ప్రయోగాలను చేయటానికి ప్రేరేపించాయి. కవిత్వంలో కూడా వారికి ప్రబంధ కవితామంత్రం మనస్సుకు ప్రసన్నమైంది. ఛందస్సు వారి ప్రయోగరంగంగా పరిఢవిల్లింది. ఇరవయ్యో శతాబ్దంలో కూడా పద్యకావ్యప్రబంధస్పృహను బలంగా పోషిస్తున్న ప్రవాసాంధ్ర ప్రసిద్ధకవి డార్టర్ తిరుమల కృష్ణదేశికాచార్యులు.

యువభారతి ప్రచురించిన ఆచార్యులవారి కావ్యాలు హనుమప్ప నాయకుడు, ఋతుసంహారము తెలుగు సహృదయలోకంలో ఆసక్తితో కూడుకొన్న ఆమోదాన్ని కలిగించాయి. ఆధునికపద్యరచనలో అపూర్వప్రయోగాలు చేసిన ప్రామాణిక ప్రౌఢకవిగా ఆచార్యులవారికి పండితపరిషత్తులలో ఇప్పటికే మంచి గుర్తింపు వచ్చింది. కవి కెనడాలో నివసిస్తున్నా వారి కవితాభారతి తెలుగునేలపై రసధారలు వర్షిస్తోంది.

*"ప్రబంధప్రక్రియకు నవ్యతను, పునరుజ్జీవనమును కల్గింపవలెనను తలంపుతో నీకావ్యమును నవీకృతప్రబంధశైలిలో వ్రాసితిని"* అని ఈకవి చెప్పుకొన్నారు. ప్రబంధమంటే కొన్ని భావాలు తెలుగువారికున్నాయి. వాటినిక్రొత్తగాతలపింపజేయటం ఈ నవీకృతప్రబంధశైలి స్వభావమై ఉండాలి.

ప్రబంధప్రయోగాలు ఆలంకారికశైలిలో జీవించాయి. కావ్యశైలికి, ప్రబంధశైలికి భావుకులు భేదం పాటిస్తారు. కావ్యశైలిలో రమణీయమైన భావం ముఖ్యం, దాని శోభను

అలంకారాలు అతిశయింపజేస్తూ ఉంటాయి. ప్రబంధశైలిలో కవి ఆలంకారికమైన బాణీలోనే అందమైన భావాన్ని ఆవిష్కరించటానికి యత్నిస్తాడు. డాక్టర్ తిరుమల కృష్ణదేశికాచార్యులు ప్రధానంగా ప్రబంధశైలికి ప్రాణం పోశారు-జక్కన పాషాణానికి ప్రాణంపోసినట్లు. మచ్చుకొక పద్యం.

సీ. అశ్మ మొక్కటి కన్ను లరమోడ్చి ప్రియురాలి
పరిరంభసుఖమున బరవశించె
గ్రావ మొక్కటి నాసికాపుటంబులు విప్పి
ప్రియురాలి మల్లెల వలపు నానె
ప్రస్తరం బొక్కటి హస్తాంగుళు లదల్చి
ప్రియురాలి జెంతకు బిలుచుచుండె
పాషాణ మొక్కటి పాణిచే బ్రియురాలి
చెక్కు లల్లనల స్పృశించుచుండె

తే.గీ. ఱాయి యొక్కటి మది బ్రియురాలి గవయ
గలలు గనుచుండె నా చైత్రనిలయమందు
శిలలకైన బంచేంద్రియాస్తిత్వ మొదవు
ప్రాణదుండైన వర శిల్పి బ్రహ్మ యున్న. 4-75

అర్థాలంకారాన్ని ఆధునిక భావచిత్రంలాగా అభివ్యక్తిలో అమర్చిన ఈశైలిని ఆచార్యులవారు అభినవ ప్రబంధశైలి అని సంకేతించారు. ఈశైలియే ఈ ప్రబంధకవిత్వం.

ప్రబంధప్రయోగాలు వక్రోక్తిజీవితాన్ని మన్నించాయని నా "సాహిత్యచరిత్రలో చర్చనీయాంశాలు" సవివరంగా సమన్వయించి చెప్పింది. ఆదృష్టితో చూచినా ఈ ప్రబంధం ప్రయోగగౌరవాన్ని పొందుతోంది. ఉదాహరణకు కొన్ని అంశాలను పేర్కొంటాను.

ప్రబంధంలో కథ తక్కువగా ఉంటుంది వర్ణనలు హెచ్చుగా ఉంటాయనీ అంటారు. కాని, ఉన్న కథకూడా ప్రబంధవక్రతతో జీవిస్తూ ఉంటుంది. కథకొక మూల ముంటుంది.అంటే ఆధారమన్నమాట. దానిని యథాతథంగా అనుసరించకూడదు ప్రబంధకర్త. ఔచిత్యంకోసం, రసపోషణకోసం, పాత్రపోషణకోసం వస్తువును మార్చాలి, సంస్కరించాలి. ఆమార్పు ప్రబంధవక్రతలోని ప్రధానగుణం. ఈ ప్రబంధం ప్రబంధ వక్రతను పరిపూర్ణంగా పాటించింది. వివరాలు పీఠికనుండి తెలియవచ్చు.

ప్రబంధవక్రత కంటె ప్రకరణవక్రతను పాటించటం ప్రబంధప్రయోగాలలో కానవచ్చే విశేషం. నూత్నకల్పనలతోబాటు కావ్యంలో చిరస్థాయిగా నిలువగలిగే ఒక రమణీయసన్నివేశాన్ని చిత్రించటం ప్రకరణవక్రతలోని ప్రధానాంశం. మల్లికా నాట్యవర్ణనాసన్నివేశం శృంగారరసాలవాలమైన చిత్రరంగం. మనుచరిత్రలోలాగా ఈసన్నివేశం ద్వితీయాశ్వాసంలో ఉండటం శిల్పసమన్వితం.

అష్టాదశవర్ణనలు వర్ణనలకోసమే కాకుండా, ఆలంకారిక అభివ్యక్తుల కోసమే కాకుండా, భావుకతాప్రదర్శనలకోసమేకాకుండా, ప్రధానవస్తువుకు పోషకంగా అమర్చే రచనకూడా ప్రకరణవక్రతలో భాగంగా పరగణింపబడుతుంది. ఆచార్యులవారికి అష్టాదశవర్ణనలంటే అమితమైన అభిమానం. వాటిని అలంకృతం చేసి అందంగా ఆస్వాదయోగ్యంగా అమర్చటంతో పాటు కథాసందర్భౌచిత్యాన్ని పాటిస్తారు. కథాకల్పనలో వర్ణనల సౌలభ్యాన్ని కూడా భాగంగా సంభావించి శిల్ప సుందరంగా నిర్మించటం ఆచార్యులవారి సహజలక్షణం.

కుంతకుడే డాక్టర్ తిరుమల కృష్ణదేశికాచార్యుల కవిత్వం చదివి వారు చేస్తున్న నవ్యఛందః ప్రయోగాలను గమనిస్తే తన వక్రోక్తిజీవితంలో "ఛందోవక్రత" అని మరొక భేదాన్ని చేర్చుకొని ఉండేవాడు. అందర్నీ ఆకర్షిస్తున్న అంశం ఇది.

సమకాలీన సమాజచైతన్యాన్ని ప్రతీకాత్మకప్రవృత్తితో వస్తువునందు నిబంధించటం ప్రబంధంలోని ప్రౌఢవస్తుశిల్పం. మానవుని అపారశిల్పకల్పనాశక్తిని ఆవేశంతో అంతం చేసుకోకుండా అంకితభావంతో సమాజసేవగా మార్చుకుంటే అదే శిల్పరూపభగవదారాధనగా మారుతుంది-అనే సందేశం ఈప్రబంధం ప్రతీకాత్మకంగా ఇస్తుంది. ఈకథలో శిల్పి చేయి నరకబడదు-శిల్పమందిర నిర్మాణానికి ఉపయోగ పడుతుంది, అలా ఉపయోగపెట్టింది రామానుజులవారి దివ్యోపదేశం. ఆఉపదేశమే ప్రచ్ఛన్న కావ్యోపదేశం.

ఉపరంజనంతోపాటు ఉపదేశాన్ని అందించే ఈ అభినవప్రబంధాన్ని ఆంధ్రావళికి అందించే అవకాశం కలిగించిన ఆచార్యులవారికి యువభారతి కృతజ్ఞతాభివందనాలు.



జి.వి.సుబ్రహ్మణ్యం
అధ్యక్షుడు యువభారతి.

# పీ ఠి క

'జగన్నాథాన్తం సంస్కృతసాహిత్యం, విశ్వనాథాన్తం ఆంధ్రసాహిత్యం' అని పండితులు ప్రాచీనపద్ధతిలో గల సాహిత్యానికి ఒక సీమారేఖను నిర్ణయించారు. కాని కొందఱుకవులు గీర్వాణాంధ్రసాహిత్యాలలో సాంప్రదాయికకవితావ్యాసంగము చేయుచునే ఉన్నారు. ఇట్టి కవిత్వమును వ్రాయుటకు, చెప్పుటకు జన్మసంక్రాంతమైన గుణములతో బాటు ప్రాచీనసాహిత్యవిద్యావ్యాసంగము, శ్రద్ధాభక్తులు, పరంపరాగతమైన సంప్రదాయములు, శాస్త్రసంబంధవిషయపరిజ్ఞానములు అత్యంతావశ్యకములు.

ఈ 20వ శతాబ్దమున వర్తమానపరిస్థితులలో, 'అదిగో వచ్చింది, నాకు తెచ్చింది, అది నాకు నచ్చింది' - అనేదే కవిత్వమని భావించే వాతావరణంలో, కొన్ని చోట్ల ప్రతిభాసంపన్నమైన, గీర్వాణపదలాస్యవిన్యాసరంజితమైన, మఱియు తెలుగు పలుకుబడులతో ముడివడిన, సలక్షణమైన ఛందోరీతులు గల్గిన కవిత ఆంధ్రదేశమున అడుగంటక, ఇంకక, ఇంకను సజీవమై ఉన్నాననెడి సత్యమును చాటుచునే యున్నది.

వర్తమానమున ప్రాచీనమార్గకవితానుయాయులైన కవులలో కెనడాలోని వినిపెగ్ నగరములో గణన, జ్యోతిషవిద్యలలో పండితులైన శ్రీ తిరుమల కృష్ణ దేశికాచార్యులవారొకరు. వీరు నాకు కెనడాలో నాల్గుసంవత్సరాలనుండి పరిచితులు. వీరు భగవద్రామానుజాచార్యుల వైష్ణవసంప్రదాయానుయాయులు. వీరు మహాకవి కాళిదాసకృత ఋతుసంహార కావ్యమును నిర్దుష్టమైన చక్కని చిక్కని తెలుగులో అనువదించి ముద్రించినారు. 'హనుమప్పనాయకు' డను వివిధఛందోరీతులు గల కావ్యసృష్టిని చేసినారు. వీరు హనుమప్ప, ఋతుసంహారకావ్యకర్తలుగా విశ్వనాథపురస్కారము నందినవారు. గీర్వాణాంధ్ర భాషలలో మంచి వ్యుత్పత్తిని సంపాదించి పూర్వజన్మసంస్కారజన్యప్రతిభావిశేషముతో కావ్యసంతతిని విస్తరింపజేయ సమకట్టినారు.

ఈమధ్య వీరు క్రొంగ్రొత్తగా ఆరు ఉల్లాసములు గల మహాశిల్పి జక్కన చరిత్రను మహాప్రబంధముగా వ్రాసినారు. దీనికి పీఠికను వ్రాయుటకుగాను కెనడాలో అటావా నగరమున నున్న నాకు పంపినారు. కెనడాలో జరిగిన ఈ నిర్దుష్టకావ్యప్రసూతికి సంతసించి ఈ మహాప్రబంధాన్ని అవిరామంగా చదివి, అందలి రమ్యగుణగణపరిశీలన చేసి తృప్తుడనై పదేపదే కావ్యపఠనాస్వాదసంజాతమధుపానదృప్తుడనై ఈ పీఠికను వ్రాయుటకు సంసిద్ధుడనైతిని.

*అపారే కావ్యసంసారే కవిరేకః ప్రజాపతిః*
*యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే॥ (ధ్వన్యాలోకము)*

ఈ యనంతమైన కావ్యసంసారంలో కవిబ్రహ్మ తనకు నచ్చినట్లుగా కావ్య జగత్తును సృష్టిస్తాడు. ఈ వర్తమానంలో వర్ధమానమౌతున్న పరిస్థితులలో ఈ మహాశిల్పి జక్కన ప్రబంధము ఒక చిత్రవిచిత్రరసమయభావనాసంభారనిస్తులమైన కావ్యజగత్తు. ఈ కవి యీ కావ్యజగత్తులో ప్రాచీనపద్ధతిపరిధిలోనే ఉండి, ప్రాచీనపద్ధతిలో కథాకథనాన్ని, వర్ణనలను, పాత్రసృష్టిని యథాతథంగా చేయకుండా కొన్ని క్రొంగ్రొత్త దారులు, డొంకలు, పొంతలు, బాటలు త్రొక్కి బహుముఖముగా తన ప్రతిభావ్యుత్పత్తులను కనబరచినాడు.

ఈ ప్రబంధప్రారంభమున దైవప్రార్థన తరువాత అవతారికలో గల కవిస్తుతి పద్యములలో శ్రీ భగవద్రామానుజులవారిని, నన్నయ, తిక్కన, పోతన, శ్రీనాథ, నంది తిమ్మన, ధూర్జటి, రామరాజభూషణ, శ్రీకృష్ణదేవరాయలను, తిరుపతివేంకటకవులను, కవిసమ్రాట్ విశ్వనాథసత్యనారాయణప్రభృతికవులను స్తుతించి, కుకవినింద చేసి, జక్కనా చార్యుని చరితంబు చక్కగా ప్రబంధరూపమున వ్రాయుమని స్వప్నమున బేలూరులోని శ్రీ చెన్నకేశవస్వామివారు సెలవిచ్చిన ప్రకారము వ్రాసితినని ఈ కవి పేర్కొనెను.

ఆంధ్రమహావిష్ణువు స్వప్నమున కానుపించి, 'దేశభాషలందు తెలుగు లెస్స' అని నుడివి తన ఆముక్తమాల్యదాప్రబంధమును వ్రాయించెనని శ్రీకృష్ణదేవరాయలవారు ఆముక్త మాల్యద అవతారికపద్యములలో వ్రాసినారు. ఈ ప్రబంధమునందు కవి వ్రాసిన స్వప్న వృత్తాంతమును చదివిన వెంటనే పై రాయలవారి స్వప్నవృత్తాంతము స్ఫురణకు వచ్చు చున్నది. ఈ కవి అవతారికలోని కవిస్తుతిలో పేర్కొనిన కవుల కవితారీతుల ననుసరించి కవితను వ్రాసినట్లు స్పష్టముగా గోచరించుచున్నది.

*కం. పలికెడి దొక శిల్పకళా*
*జలజాసనుకథ యట, అల జలజాక్షుండే*
*పలికించెడునట దానిం*
*'బలికెద వేఱొండు గాథఁ బలుకఁగ నేలా!'*

అను అవతారికలోని 24వ పద్యము మహాకవి పోతనామాత్యులవారి శ్రీమన్మహాభాగవతము నందు గల శంకాసమాధాననిశ్చయప్రతీకపద్యమునకు తుల్యముగా నున్నది.

కవి దేశికులు పూర్వకవిప్రబంధప్రక్రియను సరసౌచిత్యభాసురముగా మార్చి, నవ్య మార్గాలలో పాత్రలకు, వర్ణనలకు సమానప్రతిపత్తుల నొసంగి, వర్ణనలు పాత్రపోషణ కంగములుగా నుండునట్లును, ఆ వర్ణనలు కృత్రిమములుగాక సహజముగా సన్నివేశములకు తోడ్పడునట్లుగా నుండునట్లును, ఈ కావ్యమును వ్రాసినట్లు తోచుచున్నది. ఈ కవి సన్నివేశానుగుణంగా కొన్ని నూతన (స్వకల్పిత) వృత్తాలను ప్రవేశపెట్టినాడు. ఇవి వరుసగా, వసంతకోకిల, మనోరమ, విభావరి, నయాగరా, పరభృతము, విలాసిని, సుగతి, ప్రభావతి,కైవల్యము – అనునవి. వీని లక్షణములను గ్రంథకర్తయే వివరించినాడు. ఇవియేకాక, చంప కోత్పల తరల మత్తేభ శార్దూలవిక్రీడిత మత్తకోకిల భుజంగప్రయాత వనమయూర స్రగ్విణీ దండకములను, ఆటవెలది ద్విపద కంద సీస గీత రగడలను వాడినాడు. కొన్నిచోట్ల నిర్ణీతసంఖ్య గల ఖండ, త్ర్యస్ర, చతురస్ర మాత్రాగణసంయుతములైన వృత్తములను, కంద సీస ద్విపదలను కొద్దిగా మార్పు చేయుటవల్ల సిద్ధించిన కందతుల్య, సీసతుల్య, ద్విపదతుల్య చ్ఛందస్సులను వాడినాడు. ఈ విధముగా నీ కావ్యము సమధికఛందోవైవిధ్యము గలిగి చారుగతిసమేతమై యొప్పారుచున్నది.

## ప్రథమోల్లాసము

ఇందు వసంతర్తువర్ణనము, జలకేళి, మల్లిక అజ్ఞాతశిల్పిని జూచి భావించిన సన్నివేశములు బహురమ్యములు. వసంతర్తువున ఈక్రింది పద్యమును పరిశీలింపుడు:

*చం. చిగురుల చీరఁ దాలిచి, విచిత్రమనోజ్ఞసుపుష్పభూషలన్*
*సొగసుగ గాత్రమం దునిచి, సొంపుగ దక్షిణమారుతాఖ్య నా*
*ట్యగురుఁడు భంగిమల్ దెలుప, నాడెను కాననలక్ష్మి నేఁడిదే*
*ఖగకులగీతికారుతుల కర్షముగాఁ దనువల్లిఁ ద్రిప్పుచున్.* 1-50

దక్షిణానిలుడు నట్వాంగం వేస్తూ నాట్యభంగిమలను నేర్పుతుండగా వాటిని అనుకరిస్తూ, పక్షులధ్వనుల కనుగుణంగా ఈపద్యంలో వసంతర్తువులో రూపసియైన కాననలక్ష్మి ఉత్ప్రేక్షాలంకారమున రూపుదాల్చి నాట్యంచేస్తున్నట్లు కనులకు గొట్టవచ్చినట్లు కనుపించుచున్నది. ఇక్కడ జలకేళియందు గల పద్యాలన్నీ వసుచరిత్రలో గిరిక చెలికత్తెలతో జలకేళి చేస్తున్న విధానాన్ని తలపింపజేస్తూ మనోహరములై యున్నవి.

*'తరుణి యొక్కతె నీరముం దగఁ దట్టి సవ్వడిచేయఁగన్ ...'* 1-77
*'అతివ యొర్తుక మధ్యభాగమునందు నీదుచునుండఁగా'* 1-78

అను తరలము లతిహృద్యములై యున్నవి. ఆంధ్రసాహిత్యములో తరలమును ప్రవేశపెట్టి విరివిగా వాడిన కవివర్యుడు ఆదికవి నన్నపార్యుడు. తరువాత వచ్చిన కవులును అటనట తరలములను వ్రాసినవారే. ఈ కావ్యమున దేశికు లనేకసందర్భములలో చక్కని తరలములను వ్రాసిరి.

## ద్వితీయోల్లాసము

ఇందు సాయంకాలవర్ణనము, చంద్రోదయచంద్రికావర్ణనలు, మల్లిక వనమందు గన్న (జక్కన) శిల్పిని గూర్చి యోచించుట, జక్కనసైతము మల్లికను గూర్చి యోచించుట, ప్రాతఃకాలవర్ణనము, చైత్రోత్సవవర్ణనము, నృత్యాలయవర్ణనము, పూర్వరంగవర్ణనము, నృత్యవర్ణనము ప్రధానములైనవి. సాధారణంగా ప్రబంధాలలో వచ్చే చంద్రోదయచంద్రికా వర్ణనానంతరచంద్రాద్యుపాలంభనాదుల స్థానములో, నాయికానాయకు లొకరినిగూర్చి వేఱొకరు చింతించుట, జక్కన మల్లికాప్రతికృతిని వ్రాయుట యను విషయములు వర్ణితములై, నాయికానాయకుల మనస్తత్త్వచిత్రీకరణము జరిగినది. ప్రతికృతి వ్రాయుట, దర్శించుట యనునవి సంస్కృతకావ్యప్రక్రియలు. వీనిని చంద్రోపాలంభనస్థానములో దేశికులు సన్నివేశ పాత్రపోషణాది ప్రయోజనార్థమై ప్రవేశపెట్టినారు. ప్రత్యేకించి పూర్వరంగ, నాట్యవర్ణనములు భరతుని నాట్యశాస్త్రము, నందికేశ్వరుని అభినయదర్పణములు ప్రతిపాదించిన మార్గములో సాగినవి.

ఈ యుల్లాసమున సాయంకాలవర్ణనమున గల పద్యములన్నియు ఉత్ప్రేక్షాలంకారభూషితములై చదువరుల మనస్సుల నుయ్యలల నూపుచున్నవి.

తే.గీ. *పావనం బగు గంగ నాప్లవము నందు*
*పరమహంసలీల నపరవార్ధియందు*
*విష్ణుపదచారియును, తపోవిభవుఁడైన*
*హంసుఁ డొక్కఁ డాప్లావంబు నందె నపుడు.* 2-3

ఈ చిన్నపద్యము రమ్యమైన క్షితిజావర్ణనమును వేదాంతపరముగా వివరించినది. ఈ పద్యమున మూడర్థములు గలవు. (1) పవిత్రగంగానది యందు హంస స్నానమాడినట్లు (రాయంచలపిండు గంగానదిలో శరత్తునందు స్నానమాడునని కవిసమయము – కాళిదాస మహాకవి తన కుమారసంభవకావ్యమున 'తాం హంసమాలాః శరదీవ గంగాం' – అని వర్ణించినాడు; (2) తపస్వి విష్ణుపాదముచెంత చరించు హంస. అనగా ఆత్మ. అంటే పవిత్రాత్మ గల పరమహంసయైన భక్తుడు; (3) తపః అంటే వేడిమి. తపోవిభవుడు అనగా వేడిమిచే వాడియైన కిరణములుగల సూర్యుడు. ఆయన విష్ణుపదమున చరించువాడు. అనగా ఆకాశ సంచారి.

ఇక్కడ ప్రస్తుతాంశము సంధ్యాసమయవర్ణనము. తపోవిభవుడై విష్ణుపదచారియైన సూర్యుడు పశ్చిమాంబుధియందు గ్రుంకెను. అనగా సూర్యుడస్తమించెను. ఈ ప్రస్తుతార్థము నుండి ఈ పద్యమున గల పరమహంసలీల, విష్ణుపదచారి, హంస, ఆప్లావము అను శబ్దముల శక్తివలన అనేకార్థములు వచ్చుటవలన (1) హంస గంగలో స్నానమాడుట, (2) విష్ణు సన్నిధిలో గల పరమహంస గంగాస్నానమాడుట అను అప్రస్తుతవిషయములు స్ఫురించుట వలన, 'పరమహంసలీల' యనుటవలన ఈ పద్యమున సమాసోక్త్యలంకారము, శ్లేషాలంకారము, ఉపమాలంకారము ఈ మూడును పెనవేసికొని ముప్పేటలవలె విరాజిల్లుచున్నవి.

మల్లిక అజ్ఞాతపురుషుని గూర్చి యోచించు సన్నివేశమున, *'ఎక్కడివాఁడొ యాతఁడు రతీశుఁడు ధాత్రికి డిగ్గినట్లుగా ...'* అను పద్యము అల్లసానివారి మనుచరిత్రలోని *'ఎక్కడివాఁడొ యక్షతనయేందుజయంతవసంతకంతులన్ ...'* అన్న పద్యమును స్ఫురింపజేయుచున్నది.

ప్రాతఃకాలవర్ణనమున గల పద్యములన్నియు సుందరభావనాపరివేష్టితములై అనేక శిల్పములను చిత్రవిచిత్రగతులతో బ్రదర్శించుచున్నవి. విశేషించి ఈ క్రింది తేటగీతిని బరికింపుడు:

తే.గీ. *వెండివెల్గుల లంకెల వేసి యిలకు*
*అనిలధుత మగుచున్న యబ్జాకరమునె*
*పీటగా నొనరించి కృపీటజాప్తుఁ*
*డూయెలం గట్టి పద్మిని నూపె నపుడు.* 2-78

ఇందు కమలాప్తుడు తన వెండికిరణము లనెడి తాళ్లను యొడిసిపట్టి తాళ్లచివళ్లను క్రిందికి జారవిడిచి ఆ త్రాటికొసలచే పద్మషండంబులను పెనచికట్టి ఆ పద్మషండంబుల పీటపై పద్మినిని కూర్చుండబెట్టి, పవనచాలితతరంగముల మిషచే ఊపుచుండెనని కవి ఉత్ప్రేక్షించినాడు. ఈ ఉత్ప్రేక్షాలంకారమున నాయికానాయకుల ప్రేమవిహారము, పద్మినీనాయికా డోలాచలనోచ్చలచ్చరణముల బెడంగు స్ఫురించుచున్నవి. ఆ కారణమున నిందు శ్లేషాలంకార, రూపకాలంకార గర్భితమైన ఉత్ప్రేక్షాలంకారము స్పష్టముగా గోచరించుచున్నది. ఇదే సందర్భములోని

తే.గీ. *తిరిగివచ్చిన యినునికై త్వరితగతిని*
*పద్మిని భువనభవనకవాటములను*
*తెఱవఁగా నొదవిన క్రేంక్రవిరుతరీతి*
*దిక్కులను ద్విజరావముల్ పిక్కటిల్లె.* 2-75

తే.గీ. అంబుజాప్తుని గాంచిన యాక్షణంబ,
కమలినీనేత్రములనుండి కారుచున్న
హర్షబాష్పపృషంతులో యనఁగ నొప్పె
తుహినబిందువు లాకుల తుదలయందు. 2-76

తే.గీ. స్వచ్ఛహిమబిందుచయమందు స్నానమాడి,
ఫుల్లపంకేజమకరందభోజ్యచయము,
పద్మసౌరభ్యగంధిలవస్తుచయముఁ,
గూర్చుకొని హరిని సమీరుఁ డర్చచేసె. 2-78

అను పద్యములు సులలితభావపరిపూర్ణములై సరసులకు కడు రంజకములై యున్నవి.

## నాట్యవర్ణనము

ఈ వర్ణనమున 107 నుండి 122 వరకు గల పద్యము లన్నియు ఉత్కటభావనాపరిపుష్టములై యున్నవి. నాట్యగత్తెకు అంగసౌష్ఠవము, అంగసౌకుమార్యము, విద్యుల్లతబోలిన అంగాంగచాలనములు, భావపూర్ణలోచనములు, భావాభిరమ్యభ్రూభంగ విన్యాసములు - ఇత్యాదులు సహజాలంకారములు. మల్లిక ఇట్టి నాట్యగత్తె. ఆమె రూపురేఖావిలాసము లీక్రింది పద్యములలో చక్కగా వర్ణింపబడినవి:

సీ. నీలసర్పముఁబోలు నిడుదంపువేనలి
అలనల్లఁ బిరుదుపై నాడుచుండ,
కమ్మకస్తురి తిలకంబు ఫాలమునందు
నెలలోని మచ్చయ ట్లలరుచుండ,
స్రక్చందనార్చిత శౌరిశంఖమురీతి
హారాంచితగ్రీవ మమరుచుండ,
గాలికిం గదలాడు క్రమవల్లరులట్లు
మృదువుగా బాహువుల్ గదలుచుండ,
పైకిఁ జెక్కిన వల్లెవాటు సందుననుండి
పాలిండ్లు బొంగుచుం దేలుచుండ,
పవమానవిధుతరంభాకాండముల రీతి
చలదూరువులు సొంపులొలుకుచుండ,

తే.గీ. పసుపుపారాణి లలందిన పాదయుగళి
కదలుచో ఘల్లుఘల్లంచు గజ్జె లాడ,
అలలకైవడి హస్తంబు లాడుచుండ,
నాట్యవేదికం బొల్చెను నటి యొకర్తె. 2-109

కం.తు. విప్పారిన వదనముతో,
విప్పారెడు గన్నులతుద విరిసిన చూపులతో
నప్పడంతుక, మోదముతో
విప్పారంగంజేసె నపుడె ప్రేక్షకవదనములన్. 2-110

ఆపైని నాట్యారంభమునందు వ్రాసిన

చం. తొలుత గజాననస్తవముతోడ నుపక్రమణంబు చేసి, పైం
జలితసుపల్లవాంగుళుల స్వస్తికపుష్పపుటాదిహస్తముల్
లలితముగా ఘటించి, యతిరమ్యములౌ కరణాంగహారముల్
వెలయంగంజేసి, యీశునకుం బ్రీతి సుమాంజలి సంఘటించియున్. 2-112

అను పద్యమున సవిలాసపరిసర్పితహస్తపాదసమన్వయసంయుతములైన కదలికల కూటములు గల స్వస్తిక, పుష్పపుట హస్తాభినయములు సూచింపబడినవి.

సీ. మన్మథావిష్టమౌ మంజులాపాంగదృ
గ్రచనచే శృంగారరసముం జిలికి,
వ్యాకుంచితాపాంగపక్ష్మయై, వ్యాకుల
తారయై, భీభత్స మారంజూపి,
కుటిలంపు భ్రువులతో, క్రూరంపు జూపుతో,
రక్తాక్షియై రౌద్రరసముం జిమ్మి,
కొంతగా ముడిచి పక్ష్మాంతముల్, బొమలెత్తి,
తరళదృష్టుల నద్భుతంబుం జూపి,
విప్పారుఱెప్పలున్, వెలుంగు తారకలొప్పం,
జకితదృష్టుల భయానకముం జూపి,
విచ్చుకన్నుల మధ్య వెలయం దారకలు, గం
భీరదృష్టులం జూచి వీర మొలికి,

తార లించుకఁ దోఁపఁ దరముగా మూసి తె
రచుచు ఱెప్పలు హాస్యరసము నొల్కి,
అర్థమీలితములై సార్ధ్రతారకములై
కదలని చూడ్కులఁ గరుణఁ జూపి,

తే.గీ. దృష్టుల కనుగుణంబుగా దేహలతను
సరసముగఁ ద్రిప్పి యామె లాస్యంబు చేసె;
దాని కా తోఁటలో నున్న స్థాణువులును
సపదిసంజాతపల్లవస్థాను లయ్యె. 2-116

అను పద్యమున అష్టవిధరసదృష్టివిలసితమైన మల్లికాలాస్యము శాస్త్రీయముగా నభివర్ణింప బడినది (భరతుని సిద్ధాంతము ప్రకారము రసము లెనిమిదే. కాని తరువాత వచ్చిన లాక్షణి కులు 'శాంతోఽపి నవమో రసః', అని పేర్కొనిరి. ఇక్కడ దేశికులు భరతశాస్త్ర, అభినయ దర్పణముల ననుసరించుటచేత అష్టరసములనే స్వీకరించిరి). ఈ యష్టరసముల ప్రదర్శనము నరకాసురవధఘట్టమున పోతనామాత్యులవారు చూపెట్టిన సత్యభామ యొక్క వీరశృంగారరసప్రదర్శనాభినయమును పాఠకుల సమక్షమునకు దెచ్చుచున్నది. మరియు

ఉ. ఆ యువనర్తకీమణిని ఆ వనమందునఁ గన్న దానిఁగాన్
ఆ యువశిల్పిలోకవిధుఁ డాత్మ నెఱింగి మనంబు త్రొట్రిలన్
కాయము నిండఁ బుల్కల నికాయముఁ బూనును; స్వేదబిందుసం
వ్యాయతమై చెలంగఁ దను వాపయి వేపథు వూనుఁ జయ్యనన్. 2-119

అను పద్యములో, 'స్తంభః ప్రళయ రోమాంచః స్వేదో వైవర్ణ్య వేపథూః, అశ్రు వైస్వర్య మిత్యష్టౌ సాత్త్వికాః పరికీర్తితాః ' అని ప్రతాపరుద్రీయములో చెప్పబడినట్లుగా సాత్త్విక భావములు చూపెట్టబడినవి.

రాధామాధవులప్రణయఘట్టాభినయమును ప్రశస్తముగా, రసవత్తరముగా, విస్తార ముగా వర్ణించుట, ఆ అభినయమును సందర్శించువేళ గూళిదేవుడును, జక్కనయును బ్రద ర్శించిన మనోభావముల వర్ణనలద్వారా వారివిభిన్న మనస్తత్త్వములను చిత్రీకరించుట ద్వితీ యోల్లాసములో చూపెట్టబడిన మెఱుగులు.

## తృతీయోల్లాసము

నాట్యాంతసన్మానవర్ణనంబున చూపిన గూళిదేవుని స్త్రీలౌల్యము, మల్లికాజక్కనల పరస్పరానురాగవర్ణనము, పునర్దర్శనము, పునర్దర్శనసందర్భములో నాయికానాయకుల మధ్య జరిగిన నర్మగర్భితచతురసంభాషణము, అనురాగసంవర్ధనము, వివాహప్రస్తావన, వివాహానంతరము మల్లన వధూవరులకు నుడివిన నడవడికలు, అన్నిటికన్న ముఖ్యముగా సంభోగశృంగారవర్ణనము క్రొత్తపద్ధతిలో జరిగినవి. సన్మానము అనే శీర్షికలోని `ఆజాను బాహుండు, నరవిందనేత్రుండు ...` అను పద్యము ఆత్మకూరి మొల్ల రామాయణములోని శ్రీరామచంద్రుని వర్ణనను జ్ఞప్తికిదెచ్చుచున్నది. విశేషించి, సంభోగశృంగారవర్ణనములో గల

*మ. విభునిం గాంచిన తత్క్షణంబె విరియున్ వేళేకు కెందమ్ములై,*
*విభునిం బాసిన తత్క్షణంబె ముగడున్ వేవేగ లేమొగ్గలై,*
*విభుఁ డాలింగనమందుఁ గూర్ప వెలయున్ వే విస్ఫుటార్థంబులై,*
*శుభరాజీవదళాయతాక్షి కిపు డక్షుల్ చిత్రచిత్రంబుగన్.* *3-141*

పైపద్యము మల్లికయొక్క సంయోగశృంగారావస్థను రమ్యముగా వర్ణించినది. ఇందు ప్రియుని చెంగట విభిన్నానుభూతుల భావప్రకటనలో మోట్టాయిత, కుట్టమిత, బిబ్బోకాది శృంగారచేష్టలను, అవిదితరసభావతన్మయతలో చిత్రవిచిత్రభావరూపాలను పొందిన రాజీవ దళాయతాక్షి (మల్లిక) అక్షులు ఎట్లు చూపెట్టినో కవి వర్ణించినాడు. ఇవన్నియు స్వానుభవైక వేద్యభావములు. ఈ భావములు రసికులకు, సరసహృదయులకు, కళాప్రియులకు, కళా రాధకులకు మాత్రమే తెలియును. వీటిని వివరించి చెప్పుట కష్టము. ఆలంకారికులు సంభోగ విప్రలంభశృంగారములలో విప్రలంభమునకే ప్రాధాన్యత నిచ్చినారు. విప్రలంభశృంగార మున రస ముత్కటమై అన్ని విధముల మెండుగా నుండును. కాని ఇచ్చట దేశికులు సంభోగ శృంగారమున రసహృదయులను ఎక్కడకో తీసుకొని పోయినారు. అక్కడనే సహృదయుల హృదయములు ప్రతిక్షణము రసానుభూతిని పొందునట్లు చేసినారు.' చిత్ర చిత్రంబుగన్` - అన్నచోట ఎన్నియో ధ్వనులు తొంగి చూచుచున్నవి. ఆ చిత్రము నిరంతరము అంతములేనిదై, భావనాఫలకమున అనంత రూపములను చూపుచు మార్పు చెందుచునే యున్నది. ఈ పద్యము విచిత్రరసానుభూతి కాలవాలము.

*ఉ. ఆమె ప్రభాతమందుఁ దరుణాతప మాస్యముఁ గ్రమ్ముచుండఁగన్*
*గోముగ నిల్చి యద్దమును గొంచు నిజాస్యముఁ గాంచుచుండగన్*
*గాముని కీర్తిరేఖలటు గ్రాలుచు మోవిపయిం బయల్పడుం*
*బ్రేమపుఁజిన్నె లెన్నొ, యవి ప్రీతిఁ గనుంగొను చామె సిగ్గిలున్.* *3-142*

ఉ. చిక్కులువడ్డ హారమును జెమ్మటఁ దోగిన గాత్రవల్లరిన్
నొక్కులువడ్డ మోవినిఁ గనుంగొను వాసతి రాత్రియందునన్
మక్కువమీర సల్పిన 'యమాయికపుం' బను లాత్మయందునం
గ్రక్కునఁ దోఁపఁ గల్యమున గాటుపుసిగ్గున మొగ్గయై చనున్. 3-143

ఈ పద్యములను చదివిన వెంటనే 'సరసుల డెందముల్ విరియఁ జక్కగ విచ్చిన పూవులై తగన్' - అని చెప్పిన అందు అతిశయోక్తి లేశమైనను ఉండదని నా నమ్మకము. 'గాటుపుసిగ్గున మొగ్గయై చనున్' - అన్న వాక్యము ఈ ప్రబంధమున ఒక మహావాక్యము. వేదాంతమందు వేదాంతసారముగా పంచమహావాక్యము లున్నట్లు ఈ ప్రబంధమున రస సిద్ధాంతమునందలి రససారముగా కొన్ని వాక్యము లున్నవి. అవియే 'అకుల్ చిత్ర చిత్రంబుగన్', 'గాటుపుసిగ్గున మొగ్గయై చనున్'- ఇత్యాదులు. సురతమృదితయైన మల్లిక తన తనువల్లియందలి కందిన స్థానముల బెడంగులను, నఖక్షతదంతక్షతముల గాటులను పదేపదే ఆదర్శంబున వీక్షించి ప్రకటించిన శృంగారచేష్టలు, సిగ్గుదొంతరలు రసికజనమనోభి రామములై విలసిల్లుచున్నవి.

సీ. రంగు లింపుగఁ గల్పి రమణీమణి యొసంగ
రమ్యచిత్రంబుల వ్రాయు నతఁడు,
శృంగారమయనాట్యభంగు లాసతి సూపఁ
జెలువారు శిల్పముల్ దొలుచు నతఁడు,
రంగారు భావంబు నంగనామణి సూప
శృంగారగీతి రచించు నతఁడు,
శృంగారగీతి నా చెల్వ యాలాపింప
హితముగా వీణ వాయించు నతఁడు,

తే.గీ. ఆమె యెదుటను నిల్చుచో నతఁడు నిల్చు
నామె కనుపాపలందుఁ బ్రియంబు గదుర,
ఆమె ప్రక్కకు నిల్చుచో నతఁడు వొల్చు
భారతిం గూడియున్నట్టి బ్రహ్మవోలె. 3-148

అను పద్యమున వారల అన్యోన్యత కళాత్మకమై, రసస్వరూపమై, కళాసృష్టికి దోహదమై, భారతీబ్రహ్మలు కలిసి చేయు కళాసృష్టివలె, సంగీతసాహిత్యములవలె అవినాభావ సంబంధము గలిగి శబ్దార్థములవలె నున్నదని దేశికులు ధ్వనింపజేసినారు.

స్నేహసంవర్ధనము అను ఘట్టమున నున్న ఈక్రింది పద్యము ఒక రతిరహస్య భంగిమవలె కన్పట్టుచు వసుచరిత్రలోని శుక్తిమతీకోలాహలుల సన్నివేశమును గుర్తుకు దెచ్చుచున్నది.

తే.గీ. ఆమె నదివోలె వక్రంబులైన గతుల
సంచరించును ఘనవేణి సంచలింప
అతఁ డామోదరసభంగితాబ్ధి యగుచు
ఐక్యమొనరించుకొను లోన నామె నపుడు. 3-103

ఆమె నదివలె మెలికలు తిరిగి పారవశ్యమున నటింప మేఘచ్ఛవితో నున్న చిక్కని చక్కని పొడవైన ఆమె ఘనవేణి సంచలనముచే చెదరగా అత డామె దేహవినిర్గత ఆమోదముచే (పరిమళముచే) ఆనందరసకల్లోలితాబ్ధియందు మునిగి ఆమెను తనలో (తన తనువులో) ఐక్యమొనరించుకొనును. అందువలన వీరిద్దరు అవిచ్ఛిన్న రతియందు మునిగితేలుచుండిరని ధ్వనించుచున్నది. ఈపద్యము మానసికసంభోగమున కుదాహరణము (రతియందు ముంగురులు చెదరుట, వేణి చలించుట, ఒడలు మెలికలు తిరుగుట, చివరకు తన్మయత్వము కలుగుట సహజము).

కం. సౌదామనిఁ బోలెడు నా
పైదలి తెరచాటు కట్టు వైళమె యేఁగన్
వేదికయందున ధ్వాంతం
బాదేశంబైన యట్టు లగపడెఁ బ్రజకున్. 3-13

మెఱుపుతీగవలె కనుపించి ఆమె (మల్లిక) ఒక్కసారి తెరచాటు కరుగగా వేదిక యందున వెలుగును హతమొనర్చి ఒక్కసారిగ ధ్వాంతము వ్యాపించినట్లు ప్రజలకు కనిపించెను. ఇందు భ్రాంతిమదాలంకారము, అతిశయోక్త్యలంకారమును గలవు. ఇందు 'ధ్వాంతం బాదేశంబైన యట్టు' లని ఒక వైయాకరణప్రయోగము గలదు. 'శత్రువ దాదేశః' - అని వైయాకరణుల కథనము. వెలుగును త్రోసిరాజని, దాని స్థానమున ధ్వాంతము శత్రువువలె వచ్చి కూర్చుండెను. ఇట్లు బలవంతముగా ఒక వర్ణస్థానమున వేఱొక వర్ణము వచ్చుటనే వ్యాకరణశాస్త్రమున ఆదేశమందురు. ఇట్టి ప్రయోగములకు శ్రీనాథమహాకవి ప్రసిద్ధుడు. ఈ ప్రబంధమున కొన్నిచోట్ల శ్రీనాథప్రయోగములు కానవచ్చుచున్నవి. ఇది దేశికుల వైశిష్ట్యము.

## చతుర్థోల్లాసము

ఇందులో మల్లికకొఱకై గూళిదేవుడు విరహము నందుట, అత డామెను ముఖ్య నర్తకిగ రమ్మని పిలువనంపుట, ఆమె గృహిణుల కది తగదని నిరాకరింపగా, జక్కన నతడు వసంతమండపనిర్మాణవ్యాజముతో ఆమెతోబాటుగా తననగరికి రప్పించుట, అట్లు రప్పించి యామెను జక్కన ఱాలు దెచ్చుటకై అడవికి పోయిన సమయమున గూళిదేవుడు బలాత్కరించుట, ఆమె చాకచక్యముతో గూళిదేవునినుండి తప్పించుకొని మల్లనతో సహా అడవిలో నున్న జక్కనను చేరబోవుట వర్ణితములైనవి. ఇందులో ముఖ్యముగా వసంత మండపనిర్మాణవర్ణనము, మల్లికాదౌహృదవర్ణనము, ప్రదోషవర్ణనము, గూళిదేవుని ప్రాసాద వర్ణనము రమ్యముగా సాగినవి. ఇందులో సన్నివేశవర్ణనముల ద్వారా గూళిదేవుని స్త్రీలౌల్య కౌటిల్యములు, మల్లికయొక్క చాకచక్యసమయస్ఫూర్తులు చక్కగా నిరూపింపబడినవి.

ప్రపంచసాహిత్యజగత్తులో విరహతాపము లేని కావ్యములు లేవు. ప్రతికవి విరహ వర్ణనసందర్భములం దేవేవో క్రొంగ్రొత్తభావములను చూపుచునే యుండును. ఇందు క్రింద చూపబడిన పద్యములు చిన్నవైనను భావములతో నిండి పండినవి. అలతి పదప్రయోగముల తోడ సుందరభావప్రకటనను చేయుటలో దేశికులు సిద్ధహస్తులు. చూడుడు:

తే.గీ. *సవితకంటెను తీక్ష్ణుఁడై జ్యోత్స్న యందుఁ*
*బొదలు 'చలివెల్గు' నాతండు వదన మెత్తి*
*సూటిగాఁ జూడఁజాలక నీటియందు*
*నొందు తద్బింబముం గాంచి పొందుఁ దృప్తి.* 4-5

తే.గీ. *ఎడతెగని జాగరణచేత నెఱ్ఱనైన*
*అతని నేత్రము లపుడా పయస్సులందు*
*ప్రతిఫలించుచు నందె చెల్వారుచున్న*
*తొవలకంటెను వేఱుగఁ దోఁచకుండు.* 4-6

విరహతప్తుడైన గూళిదేవునికి నింగిలో నున్న అసలుజాబిల్లి తాపమును రెచ్చగొట్టుచు వేడిగా దోచుటచేత, అతడు నీటియందు ప్రతిబింబించిన (నీటిలోనుండుటచేత చల్లబడిన) చంద్ర బింబమును గాంచి తృప్తిచెందుచుండెను. ఇది క్రొంగ్రొత్త భావము (ఇందు జ్యోత్స్న యను శబ్దము క్వచిత్ప్రయుక్తమైన మారుమూల ప్రయోగము). విరహముచే గల్గిన నిద్రలేమిచే ఎఱ్ఱ నైన ఆ గూళిదేవునికన్ను లప్పు డా నీటిలో ప్రతిబింబించి, ఆ చెరువులో సహజముగా నున్న చెంగల్వలకంటె వేఱుగా గుర్తుపట్టరాకుండా ఉన్నాయట! రాజైన కుంతకుడు తన 'వక్రోక్తి

జీవితం' అనే అలంకారగ్రంథంలో 'వక్రోక్తి రేవ కావ్యస్య జీవితం' అని చెప్పిన విధంగా ఈకవి యిచ్చట వక్రోక్తితో గూళిదేవుని విరహావస్థను రమ్యముగా వర్ణించినాడు. ఇట్టు లీ రెండు పద్యములయందలి భావములు, పదప్రయోగములు కడుసుందరములై శోభిల్లుచున్నవి.

ఈ యుల్లాసమున 'ఒక్క మేఘము దోఁచె నులితోడ శిల్పములఁ జెక్కుచున్నట్టి యువశిల్పివోలె' అను పద్యపుపోకడ కవిసమ్రాట్ విశ్వనాథసత్యనారాయణగారి ఆంధ్ర పౌరుషమను కావ్యమున కొండవీటి పొగమబ్బులలోని సీసపద్యమువలె సాగినది. ఈ సందర్భములో చేయబడిన ప్రకృతివర్ణనలు భావికథాధ్వనిపూరితములై మిక్కిలి యర్థ వంతముగా నున్నవి.

వసంతమండపనిర్మాణవర్ణనము నందలి పద్యము లన్నియు పలువిధముల శిల్పా కృతులతో రూపుదాల్చి పాఠకులకు గోచరించుచున్నవి. అందు విశేషించి

సీ.తు. కనుసన్న లన్ మెలఁగు కాంతుండు కడనుండ
మనమందు నుప్పొంగు మగువ నొకట,
విభుఁ డేఁగుదెంచు నావేళకుం దొడి, సెజ్జ
సంసిద్ధమొనరించు చాన నొకట,
వేళకున్ రాకున్న విభునికై మనమందుఁ
బరితపించుచు నున్న ప్రమద నొకట,
సంకేతమును జేర స్వామి రాకున్న స్మర
సంభ్రమార్తిని జెందు సకియ నొకట,
సంకేతములఁ గాంచి స్వామితనువందుఁ బొల
యల్కతోఁ బతిఁ దూఱు నతివ నొకట,
సంకేతముం జేర స్వామికై సంభ్రమం
బున జ్యోత్స్న యం దేఁగు వనిత నొకట,
ఆషాఢమాసాన నన్యదేశస్థుఁడగు
పతిఁ దల్చి కృశియించు పడఁతి నొకట,
ప్రణయకోపంబుచే వల్లభుని నెడసేసి
విరహంబుచే గుందు తరుణి నొకట,

తే.గీ. ఎదుట నటియించు మల్లిక - హృదయమందుఁ
బొదలఁజేసిన మూర్తులఁ బొదలఁజేసి
జాతియందున, రచియించె నాతఁ డెపుడు
క్షితిని గననట్టి శృంగార కావ్య మచట. 4-73

అను పద్యము అష్టవిధనాయికాభావములకు తేటతెల్లమయిన తెనుగు వ్యాఖ్యానము. అష్ట విధనాయికావర్ణనములేని కావ్యము కావ్యము కాదు. అష్టవిధనాయికాశిల్పములు లేని దేవాలయము దేవాలయము కాదు. అష్టవిధనాయికాభావములు తెలియని నాట్యగత్తె నాట్య గత్తె కాదు. దేశికు లీ కావ్యమున అష్టవిధనాయికాశిల్పములను శిల్పించిరి. నిజమునకు జక్కనకావ్యమే ఒక కావ్యశిల్పము!

సీ. *అశ్మ మొక్కటి కన్ను లరమోడ్చి ప్రియురాలి*
*పరిరంభసుఖమునఁ బరవశించె,*
*గ్రావ మొక్కటి నాసికాపుటంబులు విప్పి*
*ప్రియురాలి మల్లెల వలపు నానె,*
*ప్రస్తరం బొక్కటి హస్తాంగుళు లదల్చి*
*ప్రియురాలిఁ జెంతకుఁ బిలుచుచుండె,*
*పాషాణ మొక్కటి పాణిచేఁ బ్రియురాలి*
*చెక్కు లల్లనల స్పృశించుచుండె,*

తే.గీ. *ఱాయి యొక్కటి మదిఁ బ్రియురాలిఁ గవయఁ*
*గలలు గనుచుండె నాచ్చైత్రనిలయమందు,*
*శిలలకైనఁ బంచేంద్రియాస్తిత్వ మొదవు*
*ప్రాణదుండైన వరశిల్పిబ్రహ్మ యున్న!* 4–75

ఇందు ఐదురకముల రాళ్లను శిల్పిబ్రహ్మ ఉలిసుత్తెలతో జెక్కి, ప్రాణము పోసినాడు. ఈ పంచ ప్రాణములు గల పంచపాషాణశిల్పములు త్రిభంగసంచారములతో, విచిత్రభంగిమలతో ద్రష్టలకు, పాఠకులకు, రసికులకు, సహృదయులకు, నాట్యాచార్యులకు సంచారీ భావములను ప్రదర్శించుచున్నవి. ఈ కవి భావన అచుంబితమైనది. ఇది యొక నూతనసృష్టి. ఇది యొక చక్కని పద్యము. వేదాంతభావనాపూరితము. వేదాంతపరముగాని నాట్యము, సాహిత్యము, సంగీతము, శిల్పము – ఇత్యాదు లన్నియు వ్యర్థములని భారతీయుల సంప్రదాయము. ఈ పద్యము వేదాంతభావనాశిల్పమునకు దార్కాణము.

తే.గీ. *జతను వీడుచు జనినట్టి పతిని దలచి*
*ప్రాపులేక కుందెను చక్రవాకకాంత,*
*ఎఱ్ఱబడి యస్తగతుడైన యినుని జూచి*
*పక్ష్మముల మూసె పద్మినీపద్మనేత్రి.* 4–122

ఈ పద్యమున శ్లేషాలంకారగర్భితమైన ఉత్ప్రేక్షాలంకారము పరమాహ్లాదకరమై యున్నది. అంతేకాక అది ధ్వనిరూపమున వర్తమాననాయికావస్థను ప్రతిబింబించుచున్నది. ఈ వర్ణన ఉత్తమకావ్యశిల్పమున కుదాహరణము.

పంచమోల్లాసము

ఇందలి మల్లనపరితాపము, జక్కనస్వప్నము, జక్కనవిలాపము వారల మన స్తత్త్వములను ప్రకటించుటకుగాను క్రొంగ్రొత్తపద్ధతిలో వర్ణింపబడినవి. భగవద్రామానుజుల వర్ణనము, వారు గావించిన కర్తవ్యోపదేశము కథతో మేళవించి చేసిన వర్ణనలు. కావేరీ వర్ణనము, వేలాపురీవర్ణనము, విష్ణువర్ధనమహారాజసభావర్ణనము సన్నివేశపరిపుష్టికై చేయ బడినవి. మల్లికాబేచనల వృత్తాంతమును స్వప్నరూపమున సూచించుట కథాకథనవైచిత్రిని సూచించుచున్నది.

ఆంధ్రసాహిత్యమున శతకవాఙ్మయమున కొక ప్రత్యేకస్థానము గలదు. శతకములు పిల్లలకు మిక్కిలి విజ్ఞానదాయకములు. అందుచేతనే సుమతీశతకము, కృష్ణశతకము, వేమన భాస్కరశతకములు, నారాయణ, మరున్నందన, దాశరథ్యాది శతకములు బాల్యముననే కంఠస్థముచేయుట పిల్లల భవిష్యత్తునకు మంచి పునాది. ఈ శతకములయందలి కవిత్వధార అప్రమేయము, అత్యద్భుతము, అద్వితీయము. ఈ ప్రబంధమున పంచమోల్లాసారంభమున గల

ఉ. *శ్రీరమణీస్వరూపిణిని సీతను గానక దండకాటవిన్*
*పారములేని శోకమున వందురుచుండి, మరుత్తనూజు మై*
*త్రీరసలబ్ధిచే మఱలఁ దేజము, ధైర్యము నొంది, లంకకున్*
*జేరి, దశాస్యునిం దునిమి, సీతను బొందిన రాముఁ గొల్చెదన్.* 5-1

యీ పద్యము దాశరథీశతకమునందలి పద్యమువలె నొప్పారుచున్నది. అంతేకాక పద్యములో వర్ణింపబడిన విషయము పంచమోల్లాసకథ నంతయు ధ్వనించుచున్నది. ఇట్లే ఇతరోల్లాసములయందలి ప్రారంభపద్యములును ఆయా ఉల్లాసముల కథను ధ్వనించు చుండుట ఈకావ్యములోని విశేషము. ఇంకను, 3, 4, 5, 6 ఉల్లాసముల ఆరంభమందలి పద్యములు రామాయణేతివృత్తకములై, సీతాకల్యాణాది-పట్టాభిషేకాంత రామాయణ కథను కథించుట మఱొక విశేషము.

మల్లనపరితాపమున గల 'నీదు మనంబు నవ్యనవనీతసమానము ..' అను పద్యము నన్నయగారి 'నిండుమనంబు నవ్యనవనీతసమానము...' అను పద్యమును దలపించు

చున్నది. తామసీవర్ణనపద్యము లన్నియు కడుసుందరములు. అందునను

సీ. కాలోరగోరుఫూత్కారసంద్రావిత
వ్యాళోత్కరప్రవాహంబొ యనఁగ,
దిక్ఘనాఘనకరోత్క్షిప్తాతిదారుణ
శ్యామలజంబాలచయమొ యనఁగ,
అస్తంగమద్రవిహయఖురోద్ధితసాంద్ర
చరమాద్రిజాతభృశంబొ యనఁగ,
గగనాటవీజాతఘనతమాలాగమో
ద్ధితపత్రసంచయద్యుతియొ యనఁగ,

తే.గీ. సమయకైవర్తుఁ డాకాశజలధియందుఁ
బరఁగు తారకాఝుషములఁ బట్టుకొనఁగఁ
బరచియుంచిన నల్లని వలయొ యనఁగ
ధ్వాంత మంతట దెసలందు వ్యాప్తమయ్యె. 5-40

అను పద్యము పొడవైన నల్లత్రాచువలె బుసలు కొట్టుచు విషమును చిమ్ముచు వక్రగతితో నడచుచున్నదై తామసి అతిభయంకరమైనదని జగత్తుకు చాటి చెప్పుచున్నది. ఈ పద్యమున తామసి ఉత్ప్రేక్షాలంకారమున బంధింపబడి సుందరమై కనుపట్టుచున్నది. ఆంధ్ర సాహిత్యములో ఉత్ప్రేక్షాలంకారమును కవితలో విరివిగా అచుంబితభావనాయుతముగా వాడిన కవి శ్రీకృష్ణదేవరాయలవారు. ఈ పద్యమును చదువు వేళ ఆముక్తమాల్యదయందలి అవతారికలోని పద్యములలోని శ్రీకృష్ణదేవరాయలవారి జైత్రయాత్రాపద్యములు గుర్తుకు వచ్చుచున్నవి.

'సిద్ధాచార్యుడను వైష్ణవయోగి జక్కన నోదార్చి భగవద్రామానుజుల కడకు గొనిపోవుట' - అను శీర్షికక్రింద గల పద్యములు శ్రీకృష్ణదేవరాయలవారి ఆముక్తమాల్యద యందలి మాలదాసరికథను జ్ఞప్తికి దెచ్చుచున్నవి.

సీ.తు. ఫాలాంచితబ్రహ్మవర్చస్సునకు నైన
పెట్టివలె నామంపుపట్టె లమర,
బ్రహ్మసూత్రములందుఁ బరఁగు ముడు లిట్టివని
కట్టిన తులసిదామకంబు తనర,

హరిసేవకులు వొందు నపవర్గమార్గ మి
ట్లున్న యటు దీర్ఘసంవ్యాన మొనర,
జీవుఁ డొక్కఁడె, కాయమే వివిధ మనురీతిఁ
బలురీతుల మడచిన పంచె యొనర,

తే.గీ. శాంతుఁడున్, విశిష్టాద్వైతసంయమీంద్రుఁ
డతులకారుణ్యరసపూర్ణమతియు నైన
భాష్యకారుండు విష్ణుసేవార్థ మపుడు
సుమములం గోయుచుండె నాశ్రమము చెంత. 5-96

అను పద్యమునందలి వర్ణనము భగవద్రామానుజవైష్ణవాచార్యమూర్తిని కన్నులయెదుట సాక్షాత్కరింప జేయుచున్నది.

'భగవద్రామానుజులు కర్తవ్యోపదేశమును చేయుట' - అను శీర్షికక్రింద గల 104 నుండి 117 వఱకు గల పద్యములు భగవద్రామానుజల విశిష్టాద్వైతసిద్ధాంతబోధకములై

'కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షయే
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశ యుజే'

అని కావ్యప్రకాశములో చెప్పబడినట్లుగా నీ కావ్యమున కుపదేశప్రయోజనమును గల్పించుచున్నది.

తే.గీ. పరఁగు నారాయణుండును, వాసుదేవుఁ
డనఁగ నాతండె, యాతని యంశతోడఁ
బరఁగియుండియు, జడజీవవస్తువితతు
లతనికంటె భిన్నంబులై యలరుచుండు. 5-105

ఈ పద్యములో విశిష్టాద్వైతసిద్ధాంతము ప్రతిపాదించబడినది. దాని తరువాతి యీ క్రింది పద్యములో

తే.గీ. ఇట్టి ప్రాణులు దేహజన్యేచ్ఛ లుడిగి,
స్వస్వరూపంబు లెరిఁగి, ప్రపన్ను లగుచు
భాగవతనిత్యకైంకర్యపరతు లగుచు,
బ్రహ్మసాయుజ్య మొందుటే పరమ మగును. 5-106

నిత్యభాగవతకైంకర్యపరతులైన వారు జీవన్ముక్తులై బ్రహ్మసాయుజ్యము నొంది అనిర్వచనీయమైన సుఖము ననుభవించెదరని భగవద్రామానుజుల భక్తిమార్గ ముపదేశింపబడినది. భగవద్రామానుజులు సగుణబ్రహ్మవాదులు. అట్టి భగవంతునియొక్క అనంతకల్యాణగుణగణములను శ్రీమద్రామానుజులవారి శరణాగతిగద్యనుండే సంగ్రహించి దేశికులు శ్రీనాథుని కాశీఖండమునుబోలిన ఉదాత్తమైన శైలిలో ఈక్రింది సీసపద్యమును గూర్చినారు.

సీ.. సర్వశోభనగుణుం డుర్వరాధీశుండు
ప్రణవైకరూపుండు పావనుండు,
సౌగంధ్యసౌందర్యసౌకుమార్యోజ్జ్వల్య
లావణ్యయౌవనలాంఛితుండు,
సౌశీల్యవాత్సల్యసౌహార్దకారుణ్య
మాధుర్యమార్దవమండితుండు,
ఐశ్వర్యవీర్యసామ్యౌదార్యగాంభీర్య
విజ్ఞానబలశక్తివిలసితుండు,

తే.గీ. శౌర్యధైర్యపరాక్రమసంయుతుండు,
సత్యసంకల్పుఁడును సదాసత్యకాముఁ
డైన శ్రీమహావిష్ణుఁ డవ్యాజకృపను
మంచు ని న్నిట్లు నీవు సేవించితేని! *5–112*

విష్ణువర్ధనరాజసభావర్ణనములోని `అటు సని కాంచె శిల్పివరుఁ డద్భుతశిల్పకళాభిరమ్యమై ...` అను పద్యపుటెత్తుగడ అల్లసానివారి అల్లికను స్ఫురణకు దెచ్చుచున్నది. జక్కనకుమారుడైన డంకనయొక్క బాల్యక్రియల వర్ణించు నీక్రింది పద్యము

సీ. పులు దెచ్చి గూండ్లను వలభిలో నిర్మించు
కలవింకముల వింతకరణి వ్రాయు,
పులుమేయు నావుల పొదుగులం బాల్దావు
తర్ణకంబులసొరుఁ దరిచి వ్రాయు,
అఱుతం గఱచుకొని చిఱుతలం గొనిపోవు
పిల్లి మాతృత్వంపువిధము వ్రాయు,
మఱుకుగా నురుకుచుం దరుకాండములఁ బ్రాకు
నుడుతపిల్లలతీరుఁ దొడరి వ్రాయు,

తే.గీ. లేటిపరుగులయందలి నీటుదనము,
చేపయీతలయందలి చిలిపితనము,
అన్నియును దాను గన్నవి గన్నయట్లు
చిత్రములుగ వ్రాయు నతండు చిత్రముగను. 5-173

నిశితప్రకృతిపరిశీలనాత్మకమై, రమ్యతరమై, స్వాభావికవర్ణనావిలసితమై ఒప్పారుచు పరిసరజంతుసముదాయముల సాంసారికజీవితము నభివర్ణించుచున్నది.

## షష్ఠోల్లాసము

ఈ యుల్లాసమున రాణుల వర్ణనము, శాన్తలాదేవి నాట్యసందర్భమున మహాకవి కాళిదాసకుమారసంభవమునందలి తృతీయసర్గలోని శ్లోకములు, ఆ శ్లోకముల యనువాదము, బేలూరుదేవాలయశిల్పవర్ణనములు, డంకన జక్కనకు గర్భదుష్టశిలయందు మూలవరులు చెక్కబడినారని తెల్పగా అట్టి దోషాపహార్థమై జక్కన కరమును ఖండించుకొనబూనుట, భగవద్రామానుజు లాయత్నమును మాన్పించుట, మల్లికాజక్కనల పునస్సమాగమము, భగవద్రామానుజులు విజయనారాయణస్వామివారిని ప్రతిష్ఠించుట, ప్రథమ పూజాసందర్భమున స్వామివారికి శాన్తలామల్లికలు నాట్యపుష్పాంజలు లర్పించుట మున్నగు విషయములు వర్ణింపబడినవి. పాంచరాత్రపద్ధతిలో చేసిన శిలాసంగ్రహణ వర్ణనము, ప్రతిష్ఠావర్ణనము ఈ యుల్లాసమునకు మఱింత శోభను చేకూర్చినవి. భగవద్రామానుజులు జక్కన కరఖండనయత్నమును మాన్పింప జేసిన ప్రబోధము కావ్యము యొక్క ఉపదేశప్రయోజనమును ఇనుమడింప జేసినది. అంతేకాక జక్కన డంకన కోడితినన్న అహంభావముతోగాక గర్భదుష్టశిలయందు మూలమూర్తులను జెక్కిన దోషమునకు కరఖండనచేసికొన్నట్లు కవి కథను మార్చి జక్కనపాత్ర కౌచిత్యమును గూర్చినారు. ఉత్తరత్ర అదిదోషనివారణోపాయము గాదని శ్రీమద్రామానుజులు బోధించినపుడు కరఖండన యత్నము నాపికొనుట కవకాశము గల్గి కథ సుఖాంతమైనది.

*జయము! జయము! శాంతలా! శ్రీ ప్రభాచంద్ర మౌనీంద్ర కా*
*రుణ్య సంపాది తాశేష నృత్యాది విద్యానిధీ!*
*యదుకులమణి విష్ణుభూపాల చేతోనురాగాబ్ధి సం*
*వర్ధ కోదారరాకేందులేఖా మనోజ్ఞాకృతీ!*
*నవరస రచితోరు చిత్రాయమానాస్యవిన్యాస, ర*
*మ్యాంగ విక్షేపసంయుక్త లాస్యామరీజిత్వరీ!*
*అగణితగుణనీరధీ! భారతీ భార్గవీ పార్వతీ*
*పార్శ్వనాథాంఘ్రిరాజీవ లీలాభ్రమత్ షట్పదీ!* 6-8

అను పై దండకము మహాకవి కాళిదాసకృతశ్యామలాదండకమువలె నడచినది. నిర్ణీతసంఖ్య గల్గిన గణములతో గూడి చతుష్పాదయుతమై **దండకవృత్తముగా** నుండుట దీనియందలి మఱొక విశేషము. పూర్వకవులు సామాన్యముగ దండకమును దేవతాప్రార్థనాదులకై వాడిరి. ఈ కవి దండకమును వైతాళికగానముగా గూర్చుట ఒక క్రొత్తప్రయోగము.

ఆంధ్రసాహిత్యమున శ్రీనాథమహాకవి సందర్భానుసారముగా మహాకవి కాళిదాస కృతకుమారసంభవమున పంచమసర్గయందలి పార్వతీతపశ్చర్యలోని బ్రహ్మచారి, పార్వతుల సంభాషణాశ్లోకములను తన హరవిలాసకావ్యమున చక్కగా అనువదించినాడు. ఆ విధానమున దేశికాచారిగారు శాన్తలానాట్యమున మహాకవి కాళిదాస కుమారసంభవము తృతీయసర్గయందలి శ్లోకములను చరణములుగాను, వివిధసందర్భములలో అన్యత్ర వాడబడిన పదములను సంగ్రహించి అర్థయుతమైన పల్లవిగాను, 24 నుండి 27 వఱకు గల పద్యములను పై శ్లోకముల కనువాదములుగాను చిత్రించి, హరుని గొల్వబోవు పార్వతిగ నటించు శాన్తలానాట్యము నభివర్ణించినారు. ఈ యనువాదపద్యములు బహురమ్యముగా నున్నవి. చూడుడు:

| కాళిదాసుని సంస్కృతము | దేశికుని ఆంధ్రము |
|---|---|
| స్రస్తాం నితంబా దవలంబమానా | స్థానవిదుడైన మదనుండు దాచికొన్న |
| పునఃపునః కేసరదామకాంచీమ్ | రెండవదియైన జ్యావోలి వ్రేలుచున్న |
| న్యాసీకృతాం స్థానవిదా స్మరేణ | వకుళసుమకాంచికన్ నితంబంబునుండి |
| మౌర్వీం ద్వితీయా మివ కార్ముకస్య॥ | జారనీయక గ్రహియించు శైలసుతను. |

'జక్కన మందిరనిర్మాణపరతు డగుట' అను శీర్షిక క్రిందగల పద్యములలో నీ క్రింది పద్యమును చూడుడు:

తే.గీ. అనుచు విశ్వకర్మను, మహాయంత్రకాళిఁ
బూజ యొనరించి, యాపైని భూమి దున్ని,
బీజముల నాటి, సస్యంబుఁ బెరుగనిచ్చి,
ఫలితసస్యంబు గోవృషంబులకు మేపి,
భూమివాస్తుల నర్చించి, హోమ మమరఁ
జేసి, పూర్ణకుంభ, మణివిన్యాసవిధుల
శాస్త్రరీతిగ నొనరించి, చక్రి మంది
రార్హభూమి నీరీతి నాయత్తపఱచి. 6-37

ఇందు మందిరనిర్మాణమున కర్తమైన భూమిని వర్ణించిన విధానము శాస్త్రసమ్మతము. ఈ మందిరవర్ణనమున 37 నుండి 67 వఱకు గల పద్యములలో జక్కనశిల్పి శిల్పములను, చిత్రములను చేసిన విధానము ఈ ప్రబంధమునకు మూలాధారము, ఆత్మ.

జాతిలో ప్రాణములు గల యువతులు తమ హావభావముల నెట్లు చూపెట్టిరో, ఎట్లు ఒయ్యారముల నొలకబోసిరో, ఏమని భావించిరో ఈ పద్యమున చూడగలరు.

సీ.తు. ఒకముగ్ధ ముకురాన నొయ్యారముగఁ జూచి
తనచెల్వునకుఁ దానె తన్మయమునొందు,
ఒకనారి కీరంబు నొయ్యనొయ్యనఁ బల్కి
వల్లభున కెదొవార్తఁ బనుపంగఁ జూచు,
ఒకచెల్వ వల్వలోనున్న తేలును జూచి
వెఱఁగునం జెఱఁగునున్ విదిలింపఁ జూచు,
ఒకప్రోఢ డాకేల నొఱపువీణియ నూని
రాగము ల్పలికించు జాతియెదలోన,

తే.గీ. నాట్యవేదపారీణయౌ నాతి యొకతె
తాండవాలోలయౌఁ దన్నుఁ దానె మఱచి,
వాద్యసంగీతనిపుణయౌ వనిత యొకతె
మర్దలంబులఁ బలికించు మంజుఫణితి. 6-53

శ్రీదేశికాచార్యులు పాంచరాత్రవైష్ణవాగమమార్గానుయాయు లగుటవల్ల ఈ కావ్యమందు పాంచరాత్రశాస్త్రపద్ధతిలో విజయనారాయణస్వామివారిని ప్రతిష్ఠ చేసిన విధానమును చక్కగా వర్ణించినారు. విగ్రహప్రతిష్ఠాపన చేయుటకు గల పూర్వరంగము

తే.గీ. మొదట సలిలాధివాసముం బొనరఁ జేసి,
ఉపరి, ధాన్యాధివాసంబు నొనరఁ గూర్చి,
పైని స్నాపనశయనాధివాసవిధులు
శాస్త్రహితముగ సద్భక్తి సంఘటించి. 6-209

అను పద్యమున చక్కగా మలచినారు. ఈ ప్రబంధమును ప్రప్రథమకేశవార్చనాసమయమున శాన్తలామల్లికలు చేసిన రమ్యతరనాట్యపుష్పాంజలులతో ముగించినారు. 'మంగలాదీని, మంగలమధ్యాని, మంగలాన్తాని శాస్త్రాణి ప్రశంశతే' - ఆదిమధ్యాంతములయందు

మంగలమును చేసి ఏ శుభ కార్యము నైనను ముగించవలెనని భారతీయసంప్రదాయము. ఇట్టీ ప్రబంధము ఆది మధ్యాంతములందు అందమైన, శుభదమైన నాట్యవర్ణనతో ముగిసినది.

ఉపసంహారము

ఈ కావ్యమున ప్రతిపద్యము రసనిస్తులము. చేమకూర వేంకటకవి విజయవిలాస ప్రబంధమువలె ఈ ప్రబంధము ప్రతిపద్యచమత్కృతి కల్గినట్టిది. ఈ కవికి సంస్కృతాంధ్రము లందు మంచి వ్యుత్పత్తి కలదు. ఆ వ్యుత్పత్తికి తోడుగా స్వీయపూర్వజన్మసంస్కారజనిత భావనాప్రతిభాబలవిశేషమున ఈ కావ్యము రసప్రపూర్ణమైన అమృతకలశమువలె విరాజిల్లు చున్నది. ఈ కవిత 15 లేక 16వ శతాబ్దములలో గల అష్టదిగ్గజముల కవితవలె ప్రవహించినది. విశేషించి పోతనామాత్యులవారి కవితారీతులలో పయనించినది. ఇది యొక పూర్వజన్మ సంస్కారవిశేషము.

నేను గుణగ్రాహిని కావటంవల్ల ఈ కావ్యంలో నాకు దోషాలు ఎక్కడా కనుపించ లేదు. ఎక్కడైనా ఒకటిరెండు దోషాలున్నా వాటిని నేను దోషాలుగా పరిగణించను. మహా కవి కాళిదాసు అన్నట్లు, *'ఏకోహి దోషో గుణసన్నిపాతే నిమజ్జ తీందోః కిరణే ష్వివాంకః'* – చంద్రునిలో మచ్చ తెల్లని చంద్రకిరణములలో మునిగి పోయినట్లు దుర్గుణము లేక దోషము సద్గుణబాహుళ్యములో మునిగిపోవును. ఈ కవి కవిత ప్రౌఢకవిత. ప్రౌఢమైన కవితను అర్థంచేసికొనడానికి సంస్కృతాంధ్రసాహిత్యములందు చక్కని పరిజ్ఞాన మావశ్యకము. అట్టి పరిజ్ఞానము లేనిచో ప్రబంధములు, కావ్యములు పాఠకులకు నందేందూదయములు. చెదలుపుట్టలుగా బయలుదేఱిన నేటి వచనకవితాప్రపంచంలో పాండిత్యానికి, ప్రాచీనగ్రంథ పఠనకు స్థానం లేదు. ఇది యొక విషాదపరిస్థితి.

'కాలో హ్యాయం నిరవధి ర్విపులా చ పృథ్వీ' అని భవభూతిమహాకవి మొర బెట్టుకొన్నాడు. 'ఈ కాలము అంతు లేనిది, భూమి విపులమైనది, ఎప్పుడో ఒకప్పుడు ఎక్కడో ఒకచోట ప్రపంచంలో నా కావ్యాన్ని నాలాంటివా డెవడో పుట్టి అర్థంచేసు కుంటాడు' – అని అన్నాడు.

ఈ ప్రబంధములోని రీతులు, గతులు అన్నీ ప్రాచీనమైనవి. ఐనప్పటికి అవి నవ్యతను కలిగినవై నవనవోన్మేషములై, ప్రతిక్షణరమణీయార్థప్రతిపాదములై ఉన్నవి. మనము ప్రతి సంవత్సరము పాతఋతువులనే చూచుచున్నాము. చూచి చూచి వాని సౌందర్యము ననుభ వించుచునే యున్నాము. ఎప్పటి కప్పుడు నవ్యానుభూతులను పొందుచునే యున్నాము. అటులనే ఉత్తమకావ్యములోని ప్రతిసన్నివేశము మనకు తెలిసియే యున్నను అది కవియొక్క ప్రతిభాయుతరచనాశిల్పముచే శిల్పించబడి రమణీయార్థప్రతిపాదకమై రసతన్మయతను కల్గించుచున్నది. ఈ భావమునే ధ్వన్యాలోకకారులు ఆనందవర్ధనాచార్యులు ఈక్రింది

విధముగా పేర్కొన్నారు.

'దృష్టపూర్వా అపి హ్యర్థాః, కావ్యే రసపరిగ్రహాత్
సర్వే నవా ఇవా భాంతి, మధుమాస ఇవ ద్రుమాః'

ఇటువంటి కవిత్వాన్ని అర్థంచేసికొని ఆనందించడానికి ప్రతిభావ్యుత్పత్తులతోబాటు సహృదయత కావాలి. సహృదయత అంటే ఏమిటి? అంటే 'రసజ్ఞతైవ సహృదయత్వ మితి' - 'రసమును తెలిసికొని అనుభవించుటయే సహృదయత' - అని ఆనందవర్ధనాచార్యులవారన్నారు.

'సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్' - చక్కని కవిత్వం ఉంటే రాజ్యం ఎందుకు? - అని భోజమహారాజులవా రన్నారు. ప్రతిసహృదయుడు ఈ ప్రబంధాన్ని చదివి 'రసవత్తరమైన కవిత్వం ఉంటే నీరసమైన ఈ ఉద్యోగం దేనికి?' అని అనక మానడు. ఈ ప్రబంధకవిత స్వచ్ఛమై, రసభావాలంకృతమై, మృదుమధురపదకుసుమసుకుమారసమాసవేల్లితమై దివ్యభావపరీమళములను వెదజల్లుచున్నది.

దేశికులు వ్రాసిన కావ్యావళిలో ఇది సర్వోత్కృష్టమైనది. ఈ రోజులలో ఇట్టి ప్రబంధాలను వ్రాయటమంటే కాలానికి ఎదురీదటమే. ఛందోబద్ధకవిత్వమే కవిత్వం. ప్రబంధలక్షణాలులేని కావ్యాలు రాణించవు. అట్టి కావ్యములు హిమధాముడులేని రాత్రి వంటివని రససిద్ధులైన కవీశ్వరుల నుడి. రసదృష్టిలేని వారి కిలాంటి కవిత్వం అరణ్యరోదనంగా ఉంటుంది. అందుకే భర్తృహరి, 'అరసికేషు కవిత్వనివేదనం ... మాలిఖ, మాలిఖ, మాలిఖ' - అని ఘోషించాడు.

'స్ఫుటతా న పదై రపాకృతా, నచ న స్వీకృత మర్థగౌరవమ్' - కవిత్వము స్వచ్ఛమైన, సుస్పష్టమైన పదములచే సమలంకృతము, అర్థగౌరవము, భావగౌరవము కడు నిండుగా చూపెట్టబడినవి - అను భారవిమహాకవి శ్లోకము ఈ కావ్యమును చదువు సమయములో స్ఫురణకు వస్తుంది. ఈ ప్రబంధాన్నిగూర్చి ఇంతకంటె ఎక్కువ వ్రాసిన చదువరులకు అతిశయోక్తిగా దోచవచ్చును గావున రసహృదయులు స్వయంగా ఈ ప్రబంధాన్ని చదివి ఆనందాన్ని పొందుతారని భావిస్తూ, కవులైన శ్రీమాన్ దేశికాచార్యులవారు ఇలాంటి దివ్యపరిమళాత్తకావ్యమంజరుల నింకను రసహృదయుల కందజేస్తారని ఆశిస్తూ, వీరికి, వీరి కుటుంబానికి శ్రీచెన్నకేశవస్వామివారి కరుణాకటాక్షాలు అనవరతం అవిచ్ఛిన్నంగా ఉంటాయని భావిస్తూ ఈ పీఠికను ముగించుచున్నాను. ఓం తత్సత్...

భావసంవత్సర విజయదశమి. ఇట్లు
అటావా హిందూదేవాలయము, కెనడా. పండిత పరీక్షిత్తు శర్మ

# ప్రస్తావన

ఇది నా నాల్గవకావ్యము. నా యితరకావ్యములు అశ్రుమాల, హనుమప్ప నాయకుడు, ఋతుసంహారము – అనునవి. ఇప్పటికెనిమిదేండ్ల క్రిందట హనుమప్పనాయక కావ్యమును ముగించినప్పటినుండియు నేను మహాశిల్పి జక్కనచరిత్రమును కావ్యముగా వ్రాయవలె ననుకొనుచుంటిని. కాని దానికి తగిన ప్రేరణ లభింపలేదు. 1992లో నే నిండియాను సందర్శించితిని. అప్పుడు జక్కననిర్మితములుగా ప్రతీతములైన బేలూరు, హళేబీడు దేవాలయములను చూచి వాని సౌందర్యమునకు ముగ్ధుడనైతిని. దీనివల్లను, నా యిష్ట దేవతయైన సరస్వతీదేవి కరుణవల్లను తగిన ప్రేరణ కలిగి, ఈ కావ్యమును 1992 మార్చి నెలలో ఆరంభించి, 1994 సెప్టెంబరునెలలో ముగించితిని.

ఈ కావ్యమును ప్రబంధపద్ధతిలో వ్రాసితిని. నన్నెచోడకవిరాజుతో ఆరంభమై, పెద్ద నాద్యష్టదిగ్గజములచేత పరిపుష్టమైన ప్రబంధప్రక్రియ, చేమకూర వేంకటకవివంటి కొందఱు ప్రతిభావంతుల చేతులలో దక్క, అనంతరకవుల చేతులలో కేవలము మరబొమ్మవలె రూపు వహించి నవ్యత్వ, చైతన్యవిరహితమైనది. అట్టి ప్రబంధప్రక్రియకు నవ్యతను, పునరుజ్జీవ నమును కల్గింపవలెనను తలంపుతో నీ కావ్యమును `నవీకృతప్రబంధశైలి`లో వ్రాసితిని.

ఇందు వర్ణనలకు, పాత్రపోషణకు, పాత్రల మనస్తత్త్వచిత్రీకరణకు సమానప్రాధా న్యత నిచ్చితిని. వర్ణనలన్నియు కథకు, సన్నివేశపరికల్పనకు, అంగములుగా నుండునట్లు చేసితిని. `అష్టాదశవర్ణనల పట్టిక`ను ప్రక్కన పెట్టుకొని వర్ణనల నతుకకుండ, అనువైన వర్ణనలను కావ్యకన్యకు సహజాభరణములుగా నుండునట్లును, కావ్యసౌందర్యదోహద కారులుగా నుండునట్లును సంతరించుటకు యత్నించితిని. ఈవిధముగా పూర్వప్రబంధ ప్రక్రియకు పునరుజ్జీవనమును గల్పింప యత్నించితిని. ఆశయము గొప్పది – అర్హత చిన్నది. ఇందులో నే నెంతవఱకు కృతార్థుడనైతినో ఆ నిర్ణయమును పాఠకవిమర్శకులే చేతురుగాక!

నా మునుపటి కావ్యములలోవలెనే ఈ కావ్యములోను కొన్ని క్రొత్తవృత్తములను, ఛందస్సులను నేను ప్రవేశపెట్టితిని. మునుపు ప్రవేశపెట్టిన క్రొత్తవృత్తముల నిందులో వాడు కొంటిని. ఈ నూత్నవృత్తముల లక్షణముల నీక్రింద పేర్కొంటున్నాను.

*1. వసంతకోకిల:* ఇది 19వ అతిధృతిచ్ఛందస్సులో జనించిన తరలమును బోలిన మిశ్రగతిలో నడచు వృత్తము. మూడవ మిశ్రగతిగణారంభము యతిస్థానము. ఉదాహరణము: *`శ్రీకరంబుగఁ ద్రిభువనంబుల శిల్పిచందము నిల్పుమన్` (1-1).*

*2. పరభృతము:* ఇది 20వ కృతిచ్ఛందస్సునం దుదయించిన తరలమునుబోలిన మిశ్రగతిలో నడచు వృత్తము. మూడవ మిశ్రగతిగణారంభము యతిస్థానము. ఈ వృత్తమును నేను మొట్ట మొదట నా ఋతుసంహారములో ప్రవేశపెట్టితిని. ఉదాహరణము: *'అనుమ బాలకుఁ డభ్రమందుమ నటకు వచ్చిన కార్యమున్' (6-131).*

*3. నయాగరా:* ఇది 18వ ధృతిచ్ఛందస్సునందు జనించిన ఒక గురువు లుప్తమైన శార్దూలము. ఇది మసజసరర గణములతోగూడిన 12వ అక్షరము యతిగా గల వృత్తము. దీనిని నేను మొట్ట మొదట నా హనుమప్పనాయకకావ్యములో ప్రవేశపెట్టితిని. ఉదాహరణము: *'రాజీవాక్షినిఁ, బల్లవాధరను, రాకేందుబింబాననన్' (1-120).*

*4. మనోరమావృత్తము:* ఛందస్సు: శక్వరీ; గణాలు: తభయనగగ; యతి: 9వ స్థానం; గతి: ఖండగతి. ఉదాహరణము: *'ఈరీతిఁ బ్రాప్తతటులై ఇందుముఖు లంతన్' (1-84).*

*5. విభావరి:* ఛందస్సు: అతిజగతి; గణాలు: తతరరగ; యతి: 7వ స్థానం; గతి: ఖండగతి. ఉదాహరణము: *'వేలాపురీవాస! వేంకటేశస్వరూపా!' (1-128).*

*6. ప్రభావతి:* ఛందస్సు: అతిజగతి; గణాలు: రరతతగ; యతి: 7వ స్థానం - గతి: ఖండగతి. ఉదాహరణము: *'గోపికానాయకా! గోవర్ధనోద్ధారకా!' (4-186).*

*7. విలాసిని:* ఛందస్సు: జగతి; గణాలు: తరరర; యతి: 7వ స్థానం; గతి: ఖండగతి. ఉదాహరణము: *'శ్రీకంఠవందితా! శ్రీసతీనాయకా!' (2-165).*

*8. కైవల్యవృత్తము:* ఛందస్సు: జగతి; గణాలు: తమయయ; యతి: 6వ స్థానం - గతి: ఖండ గతి. ఉదాహరణము: *'కైవల్యదాతా! కామితార్థప్రదాతా!' (6-263).*

*9. సుగతి:* ఛందస్సు: అతిధృతి; గణాలు: మభరనతతగ; యతి: 14వ స్థానం; ఉదాహరణము: *'ఏవల్లిం దాఁకిన మల్లికాంగముగ భాసించు నా శిల్పికిన్' (3-42).*

పై నూత్న వృత్తములనే గాక నే నీ కావ్యములో నిర్ణీతగణములు గల త్ర్యస్ర, ఖండజాతి మాత్రా వృత్తములను, ద్విపద, సీస, కందములను కొంచెముగా మారిస్తే ఏర్పడే ద్విపదతుల్య (ద్వి.తు), సీసతుల్య (సీ.తు), కందతుల్య (కం.తు) ఛ్ఛందములను వాడియున్నాను. ఇవి యథాప్రయోగముగా గృహ్యాములు. వీనితోబాటు, ఆటవెలది, తేటగీతి, తరల, మత్తకోకిల, భుజంగప్రయాత, వనమయూర, స్రగ్విణీ, సీస, కంద, ద్విప, దోత్పల, చంపక, శార్దూల, మత్తేభ, దండక, మధురగతిరగడల నీకావ్యములో నేను వాడియున్నాను.

# ప్ర స్తా వ న

జక్కనశిల్పిని గూర్చిన యైతిహ్యాము ప్రసిద్ధమైనది. 'అమరశిల్పి జక్కన' సినిమా కూడ వచ్చినది. కీ.శే. దాశరథి కృష్ణమాచార్యులుగారు 'మహాశిల్పి జక్కన' యను లఘు గ్రంథములో నీశిల్పి చరిత్రను తెల్పియున్నారు. కాని ఈ జక్కన చారిత్రకపురుషు డనుటకు దగిన యాధారములు లేవు. ఏమైనను జక్కనకథ కవులకు, కళాకారులకు రసాకరమైనది. రసభావశిల్పము లెఱిగిన కవి కీ శిల్పిచరిత్ర మనుపమకావ్యశిల్పనిర్మాణసమర్థమై విరాజిల్లు చున్నది.

నేను జక్కన సినిమాను బహుకాలముక్రిందట చూచితిని. అందుచే నాకు సినిమా కథ పూర్తిగా గుర్తులేదు. దాశరథిగారి మహాశిల్పిజక్కన గ్రంథమును (అసమగ్రప్రతిని) నేను చదివితిని. నా కావ్యమందలి కథాకల్పన నీరెంటికంటెను భిన్నముగా చేసితిని. మల్లికను ప్రసిద్ధురాలైన, అధ్బురాలైన నర్తకిగ నూహించితిని. జక్కన నంతగా శ్రీమంతుడుగాని ఉత్తమశిల్పకారునిగా నూహించితిని. వీరిర్వురు యాదృచ్ఛికముగా క్రీడాపురసమీప వనములో ఒకరినొకరు చూచికొన్నట్లును, ఆ తర్వాత క్రీడాపురప్రాంతమందలి ఉద్యాన వనములోజక్కన నిర్మించిన చైత్రమండపప్రారంభోత్సవసమయములో మల్లిక నాట్యముచేసి నట్లును, అట్లు మలిపరిచయము గలిగి, అదియే ప్రణయముగా మారి పరిణయమునకు దారి తీసినట్లును కథను గల్పించితిని. సినిమాలోను, దాశరథిగారిపుస్తకంలోను ఉన్న మల్లిక యొక్క పెంపుడుతల్లి, ఆమె తమ్ముని ఉదంతములను నేను స్వీకరింపలేదు. అట్లే గూళిదేవుడు జక్కన చెక్కిన మల్లికాశిల్పమును చూచి, మోహించి, ఆమెను తనయొద్దకు రప్పించుకొన యత్నించినట్లు పైరెండింటిలోను ఉన్నది. కాని నా కావ్యమునందు గూళిదేవుడు స్వయముగా క్రీడాపురప్రాంతచైత్రమండపప్రారంభోత్సవములో మల్లికానాట్యమును చూచి ఆమెను మోహించినట్లు కల్పించితిని. తరువాత సినిమాలో గూళిదేవుడు బలవంతపెట్టగా అతని యెదుట నాట్యముసేయు మల్లికను జూచి జుగుప్సతో జక్కన శిల్పసన్న్యాసమును జేసినట్లును, అవమానమును భరింపలేక మల్లిక నదిలో దూకినట్లును ఉన్నది. నే నట్లుగాక జక్కన ఱాలు దెచ్చుటకై అడవి కేగిన సందర్భములో గూళిదేవుడు మల్లికను బలాత్కరింప బోవ ఆమె చాతుర్యముతో నతనినుండి తప్పించుకొని, మామయగు మల్లనతోసహా కావేరిని దాటి జక్కనను గలువబోయినదనియు, అట్లు కావేరిని తరించు వేళ మల్లన నీటిలో బడబోవు ప్రమాద మేర్పడ, అతని రక్షింపబోయి మల్లికయే నీటిలో పడిపోయినదనియు, ఆ వార్తను విన్న జక్కన శిల్పసన్న్యాసమును జేసెననియు కల్పించినాను. అట్లు నీట బడి పోయిన మల్లికను బేచనాఖ్యుడగు జాలరి రక్షించి, ఆమె కాశ్రయము నిచ్చుట, అచ్చటనే ఆమెకు డంకన యను కొడుకు జన్మించుట – ఈ విషయములను నాతివిస్తృతముగా, ప్రధాన కథకు అంతరాయము కలుగని రీతిగా స్వప్న రూపమున చిత్రించితిని. అట్లు జనించిన డంకన బాలుడయ్యును జక్కనను వెదకికొనుచు వచ్చి, జక్కన చెక్కిన చెన్నకేశవస్వామివారి మూలవిగ్రహమును గర్భదుష్టశిలలో దొల్చినట్లు తెల్పుట, దానికి జక్కన కోపించి, అహం కారపూరితుడై అదియే సత్యమైనచో తన కుడిచేతిని ఖండించుకొందునని ప్రతినచేసి, అది

సత్యము కాగా దన కుడిచేతిని ఖండించుకొన్నట్లును సినిమాలో నున్నది. కాని నేను జక్కన అహంకారావలేపములతో గాక, దుష్టశిలయందు మూలమూర్తులను చెక్కిన పాపపరిహార మునకు కరమును ఖండించుకొనబోయెననియు, అది పాపాపహమార్గము గాదని భగవ ద్రామానుజ లుద్బోధింప, ఆయత్నమును వీడి ఉత్తరోత్తరాలయనిర్మాణకర్మిష్ఠుడై ఆ పాప నివారణమును జేసికొనెనని కల్పించి కథను సుఖాంతము చేసితిని. బేలూరుదేవాలయమును నిర్మించిన శిల్పులే తదనంతరమున హళేబీడు దేవాలయములను నిర్మించిరను చరిత్రకారుల యభిప్రాయ మీకల్పనకు దోహదకరముగా నున్నది. అంతేకాక, అహంకారముచే గాక, అంహోఽపాసనార్థమై జక్కన కరఖండనమునకు బూనుకొనెనని కల్పించుటచేత అతని పాత్రకు వైశిష్ట్యముగూడ చేకూరినది.

ఇక నీ కావ్యప్రకాశనమునకు తోడ్పడిన వారికి కృతజ్ఞతలు తెల్పుకొంటూ ఈ ప్రస్తావనను ముగింతును. బ్రహ్మశ్రీ కోట సుందరరామశర్మగారు మొదటి మూడుల్లాసాలను నిశితముగా సరిచూచి ముఖ్యమగు సవరణలను సూచించిరి. సంస్కృతాంధ్రకవిపండితాగ్రే సరులు, సంస్కృతకవిత్వమునకై ఎన్నో విశిష్టపురస్కారముల నందినవారు, మీదుమిక్కిలి నా శ్రేయోభిలాషులైన శ్రీ ఓగేటి పరీక్షిత్ శర్మగారు దీనికి చక్కని పీఠికను గూర్చిరి. యువ భారతిసంస్థాధ్యక్షులును, విమర్శకాగ్రేసరులు నైన శ్రీ జి.వి. సుబ్రహ్మణ్యంగారు దీనిని యువ భారతిద్వారా ప్రచురించు నవకాశమును గల్పించిరి. మిత్రులైన శ్రీషణ్ముఖాచారిగారు ముఖ పత్రమును తీర్చిదిద్దిరి. నా కన్నడమిత్రులైన శ్రీ దొరే సుబ్బారావుగారు కన్నడభాషలో కె.వి. అయ్యరుగారు వ్రాసిన శాన్తలాఖ్యమగు నవలను, డి.వి. గుండప్పగారు వ్రాసిన `అంతఃపుర గీతె` అను కన్నడకావ్యమును నా దృష్టికి దెచ్చిరి. ఈ గ్రంథముల ఆరంభములో నుట్టంకింప బడిన హొయసలరాజవంశమును, విష్ణువర్ధనమహారాజును, అతని రాణులైన శాన్తలాలక్ష్మ లను గూర్చిన శాసనములు విష్ణువర్ధనశాన్తలాలక్ష్మల పాత్రలను చిత్రించుటలో నా కత్యం తోపయోగకరములైనవి. ఇట్లు తోడ్పడిన మహనీయుల కందఱికి నా హృదయపూర్వక కృతజ్ఞతలను తెల్పుకొంటూ పాఠకు లీగ్రంథము నాదరింతురని ఆశిస్తూ ఈ ప్రస్తావనను ముగిస్తున్నాను.

శ్రీభావనామసంవత్సర దీపావళి
విన్నిపెగ్, కెనడా.
నవంబరు 3, 1994.

ఇట్లు విన్నవించుకొను
బుధజనవిధేయుడు
దేశికాచార్యుడు

* * * * *

# సవరణ పట్టిక

(I) 174వ పుటలో "మల్లిక మహేశ్వరుని మ్రోల నాట్యమాడబోవుట" యనునది "శాన్తల మహేశ్వరుని మ్రోల నాట్యమాడబోవుట" అని యుండవలెను.

(II) 210 వ పుటలోని 195వ పద్యమున "భవద్రుణంబునున్" అను అపశబ్దము దొరలినది. అందుచేత పైపద్యము నీవిధముగా చదువుకొనగలరని మనవి.

చం. ధనికుడగాను మీఋణము ద్రవ్యము లిచ్చి తరింపజాలగన్
వణిజుడగాను మీఋణము స్వర్ణము లిచ్చి తరింపజాలగన్
జనపతిగాను మీఋణము సంపద లిచ్చి తరింపజాలగన్
ప్రణతులు దక్క మీఋణము బాపికొనంగ నెఱుంగ నన్యమున్



# ప్రథమోల్లాసము

వసంతకోకిల.

శ్రీకరంబుగఁ ద్రిభువనంబుల శిల్పిచందము నిల్పుచున్,
లోకపాలన మనెడు నాట్యములోన నిచ్చలు దేలుచున్,
లోకకంటకు లయిన దుర్జనలోకులం బరిమార్చుచున్,
లోకమేలెడు విజయకేశవు లోఁదలంచుచు మ్రొక్కెదన్. 1

చ. కళలకునెల్ల మూలమయి, కంజజుమోములె యాలయమ్ముగా
మెలఁగెడు వాణినిన్ జలదమేచకవేణిని గూర్చి తల్లిరో!
సులలితభావనాకలితసుందరకావ్యసుమస్రజంబు నీ
గళమునఁ గూర్చు భాగ్యమును కల్పనసేయు మటంచు వేఁడెదన్. 2

కం. పాడిన గాంధర్వంబగు,
నాడిన నాట్యంబగు, నమృతాభముగా మా
టాడినఁ గావ్యంబగు నే
చేడియ, దాని నజురాణి సేవింతు నెదన్. 3

ఉ. నీపదధూళి సోఁకునెడ నిల్చిన చిన్నరి తెల్లుపోఁచనై,
నీపలుకుల్ వినంబడెడి నేలను బొల్చిన కోకిలంబనై,
నీపరమేక్షణప్రభలు నెక్కొనుచోఁ * దిలకంపుమ్రాఁకునై,
ఓ పరమేష్ఠిరాణి! పడియుండి తరించెడి భాగ్యమీఁగదే! 4

సీ. గాంధర్వమే రూపుగైకొన్న నీకౌనె
నాగీతనికర మానందకరము?
సాహిత్యసర్వస్వసమ్రాజ్ఞి! నీకౌనె
నాకావ్యలేశ మానందకరము?
వేదవాగ్వనమందు విహరించు నీకౌనె
నావాగ్విహార మానందకరము?
చతురాస్యచతురాస్యసంవాసి! నీకౌనె
నామనోవాస మానందకరము?

తే.గీ. ఐన, నిరతనిశ్చంచలంబైనయట్టి
భక్తిభావంబుచే నీవు పట్టువడెద
వనుచు నినుఁగొల్తు నమ్మరో! యజనిరాణి!
రమ్మ! దీవింపు నారచనమ్మ నింక! 5

సీ. శ్రీశైలపూర్ణయ్య ప్రియశిష్యవర్యుండు,
శ్రీభాష్యకారుండు, శ్రీయుతుండు,
వరవిశిష్టాద్వైతవర్గాని కాద్యుండు,
సురగురుప్రతిముండు, స్థిరయశుండు,
శేషావతారుండు, భాషాఽద్వితీయుండు,
శ్రీరంగనాథాంఘ్రిసేవకుండు,
శ్రుత్యంతపారగుం, డత్యంతధీయుతుం,
డజ్ఞానతిమిరాపహారకుండు,

* 'తిలకో వీక్షణేన చ' - అను దోహదక్రియ ఇచట స్మరణీయము.

తే.గీ. మాన్యహొయసలరాణ్మణిమకుటఖచిత
మణిగణవిరాజితాంఘ్రిపద్మద్వయుండు,
వ్యాససూత్రార్థమర్మజ్ఞుఁ, డతులతేజుఁ,
డతఁడు యతిరాజమౌళి రామానుజుండు. 6

కం. ఆ రామానుజగురుని య
పారకటాక్షామృతమునఁ బ్లావితమై యే
పారెడు నాయెదలో నం
కూరించుత నవకవిత్వకోమలలతికల్. 7

ఉ. మున్నుగ నన్నపార్యకవిపుంగవు ముంగిటిలోనఁ బుట్టి, తి
క్కన్నకవీంద్రు చెంత నుడికారపు సొంపుల నభ్యసించి, పో
తన్నకవీంద్రు ప్రాపునఁ బదంబుల వీణియఁ బల్కనేర్చి, పె
ద్దన్నకవీంద్రు చెంగట నుదారరసాఢ్యచిత్రప్రబంధముల్
మిన్నగఁ బల్కనేర్చిన యమేయతరాంధ్రకవిత్వశారదన్
సన్నుతిఁజేతుఁ, దత్కరుణ సంధిలగ న్నుతిఁజేతు నాదృతిన్. 8

కం. ప్రతిపద మమృతమయంబుగఁ,
బ్రతివాక్యము భక్తిరసతరంగితముగ నే
యతితుల్యుఁడు భాగవతము
నతిదక్షతఁ దెన్గు చేసె నతని భజింతున్. 9

కం. శ్రీనాథుం భూరియశః
శ్రీనాథు నపూర్వకావ్యశిల్పకళాసు
శ్రీనాథు నపారప్రతి
భానాథు న్నుతియొనర్తు భక్తి తలిర్పన్. 10

సీ. అప్సరఃస్త్రీ యట్టు లాకట్టుకొను నొక్క
కవిపితామహుని సత్కావ్యకవిత,
పారిజాతంబ ట్లపహరించు మది నొక్క
ముద్దుపల్కులకవి పద్దెకైత,
అమృతంపుసోన+ యట్లలరించు శ్లేషయ
మకచక్రవర్తియౌ నొకని కవిత,
హరునైనఁ దాండవం బాడించు స్తుతమతి*
యైన యొక కవీంద్రు నమరకవిత,

తే.గీ. పూతరంగనాయకగళాముక్తమాల్య
సౌరభము నింపు నొక యాంధ్రసార్వభౌము
సత్కవిత్వసరణి! ఇ ట్లసదృశమైన
యుగమునకుఁ జేతు నతిఁ గరయుగము నెత్తి. 11

మ. అవధానంబులె యాటలై పరఁగ, సర్వాంధ్రావనీనాథులం
బ్రవిమోదంబునఁ దేల్చి, వారి కరుణన్ స్వర్ణాభిషేకంబులున్,
ధవళచ్ఛత్రవిభూషణాదిబహుసత్కారంబులుం గాంచి, కీ
ర్తివధుం బొందినయట్టి తిర్పతికవిన్, శ్రీ వేంకటేశాహ్వయున్. 12

కం. అభ్యర్థించెద, మద్రచ
నాభ్యాసక్షేత్రము సుఫలాన్వితమగు న
ట్లభ్యధికదయారసవీ
క్షాభ్యుదయముచేతఁ దన్పుఁ డనుచుం గడఁకన్. 13

---

+ 'వీనులవిందై, అమృతపుసోనల పొందై, అమంద సుమచలదళినీ గానము క్రందై, ఆరవ మానందబ్రహ్మ మైన నధిపతి వల్కెన్' అను వసుచరిత్రములోని పద్య మిచ్చట స్మరణీయము.

* 'స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కుల కేలఁ గల్గెనో యతులిత మాధురీమహిమ ...' యను చాటు విచ్చట స్మరణీయము.

కం. ఆ వేంకటకవిశిష్యున్,
శ్రీ వాల్మీకికృతిఁ గల్పవృక్షంబుగ నాం
ధ్రావని నిల్పిన ఘనునిన్,
సేవింతును విశ్వనాథచింతామణినిన్. 14

చ. ఒక వచనంబు వ్రాసి, పయి నూహకుఁ దోఁచినయట్లు దానినిన్
శకలములం బొనర్చి, పదసౌష్ఠవమున్ రుచిరార్థపుష్టియున్
వికలము సేసి, చేసితిఁ గవిత్వ మటంచు సముద్ధతిన్ సుప
ద్యకవిత దూఱు నక్కుకవి యౌవని దూఱెడు షండుఁడౌగదా! 15

శా. తాతాచార్యుఁడనం బ్రసిద్ధుఁడయి, విద్యాంభోజగర్భుండునై,
శ్రీతుళ్వాన్వయుఁ, గృష్ణరాయనృపతిన్ శ్రీ వైష్ణవాద్వైకసం
ప్రీతుం జేసినయట్టి దిట్టయయి, శ్రీ విష్ణ్వంశసంభూతుఁడై,
ఖ్యాతింజెందిన తిర్మలాన్వయుని సంధ్యానింతు నే నర్థిమైన్. 16

కం. ఆ తిరుమలవంశమునం
దాతతయశుఁడౌచు, రామతాతాచార్యా
ఖ్యాతుండయి, వరగుణవి
ఖ్యాతుండయి నాదు జనకుఁ డలరుచునుండున్. 17

చ. అతులితమంత్రశాస్త్రమున, నాంధ్రమునందున, జ్యోతిషంబునన్,
వితరణమందునన్, వివిధవేదములందున, సంస్కృతంబునన్,
స్థితమతియై యమోఘగుణదీపితుఁడై వెలుగొందు మత్ప్రసూ
పితరుని శేషనామకునిఁ బేర్కొనఁ జాలవు వాక్కు లెన్నియేన్. 18

కం. ఆతని కతులితసౌంద
ర్యాతిశయంబునఁ దనరెడు నలవేలమకున్
బ్రీతి పొసంగఁగ నొదవెను
మా తల్లి కుశధ్వజనకు మాసతివోలెన్. 19

తే.గీ. అట్లు బుట్టుటచేఁ గాదె యమరె నామె
కాదిలక్ష్మ్యభిధాన మన్వర్థ మగుచు,
పేరు లందఱికుండును పృథివియందు,
కాని యవి సార్థకంబగు ఘనులయందు. 20

కం. గుణభూషణులగు వారికి
జననంబందితిఁ దృతీయసంతానముగన్,
ఘనకృష్ణదేశికాఖ్యుఁడ,
వినుతాఖిలబుధుఁడ, వాణిభృత్యుఁడ నెపుడున్. 21

కం. ఘనశఠమర్షణగోత్రుఁడ,
వినుతాపస్తంబసూత్రవిన్యస్తమతిన్,
గణనజ్యోతిషసరణుల
ననుపమపాండిత్యవిభవ మబ్బినవాఁడన్. 22

సీ. బేలూరుపురములో వేంచేసియున్నట్టి
శ్రీ చెన్నకేశవున్ శ్రీనివాసు
స్మరియించుచు న్నేను శయనించి యున్నంత
నా చెన్నకేశవుం డతులతేజుఁ
డాపన్నరక్షకుం డతిదయాసాగరుం
డంభోధిజావరుం డబ్జనేత్రుఁ
డంభోదవర్ణుండు వ్యాసాదివినుతుండు
పీతాంబరోల్లసద్విగ్రహుండు

తే.గీ. స్వప్నమునఁ దోఁచి, మేఘనిస్వాన మెసఁగ,
'నాదు నిలయంబు నిర్మించినట్టి శిల్పి
జక్కనాచార్యు చరితంబుఁ జక్కగాను
కావ్యముగఁ గూర్చి పున్నెముం గాంచు' మనియె. 23

కం. పలుకున దొరక శిల్పకళా
జలజాసను కథయట, అల జలజాక్షుండే
పలికించెడునట దానిం
'బలికెద వేఱొండు గాథఁ బలుకఁగ నేలా?' 24

కం. ఒకచో శిల్పివతంసుగ,
నొకచోఁ గవికులపతిగను, నొకచో గాంధ
ర్వకళానిధిగను దానై
సకలకళామయుఁ డగుఁగద స్రష్ట ధరిత్రిన్. 25

కం. కావున నా శిల్పకళా
శ్రీవల్లభు మధురగాథ హృన్మోదముగన్
నే విరచింతును, దానిన్
శ్రీవల్లభునకుఁ గృతినొనరింతును గూర్మిన్. 26

షష్ఠ్యంతములు

కం.తు. మందారహారమండిత
సుందరవక్షునకు, జలజసుందరచక్షునకున్,
వందారునిఖిలనిర్జర
సందోహావనసమర్థచారుకటాక్షునకున్. 27

కం. ఆముష్యాయణవిబుధ
స్తోమాధికకీర్త్యమానసుచరిత్రునకున్,
శ్రీమండితగాత్రునకుం,
దామసదైత్యోదయదళనలవిత్రునకున్. 28

కం. చంద్రాదిత్యాక్షునకున్,
మంద్రేరితనారదమునిమహతీరవని
స్తంద్రీభూతోదయునకుఁ,
జంద్రేంద్రదినేంద్రకోటిసమతేజునకున్. 29

కం. వరకౌస్తుభవక్షునకున్,
నరహర్యక్షునకు, శార్ఙనందకచక్రా
దిరసితమాత్రవిభీతా ^
సురపక్షునకున్, బిసప్రసూనాక్షునకున్. 30

కం. వనమాలాలంకృతునకు,
ఘనపీతాంబరవృతునకుఁ, గాంచనరత్న
ప్రణిహితకిరీటయుతునకు,
మణిమయభూషాన్వితునకు, మాసహితునకున్. 31

కం. శ్రీ చెన్నకేశవునకును,
బ్రాచేతసనాచికేతవాచంయమము
ఖ్యాచితనిస్తులవిజ్ఞా
నోచితునకును, దురితతిమిరోష్ణాంశునకున్. 32

తే.గీ. కానుకగ నేను రుచిరార్థగౌరవంబుఁ,
జారుపదవృత్తరీత్యలంకారగతులుఁ,
బరఁగఁ గూర్చెడి 'జక్కనచరితము'నకు
నారబం బగు నీరీతి నంచితముగ... 33

కథాప్రారంభము – వసంతర్తువర్ణనము

తే.గీ. మంజుసుమభూషలను దాల్చె వంజులంబు,
సుకలగానంబులను దేల్చెఁ బికకులంబు,
సారసాసవంబును బీల్చె షట్పదంబు,
అపుడు వనిలోనఁ బొల్చెఁ జైత్రాగమంబు. 34

తే.గీ. లలితపవమానచలితంబులైన యట్టి
కోమలారుణపల్లవాంగుళు లదల్చి
పిలిచి రప్పుడు తీవియపేరఁటాండ్రు
సర్వలోకమున్ మధుమాసపర్వమునకు. 35

సీ. జగములం గెల్వంగ స్మరరాజు గైకొన్న
* వాఁడివవ్రుువకరవాలు లనఁగ,
అల వసంతునకు నాహ్వానముం బల్కంగ
ధరను నిల్పిన శుభధ్వజము లనఁగ,
[1] మోవిపూఁతను సిద్ధమొనరించుకొనఁ గోరి
వని కూర్చుకొన్న సంభార మనఁగ,
వలపుమై ఋతురాజు వనరాణితనువునం
గూర్చిన నెలవంకగురుతు లనఁగ,

తే.గీ. [2] పగలు గల్గినఁ [3] దేజంబుఁ బాయకుండ,
క్రొత్తగ మధుండు సృష్టించికొన్నయట్టి
పొలుపుమీరెడు [4] నెలవంకచెలు లనంగ,
మోదుగులు పూచె లోకాభిమోదకముగ. 36

* వాఁడివవ్రుువకరవాలు = పదనైన గుండ్రని కత్తులు; 1. మోవిపూఁత =Lipstic; 2. పగలు = పగటిపూట, వైరములు; 3. తేజంబు = కాంతి (పగటి పూట యను నర్థమందు), పరాక్రమము (వైరము లను అర్థమందు). నెలవంకచెలులు = చంద్రవంక లను స్నేహితులు. అసలు చంద్రుడు పగలు గల్గినప్పుడు నిస్తేజస్కుడగుటచే నట్లు గాని (నెలవంకలవలె నున్న) మోదుగుపూవు లను క్రొత్తచంద్రవంకలను సృజించుకొనెనని భావము

[1] ఉ. హిమగిరికాననంబున మహేశునిమస్తకమందు మున్నుగన్
హిమకరఖండమంజులత నీక్షణసేసి తదీయచారుతన్
క్రమముగ నిష్కళంకతయుఁ గల్యవిభాసితయుం గలట్టి పూ
గములను గాంచి గెల్చెననఁ గాంతివహించెను కింశుకాగముల్. 37

తే.గీ. పవలు సొంతము వేసంగి పంటపొలము
లందు శ్రమియించి యిలుసేరు నతివ లిపుడు
మోదుగుంబూలఁ దలలందు మోదమెసఁగఁ,
దాల్చి నడతు[2] రార్యలయట్లు దారులందు. 38

కం.తు. పొగడలుపొన్నలు పూచెం,
బొగడలుపొన్నలు విరియక పూర్వమె పూచెన్ మో
దుగు లా మోదుగుపొన్నలు
పొగడలు పూవక మునుపుగఁ బూచెం గురువకముల్. 39

తే.గీ. అహమహమికచే నిట్లు దోహదము లేవి
లేకయే కుసుమించె వనౌకహములు;
ఆత్మసామర్థ్యసిద్ధుల కవసరంబె?
అన్యదోహదప్రేరణాద్యాశ్రయములు! 40

కం.తు. కెందలిరాకుల వసనం
బందంబుగఁ దాల్చి, నవలతాంతాభరణంబుల్
పొందుగ ధరించి, పికకుల
వందిగణంబులు నుతింప వఱలె రసాలంబుల్. 41

1. నిష్కళంకతయు = మచ్చలేకుండుటయు, కల్యవిభాసితయు = పగలు ప్రకాశించుటయు; కింశుకాగముల్ = మోదుగుచెట్లు; చంద్రవంక మచ్చగలదియు, పగలు నిస్తేజస్కమగునదియు నగుటచేత, ఏతద్దోషరహితములైన పూలచే మోదుగులు చంద్రవంకలను గెల్చెనని భావము; 2.ఆర్యలు = పార్వతులు. పల్లెతల కురులం దర్ధచంద్రాకారముగా నున్న మోదుగుపూవులు శివుని యర్ధదేహములో నున్న పార్వతి తలలోని నెలవంకవలె నున్నవనియు, అందుచే వారు భూమిపై నడయాడు పార్వతులవలె నున్నారనియు భావము.

చం. * పొలుపగు పూవుగుత్తు లను పొంకపుగుబ్బలు పొంగువారఁగన్,
లలితసుపల్లవోష్ఠములు రమ్యముగాఁ జలియించుచుండఁగన్,
వలపునఁ గౌఁగిలించె విరవాదినిఁ జూతకుమారకుం డొగిన్
చలితములైన శాఖ లను చక్కని బాహుల సాఁచి యిమ్ముగన్. 42

చం. చెలువగు తీవజొంపములఁ జెందుచుఁ జెంది తదీయవల్లికా
విలసితపుష్పపాంసువులఁ బెల్లుగఁ జల్లుచు నెల్లదిక్కులన్,
కొలఁకులలోనఁ దమ్ములను గోకనదంబులఁగూడి నాట్యముల్
సలుపుచుఁ దావులం దెసలఁ జల్లుచు వీచె వసంతవాయువుల్. 43

కం. స్మరపరమాత్ముని కాముక
వరదంబౌ భూతి నొసఁగి ప్రజలందఱికిం
దురితంబులఁ బాపఁగఁనో
విరిపొడిఁ జల్లుచు దెసలను వీవలి వీచెన్. 44

ఉ. గన్నెరు తావిఁ గొల్లగొను, గన్నెరు కన్నను మిన్నయౌగదా
పొన్నలటంచుఁ దత్కుసుమపూగసుగంధము లెల్లఁ గ్రోలు, నా
గన్నెరుపొన్నలం గెలువఁ గల్గును కాంచన మంచు దానినిం
గ్రన్ననఁ జేరఁగాఁ జనును గంధవహుం డతిచంచలాత్ముఁడై. 45

తే.గీ. రమ్యకిసలయక్షౌమవిరాజితంబు,
సుందరాబ్జకుట్మలకుచశోభితంబు,
చలదళినికరధమ్మిల్లసంయుతంబు,
నైన వనలక్ష్మిసౌందర్య మరయుకొఱకు
నాగి మెలమెల్లగా సాగ నర్యముండు
సాఁగ సాగెను పవలు వసంతమందు. 46

* 'సన్నిహితేహి ప్రియతమే వధూనాం స్తనపూర్తి రధరస్ఫురణం చ భవతి' యని యున్నది కదా!

తే.గీ. లలితకోకిలారవముచేఁ బలుకరించి ,
సురభిళానిలవీచికాకరముచేతఁ
దట్టి పాంథుల శోకంబు నెట్టివేయ
యత్నమొనరించె మాధవుం డైనఁగాని. 47

తే.గీ. ఆ రవంబులె, యనిలప్రసారణములె
ద్విగుణ మొనరించెఁ బాంథుల విరహబాధ,
నిలను రోగముం గూర్పంగఁ దొలఁగఁజేయ,
నవియె ద్రవ్యంబులు సమర్థ మగును గాదె! 48

కం. అనుపమమార్దవహృద్యము
లనిలచలత్కేసరములు నగు పూసురఁటుల్
గొని వనవిహరణసంభ్రమ
మును దొలగించెను దిరిసెనముల్ రసికులకున్. 49

చ. చిగురులచీరఁ దాలిచి, విచిత్రమనోజ్ఞసుపుష్పభూషలన్
సొగసుగ గాత్రమం దునిచి, సొంపుగ దక్షిణమారుతాఖ్య నా
ట్యగురుఁడు భంగిమల్ దెలుప, నాడెను కాననలక్ష్మి నేఁడిదే
ఖగకులగీతికారుతుల కర్షముగాఁ దనువల్లిఁ ద్రిప్పుచున్. 50

సీ. ఉత్తరంబునఁ గల్గు నుత్పలంబులఁ జేర
నొకపదం బుత్సాహమూనుచుండ,
దక్షిణంబునఁ గల్గు తమ్మిపూవులఁ జేర
నొకపదం బుత్కంఠ నూనుచుండ,
ప్రాచీదిశం గల్గు వంజులంబులఁ జేర
నొకపదం బాసక్తి నొందుచుండ,
పశ్చిమంబునఁ గల్గు వకుళంబులను జేర
నొకపదం బుబలాట మొందుచుండ,

ఊర్ధ్వభూముల నున్న [1] ఉడుపుష్పములఁ జేర
నొకపదంబు ప్రయత్న మూనుచుండ,
నిమ్నభూముల నున్న నీలిపూవులఁ జేర
నొకపదం బుప్పొంగి యురుకుచుండ,

తే.గీ. ఏ దెసకుఁ బోవలెనొ మది నెఱుఁగలేక
తిరిగె [2] షట్పదంబులు కొన్ని తెరవు దప్పి,
[3] బహుపదంబులు గల్గిన వారి గతులు
భ్రష్టమౌగాదె యీరీతి వసుధయందు. 51

కం.తు. శృంగారమె రసరాజము,
సింగారులతోఁ బ్రణయమె జీవితలక్ష్యమటం
చుం గంతునిసూక్తుల దెస
లం గొంతెత్తి పరభృతకులంబులు వినిపించెన్. 52

*తటాక (సరోవర) వర్ణనము*

కం. ఇట్టులఁ గ్రీడాపుర మను
పట్టణనికటస్థమైన వనమందునఁ గ
న్పట్టెను సురదీర్ఘికకుం
బట్టి యనందగు తటాకవర మొక టింపై. 53

ఉ. అచ్చపు నీటితోడ నరుణాంశుల వెల్గు తటాకశాటిపైఁ
బచ్చని తామరాకు లను పచ్చలఁ బూన్చి, తదంతరంబునన్
విచ్చెడు వింతరంగుటరవిందము లన్ మగరాలఁ గెంపులం
గ్రుచ్చి, మధుండు భూషలను గూర్చి, అలంకృతిఁ గూర్చె నుర్వికిన్.54

1. ఉడుపుష్పము = జపాపుష్పము (దాసానపువ్వు; ఉడుపుష్పం జపా - అని అమరము); 2. షట్పదము = ఆఱుకాళ్లు గలది = తుమ్మెద; 3. బహుపదంబులు = అనేకములైన కాళ్లు, లేదా అధికారపదవులు.

సీ. లలితానిలంబుచే లులితంబులౌ చిన్న
యలలందుఁ దూఁగాడు నంచగములు
పేరైన ప్రమిదలో వెల్గు దీపములట్లు
విలసిల్లు రక్తారవిందతతులు
పద్మాలయాశ్రమావాసపుణ్యంబుచే
* బ్రహ్మతేజము గన్న భ్రమరకులము
వనదేవతాగండభాగస్థమకరికా
పత్రంబులంబోలు పద్మదళము

తే.గీ. యుల్లసిల్లంగఁ గుసుమాస్త్రు డెల్ల జగతిఁ
గెల్వఁగాఁ జైత్రశుభవేళఁ గీరమేధ
ముం బొనర్చి, పై నవభృథంబుం బొనర్చు
పుణ్యతీర్థంబునా వనిఁ బొల్చె సరసి. 55

చ. తరళతరంగమాలికలు తాఁకుటచేత సముత్థితంబులై
హరితసరోజపత్రముల యందున వ్రాలుచు నీటిబిందువుల్
సురుచిరమౌక్తికప్రభల శోభిలసాగెను శుక్తిలేకయే
వరసితమౌక్తికాళి వనపద్మజ నేర్పునఁ జేయనేర్చెనాన్. 56

కం. సరసీజాప్తుని బింబము
సరసీజలముల స్ఫురించు చందము దోఁచెన్
ఖరకరుఁ డాత్మోష్మమునే
భరింపఁజాలక మునింగె వారి ననంగన్. 57

కం. సరసీజాప్తుని బింబము
సరసీజలముల స్ఫురించు చందము దోఁచెన్
సరగునఁ బద్మినితో రవి
సరసములాడంగ డిగ్గె సరసికి నాగన్. 58

* బ్రహ్మతేజము = బ్రహ్మవర్ణమైన స్వర్ణకాంతి (అనగా పద్మకింజల్క మలమికొనుటచేఁ గల్గిన పసుపు కాంతి), బ్రహ్మవర్చస్సు. పద్మము పద్మాలయకు (లక్ష్మికి) ఆశ్రమము. అట్టి పుణ్యాశ్రమావాసముచే బ్రహ్మవర్చస్సు (పసుపుకాంతి) అబ్బినదని భావము.

తే.గీ. కలిమిచెలువకు నెలవులౌ కంజములను
నిలుపఁగల్గిన తూండ్లను నులుపసాగె
పలుకుచెలి వాహనము లిట్టి వగును గాదె
అత్తగోడంగ్ర కూరుము లవనియందు! 59

మత్తకోకిల. చంచరీకవధూజనంబుల చారుమంగళగీతముల్
క్రౌంచపక్షపటాపటారవరమ్యమర్దలరావముల్
మంచిముత్తెము లట్టి వాఃకణమంగళాక్షతలుం దగన్
చంచలాంగులఁ బిల్చెఁ గేళికి సారసాకర మత్తఱిన్. 60

వనకేళి - ప్రప్రథమనాయికాస్ఫురణము

సీ. నీరంబులం ద్రావ నికటంబునన్ వ్రాలు
వర్షాభ్రముంబోలు వాలు కురులు,
చేరువం జెల్వారు సారసంబులనుండి
కప్పముం గొనురీతి నొప్పు ముఖము,
ఇందీవరశ్రేణి కీక్షణంబులచేత
నడవడిం గఱపెడు నయనయుగము,
పోలలేని మృణాళముల నీట దిగద్రొక్కి
పైకి నిక్కుచునున్న బాహులతలు,

తే.గీ. చెలువు మీరంగ, నూర్వశిం గెలువఁజాలు
చెలియ లిరువైపులం జేరి కొలుచుచుండ
పాలకడలిని విహరించు పద్మవోలెఁ
గాననయ్యె నా సరసిలోఁ గాంత యొకతె. 61

చం. వివిధములైన వర్ణముల విచ్చిన తమ్ములె తారకంబులై,
విపృతములైన పర్ణములె విస్తృతనీరదమండలంబులై,
ప్రవిమలమైన యర్ణమె నభంబయి వెల్గగ నా సరస్సునన్
సువిమలుఁడైన పూర్ణశశి సొంపున నొప్పెఁ దదాస్యబింబమే. 62

కం. కుతపమునందున నాతప
మతిదారుణమై చనంగ నారామశ్రీ
హితపద్మాకరగాహన
రతయయ్యె ననంగ నవ్వరాంగన పొల్చెన్. 63

చం. పొఱలుచునున్న పుష్పమధు వొక్కటఁ గూర్చి కొలంకుఁ గట్టెనో
సురుచిరరీతిఁ జైత్రుఁడన సొంపెసలారెడు నా సరస్సులో
స్మరసతి వారికేళికయి చయ్యన డిగ్గెనొ నాగ నొప్పె నా
స్ఫురదరుణాక్షి, తత్సఖులు వొల్చిరి యచ్చరలేమలట్లుగఁ. 64

కం. 'కనవే మల్లిక! మధు నివ
సనమున నిడినట్టి ముగ్గుచాలులఁ బోలెన్
తనరారెడు నీ కొలఁకున
ననుపారెడు నవ్యరమ్యనాళీకంబుల్. 65

కం.తు. తిలతండులముల చెలువున
నళిమండలి పై కెగసెడు నంబుపృషంతులతో
మిళితంబయి భ్రమియించెడుఁ
జెలి మల్లిక! యీ మనోజ్ఞచిత్రంబును గంటే? 66

కం. లోకంబునఁ గంతుఁడు ప్రే
మైకపరాయణహృదయుల నభినందింపం
జేకూర్చుకొన్న గద్దియ
యీ కమలపుమిద్దియ పరికింపవె దీనిన్. 67

కం. లోకంబునఁ గంతుఁడు విర
హైకరుజాగ్రస్తుల ధృతి హతమార్చుటకై
చేకూర్చుకొన్న గద్దియ
యీ కమలపుమిద్దియ తిలకింపవె దీనిన్. 68

కం. చెందొవ లగు విరహులపైఁ
గందిన మన్మథుని కెంపుకన్నులు మల్లీ !
సుందరకైరవముల్ రా
గాంధులఁ గని మురియు నతని యక్షులె చెల్లీ ! 69

కం. ఈ లీలం జెలులందఱి
యాలాపంబులు వినంగ నవగతమయ్యెన్
ఆ లోలాక్షియె మల్లిక
వాలాయంబుగ నగునను వార్తయె యంతన్. 70

కం. విరులందున మల్లికవలెఁ
దరుణులయందున మనోజ్ఞతరయై తగు నా
వరవర్ణిని సకియలతో
సరసీనీరములఁ గేళి సల్పుచు నుండన్. 71

ఉ. తెల్లని నీటిలోన సుదతీమణు లెల్లరు శ్రేణిఁ గట్టుచున్,
సల్లపనంబు లాడుచును సంచరియించుచునుండ వారి ధ
మ్మిల్లము లెల్ల వీడ్వడుచు మిత్రసుతాఽసితవేణులట్లు భా
సిల్లెను; దాన నా సరసు చెల్గెఁ బ్రయాగసుతీర్థమట్టులన్. 72

చం. మొకములు తమ్ములన్ భ్రమను మూఁగెడు తేఁటులఁ ద్రోసిపుచ్చఁగన్
సకియలు చేతులం బయికి సాఁచిరి; వానినె తమ్ములంచుఁ బా
యక యళు లేచసాగె; నపు డా చెలు లుత్కటనీలవీక్షణ
ప్రకరముచేతఁ గన్గొనిరి; వారల నప్పుడె వీడె భృంగముల్. 73

ఉ. మవ్వములైన బాహువుల మంచిమృణాలములంచు హంసముల్
క్రొవ్వి గ్రహింపఁబోవ నొక కోమలి తల్లడమొందె; నంత నా
జవ్వనిబోటి చేరువ నెసంగెడు తమ్ములు దూసి వానిపై
రువ్వెఁ; దదంబుజాతరసలోలములౌచుఁ దొలంగె హంసలున్. 74

వనమయూరము. ఒక్క సరసీజముఖి యూర్మికలలోనం
జిక్కుకొని సారెవలె శీఘ్రముగఁ దిర్గెన్,
మక్కువ సురాసురులు మంథనము సేయన్
గ్రక్కునను బాల్కడలిఁ గల్గు సుడులందున్
జిక్కుకొని వెల్వడిన శ్రీరమణి వోలెన్. 75

ఉ. సారసవక్త్ర యోర్తిగయఁ జయ్యన నీరమునుండి యెత్తుగన్,
చేరువ నున్న పూర్ణసరసీరుహవక్త్రలు దాని మధ్యమున్
భోరనఁ బట్టి యచ్చటనె పూన్చిరి; యత్తరిఁ దల్లతాంగు లిం
పారిరి క్షీరవార్ధిజనితామరభూరుహశాఖలో యనన్. 76

తరలము. తరుణి యొక్కతె నీరముం దగఁ దట్టి సవ్వడిచేయఁగన్
బరఁగె నయ్యది మర్దలారవభాతి వీనులవిందుగన్
దరగ లేర్పడె; వానియందునఁ దమ్ములంచలుఁ గల్వలున్
బరపె నృత్యముఁ దద్రవానుగుణంబుగాఁ గనువిందుగన్. 77

తరలము. అతివ యోర్తుక మధ్యభాగమునందు నీదుచునుండఁగా
నితరకాంతలు బాహువల్లరు లెత్తి చల్లిరి నీరమున్
కుతుకమొప్పఁగ నాగలక్ష్ములు గూడి తొండపుజల్లులం
దితిజవైరివధుం జలంబులఁ దేల్చు చందము మీరఁగన్. 78

తే.గీ. ముగ్ధ యోర్తుక నీటను మునిఁగి తేలఁ,
దొలుతఁ దిమిరంపు భ్రాంతినిఁ గొలిపెఁ గురులు;
పైని నిందుఁడో యనఁ దోఁచె వదనబింబ,
మందుఁ దొవలట్లు వెలుగొందె నక్షియుగము! 79

ఉ. మోములు ఫుల్లపుష్పములు, పొంకపు గుబ్బలు విచ్చుమొగ్గలున్,
శ్రీ మహితంబులై తగు శరీరలతల్ మృదులంపునాళముల్,
సామినిమీలితాక్షులు ప్రశస్తదరస్ఫుటసూనరాజియై
గోమువహింప నీదు నెలకొమ్మలు పద్మినులౌట భాగ్యమే! 80

మ. శతపత్త్రాక్షులు సంతసంబున నిటుల్ సౌమాస్త్రసంకీర్తనల్
శ్రుతిపర్వంబుగఁ బాడుచున్, సరసిజస్తోమోద్గతామోదసం
యుతవాతంబు లడంప సంశ్రమము నెంతోసేపు క్రీడించి, ని
ర్గతలై పోలిరి స్వర్ణదీతటమునన్ రంజిల్లు స్వర్భామలన్. 81

కం. తోరపుఁబిఱుదుల నాడెడు
వారణయానల నిషిక్తవాలము లంతన్
వారిం గురిసెం దగఁ గ్రొ
క్కారున జడిగొన్నవార్షుకాభ్రము లటులన్. 82

కం. లలనల మేనుల నంటిన
సలిలనిషిక్తాంబరముల చందము దోఁచెన్
చెలువుగ నొకశిల్పివరుం
డల ప్రతిమలపైఁ దొలచిన యంశుకము లనన్. 83

మనోరమావృత్తము

ఈరీతిఁ బ్రాప్తతటులై ఇందుముఖు లంతన్
ధారాధరాంచితసురేంద్రాయుధము లట్లన్
శ్రీరంజితంబులగు చేఁజీరలను గొంచున్
నీరంబులం దుడిచి రున్నిలకచరాజిన్. 84

---

80: పద్మినులు = తామరతీవెలు, పద్మినీజాతిస్త్రీలు; 84: ధారాధరాంచిత సురేంద్రాయుధము లట్లన్ = మేఘములయం దొప్పారు నింద్రధనుస్సుల వలె, (ఇంద్రాయుధం శక్రధనుః - అని అమరము), శ్రీరంజితంబులగు =శోభాయుతములగు, చేఁజీరలు = తువ్వాలులు( Towels)

కైసేఁత

తే.గీ. ఆత్మ నంటి తొలంగని యాశలటుల
నంగములనంటి తొలఁగని యంశుకముల
నంగనామణు లెట్లొ తొలంగఁజేసి
కనకలతికల కెనయైన గాత్రములను 85

తే.గీ. తాల్చి నవదుకూలంబులఁ దనరి రపుడు,
ఒరను దూర్చిన కాముని శరములట్లు,
ఛదనసంవృతపుష్పగుచ్ఛంబు లట్లు,
శిశిరపరివృతశతపత్త్రవిసర మట్లు. 86

తే.గీ. పిదప ధమ్మిల్లములఁ దీర్చి, విరులఁ దాల్చి ,
గందము లలంది మేన, ముఖేందుసీమఁ
దిలకపత్త్రభంగంబులం దీర్చిదిద్ది,
ముద్దియలు మాధవార్చనబుద్ధి నలరి. 87

వసంతార్చన

ఉ. పుష్పొడితోడ వేదికను బొల్పెసలారఁగ నిల్పి, దానిపై
నొప్పగ రంగవల్లులటు లుంచి సువంజులపుష్పసంతతిన్,
గొప్ప యనంటికంబములఁ గూర్చి, సుపల్లవతోరణాళి నిం
పొప్పఁగఁ జేర్చి వానిపయి, యుగ్మలు లత్తరి సంభ్రమంబునన్. 88

తే.గీ. లలితలవలీదళంబులఁ జెలువుమీరఁ
జైత్రుఁ గుసుమాస్త్రుఁ గైరవమిత్త్రు వ్రాసి,
నడుమఁ జైత్రుని గుసుమాస్త్రుఁ గుడికి నిలిపి,
ఎడమదెసను గైరవమిత్త్రు నెసఁగఁజేసి. 89

కం. వాసన వీసరవోవని
భాసురసుమములు, సుపక్వఫలములు, దేఁటుల్
మాసరచూడని భవ్యను
మాసవముల్ గొంచుఁ గాంత లంచితభక్తిన్. 90

సీ. ధ్యానంబు సర్వచరాచరాంతర్యామి
కావాహనము చేతనాప్తునకును,
అర్ఘ్యంబు నవపల్లవానర్ఘపాణికిం
బాద్యం బఖిలపాదపాప్తునకును,
ఆచామ్య మఖిలాగమాంచిత పుష్పాస
వోత్పాదనకళావిదుత్తమునకు,
అభిషేక మనిశనిష్యందిమరంద ధా
రాప్లావిత మనోహరాంగునకును,

తే.గీ గంద మతిశయామోదసంకలితతనున,
కలరుదోయిల్లు పూవులహాదనుదొరకు,
నారతి పలాశవికసనకారకునకు,
శరణు షడ్రుతుపతికిని, స్మరునిచెలికి! 91

వసంతస్తుతి

ఉ. పూవులవింటితేని సఖ! పూని జగంబుల ముగ్ధమోహన
శ్రీ విభవంబులై, జనులచేతములన్ హరియించు పూవులన్
నీవు సృజించి నిల్పనిదె, నిక్కి తపంబున మేనుఁ బాసినన్
వావిరి లోకజేతయను వాసి వరించునె పంచబాణునిన్. 92

చం. తలిరులచీర లింపెసఁగఁ దాల్పఁగఁజేసి, శిరంబులందునన్
విలసితపుష్పగుచ్ఛములఁ బెట్టి, లతాళి నలంకరించి, పైన్
వలపులు జిల్కుచుం గుసుమవారమృషం జిఱునవ్వు లొల్కుచుం
గులుకు మహీజపూరుషుల కూటమి గూర్తువు నీవు వారికిన్. 93

ఉ. ఒక్కెడ నింతిచందమున నుందువు వల్లరులందు నీవు, వే
రొక్కెడఁ బూరుషాకృతిని బొందుదు వున్నతపాదపంబులన్,
అక్కజ మిద్ది! నీ వగుదు వామనిరూపున నున్న గౌరినిన్
మక్కువ నర్ధసంహననమందు ధరించిన యీశ్వరుండవే. 94

ఉ. తాఁకినఁ గందు పుష్పసముదాయమునందు ఘటించి లోహపున్
బాకునకున్న తీక్ష్ణతను, బాలమరుత్తునకే తలంకి చీ
కాకునుజెందు తీవలను కామునివాగురలట్లు సేసి, యీ
లోకము నెల్ల నీ మహిమలో పరిణిష్ఠ మొనర్తు వామనీ! 95

ఉ. కోకిలగొంతులోఁ బ్రణయకోమలగీతులు గీలుకొల్పి, నా
నాకమనీయవర్ణవసనాళి లతాళి నలంకరించి, రా
గైకరసప్రవాహమున యౌవనవంతుల నెల్లఁ దేల్చి, యీ
లోకము నేలెదోయి, అతిలోకరసాబ్ధిసుధాకరుండవై. 96

మ. కమలామోదము సంఘటించి, ద్విజసంఘాతమ్ముకున్ సత్ఫల
ప్రమదంబున్ ఘటియించి, భవ్యసుమనోవ్రాతంబు కభ్యున్నతిన్
సముపాత్తంబొనరించి, సర్వజగతిన్ చైతన్యసంస్ఫూర్తితో
సమవేతం బొనరించి, విష్ణుతను సంచారింతు వో మాధవా! 97

శా. శ్రీ కాశ్మీరసుచందనాగురుమురాశ్రీసంజ్ఞతాంబూలికా౽
స్తోకాంభోజసుమల్లికాకదళికాచూతౌఘసౌభాగ్యముల్
ప్రాకట్యంబుగఁ దీర్చిదిద్దుదొర! యీ వన్యంబు లే మిచ్చుటల్
రాకాంభోధికి నంబుతర్పణములీలం బ్రీతిఁ జేకోగదే! 98

కం. అనుచుం బరిపరివిధముల
వనజాతాస్యలు పసంతుఁ బ్రణుతించి తగన్
ఘనతరవసంతకేళీ
ప్రణివిష్టసుధీయుతలయి ప్రమదం బెసఁగన్. 99

## వనవిహరణము - వసంతకేళి

మధురగతిరగడ: విరిసిన మోదుగువిరుల రసంబును
నెఱి నింపిన జేవురునీరంబును
బొరిపొరి సుషిరంబులఁ బూరింపుచు
సరసంబుగ నొండొరుపయి నింపుచు, 100-1

చేతంబులు ముదసిక్తములై తగఁ,
గేతకిసుమములఁ గేలం గిల్లుచు,
భూతిం బోలిన పుప్పొడిఁ బెల్లుగ
బ్రాతిం బెఱతెఱవలపైఁ జల్లుచు, 100-2

మాకందంబుల మంజరవంబులఁ
గూకూ యనుచుం గూయు పికంబులఁ
గోకో యని యేకోక్తిగఁ నఱచుచుఁ
బ్రాకట్యంబుగఁ బరిహాసియించుచు, 100-3

కలగానంబుల నల ప్రియకంబుల,
లలితపదాహతుల నశోకంబులఁ,
బొలుపగు నగవులఁ బున్నాగంబుల,
మలసెడు ముఖరుచి మాకందంబుల, 100-4

అనువగు పలుకుల నాక్షోటంబుల,
నెనరు గవుంగిళులను గోరంటల,
క్షణమందున ననఁగొనఁగాఁ జేయుచు,
వనరమకు నవాభను జేకూర్చుచు, 100-5

వాతెఱతోడన్ వాదుకువచ్చెడు
లేతచిగుళ్లను చేతం బుడుకుచు,
వాతెఱ బింబం బని తినవచ్చెడు
ఆ తుంటరి కీరాళి నదల్చుచు, 100-6

మునుపే విరిసిన పూల సుగంధము
గొని చరియించెడు ననిలకుమారుని
ఘననిజగాత్రాననముల గంధము
లొనగూర్చుటచే నొనరిచి ధన్యుని, 100-7

అలరుందీవియ లందున నూఁగుచు,
నలరుందేనియ లందునఁ దోఁగుచు,
నలరులగుత్తుల నాస్యముఁ జేర్చుచు,
నలరులవిల్తుని యమ్ములఁ బోలుచు, 100-8

కెంపగు చేతులఁ గెందలిరాకుల,
నింపగు చూపుల నిందీవరముల,
సొంపగు పలుకుల శుకనివహంబులఁ
గంపిలు నడకలఁ గలహంసంబుల 100-9

నలరించుచు, వనమందుఁ జరించుచు,
తెలినవ్వుల దిక్కుల వెలిగించుచు,
జలజాతాక్షులు చెలఁగిరి ముదమున,
నిల మెట్టిన ద్యోలలనల విధమున. 100-10

కం. ఈవిధి వనవిహరణసం
భావితచేతోఽంబుజలయి మదవతు లంతన్
వావిరి దాఁగుడుమూఁతల
తో వేళను బుచ్చ నిచ్చతోడం గడఁకన్. 101

## దాఁగుడు మూఁతలు

చం. ముగుద యొకర్తు 'దొంగ యయి' మూసికొనం గనుదమ్ము, లన్యలౌ
ముగుదలు తత్క్షణంబుననె పూఁబొదలందునఁ జెట్లసందులం
దగపడకుండ దాఁగికొని, రత్తరి నాజవరాలు కన్నులం
దగ వివృతంబొనర్చి యటు దాఁగిన కన్నెలయున్కి నారయన్. 102

సీ. మాధవి దాఁగుఁబో మాకందముల చెంత
నని మావికోవులయందు వెదకి,
చంపక యుండుఁబో సాలావళుల పొంత
నని సాలవనములయందు నరసి,
[1] శారద గ్రాలుఁబో సరసీతటప్రాంత
ముల నంచుఁ దటములఁ గలయఁ జూచి,
మల్లిక డాఁగుఁబో [2] మాతులుంగోపాంత
మున నంచు నారంగవనుల నెమకి,

తే.గీ. ఎట్టకేలకు మల్లికఁ బట్టుకొనుచు,
'దొంగ! దొంగ'ంచు దెసలు మోఱగంగ నఱచె,
నంత మల్లిక దొంగయై అక్షియుగళి
మూసికొనె, యోషితలు దాఁగ నోసరిలిరి. 103

తే.గీ. అపుడు మల్లిక చేతుల నల్లఁ దీసి,
కన్నులను విప్పి, దిక్కులఁ గలయఁ జూచె,
ప్రత్యుషస్సమున్మేషితపద్మయుగము
వెడలు నళులట్టు లా చూడ్కు లడరుచుండె. 104

1. శారద = శారద యను స్త్రీ, ఏడాకుల యరటి (సప్తపర్ణే విశాలత్వక్ శారదో విషమచ్ఛదః - అని అమరము)
2. మాతులుంగము = దూదినిమ్మ, దీనికి 'మల్లికాకుసుమప్రియ' మను నామాంతరము శ్రీమాన్ విక్రాల శేషాచార్యులవారి సంస్కృతాంధ్రపదార్ణవములో నున్నది. ఈ పద్యములోని మాధవ్యాది శబ్దములు స్త్రీ పరముగను తన్నామకలతాదిపరముగను అన్వయించుట గమనించునది.

చం. అలకలు మబ్బుతున్కలటు లాస్యసుధాంశునిపై నటింపఁగాన్,
గులుకునడల్ ధరిత్రిపయిఁ గోకనదంబులచాల్ సృజింపఁగాన్,
వలుద పిఱుంద వెన్కకును, వక్షువచన్గవ ముందు కీడ్వఁగాన్,
అలసత నేగుచున్, నిజవయస్యలు డాఁగిన చోట్లు జూడఁగాన్. 105

కం. నడయాడెడి మెఱుపు తెఱం
గడవిం దిరుగుచు, లతాగృహంబుల ధ్వాంతం
బుడుపుచు, సకియల జాడం
బొడగాంచుచు సందడించు పుల్గులవలనన్. 106

చం. ఒకపొద చెంగటన్ మిగుల నుత్తలపాటును జెంది యార్చుచున్,
చకచక గుంపులై యెగసి సత్పథమందున జంక్రమించుచున్,
వికిరము లెన్నొ కన్పడఁగ, వెంటనె మల్లిక తద్గృహంబునన్
సకియలు డాఁగియుండిరని చక్కఁగ నమ్మి హృదంతరంబునన్. 107

కం. ఉరువడిఁ బరుగిడి యా పొద
మఱుగునఁ నొక యనుపమేయమంజులమూర్తిన్
గురుతించి 'దొంగ' యని బి
ట్టరవంగనుబోయి యామె యంతటి లోనన్. 108

చెలులకై వెదకుచు మల్లిక యొక అజ్ఞాతపురుషుని గన్గొనుట

ఉ. అస్యంబు రాకాసుధాంశుమండలమె, కాని
శ్మశ్రురేఖాచిహ్నసంయుతంబు,
చక్షుర్ద్వయం బబ్జసన్నిభంబే, కాని
రాజసంబగు దృష్టిరాజి కునికి,
అంసద్వయము స్నిగ్ధమాంసలంబే, కాని
ఔన్నత్యవైశాల్యసన్నుతంబు,
హస్తద్వయము హల్లకారుణంబే, కాని
టంకవిరచిత కళంకయుతము,

ఆ.వె. అక్కజమ్ము సుమ్ము! అంగనామణి పోయి
అంగభవునిహరువు నపహసించు
నీ మనోహరాంగు డెటుదోఁచె నిచ్చోట
ననుచు వెనుకద్రొక్కె, వనజనేత్ర. 109

ఉ. చేజెడు కన్నులుం, గలువచేడియరాయని గేరు నాస్యమున్,
బారెడు పేరురమ్ము, నిడుపారెడు దళ్తళలీను కేశముల్,
ఊరువులంటు బాహువులు, నున్నదొ లేదొయనంబరంగు కౌన్,
బూరలఁబోలు జంఘలును, పొంజిగి గెల్చు మెఱుంగు దేహమున్. 110

కం. తనరఁగ, రాజీవాక్షుల
మనఃకురంగములఁ బట్టి మరుఁ డను మాయా
చణుఁ డడవిని బన్నిన వల
యనువున నున్నయతని మృదుహాసోన్ముఖునిన్. 111

ఉ. మేలిమికుందనంపు జిగిమేనిపయిం దెలతెల్లదోవతిం
దాలిచి మల్లికాపరివృతంబగు పుష్పితచంపకంబునుం
బోలినవాని, వారిజభవోజ్జ్వలఫాలమువాని, విశ్వక
ర్మాలఘులక్షణాన్వితమహారుచిరాంగము గల్గువానినిన్. 112

కం.తు. ఆ యటవికి శిల్పార్హము
లౌ యుపలంబుల వెదకఁగ నరుదెంచిన వానిన్,
గాయజు మించిన తారు
ణ్యాయతనంబగు మనోహరాంగము గలవానిన్. 113

ఉ. కాంచి విచంచలాక్షి కనుగల్వలు వక్త్రము నాక్రమింప, రా
గాంచితమైన మానసము నందుఁ జెలంగు తుఫానుచేతనో
సంచితరోమమై తనువు సంచలియింపఁగ, నుత్కటంబునౌ
వాంఛకుఁ బట్టు నద్దములవైఖరిఁ జన్నులుఁ బిక్కటిల్లఁగన్. 114

ఉ. 'వీని మనోహరాంగమును వేమఱు జూచినఁగాని లేదు లే
దీ నయనాలకుం దనివి; ఈతని హాసనుచంద్రికారుచిరిం
దానము లెన్ని చేసినను ధన్యతఁ బూనదు పూన దాత్మయున్,
వీని దృగంశుజాలముల వీఁగగఁజాలను జాల నింతయున్.' 115

తరలము. అతివ యీగతిఁ జింతసేయుచు నంబుజాస్త్రుని బాణసం
హతికి నోర్వక వాని నట్టులె యంబకంబులఁ గప్పెడిన్;
వితతమౌ త్రప నంతలోననె వీక్షణంబులఁ ద్రిప్పెడిన్,
వెతకికొంచును వెండి యాతని వేడ్కమీరఁగఁ జూచెడిన్. 116

తే.గీ. పవనచాలితనవపల్లవంబువోలె,
అంబుచాలితనవోత్పలంబువోలె,
మొదట రాగక్షుభితమైన ముగ్ధమనము
పరవశంబున స్తంభింపఁ బరఁగె నిపుడు. 117

కం. ఈవిధి నుత్కటభావజ
భావావిష్టయగు నా శుభాంగిని నాశ్చ
ర్యావిద్ధంబగు చూడ్కుల
నావిస్ఫుటితాస్యుఁ డగుచు నతఁడును జూచెన్. 118

ఉ. కమ్మని కుందనంపుబొడిఁ గల్పి మనోజ్ఞసుధారసంబుతో
నిమ్మహిఁ గల్గు సర్వరమణీమణికోటులకన్న మిన్నగన్
బమ్మ యొనర్చెనో యనఁగ భాసిలు సర్వసుశోభనాంగినిన్
సొమ్ములకే వినూత్నమగు సొమ్మయి యున్నటు లున్నదానినిఁ 119

నయాగరా వృత్తము: రాజీవాక్షినిఁ, బల్లవాధరను, రాకేందుబింబాననన్,
రాజప్రస్తరరమ్యగండతలరాజన్మణీకర్ణికన్,
రాజీవాంబకశాంబరీతులితరమ్యాంగశోభాయుతన్,
రాజీవాక్షుఁడు గాంచె లోలశఫరాలోకపర్వంబుగన్. 120

తే.గీ. కామినీమనోహరమూర్తిఁ గాంచి నపుడె
కామసామ్రాజ్యలక్ష్మి సాక్షాత్కరించె;
నంగనాతనురుచి నాతఁ డరసి నపుడె
కామకీర్తివాహినిలోన గాహమొందె. 121

ఉ. కన్నులు గల్వలై పరఁగఁ, గంజము వక్త్రము గాఁగ, దంతముల్
సన్ననిజాజులై తనరఁ, జక్కనిమోవి యశోకమై తగన్,
ప్రన్నని హాసముల్ సురుచిరాప్రసుమంబులు గాఁగ, దర్పకుం
డన్నశివేణిలో నయిదునమ్ములఁ గూర్చి హరించెఁ దద్ధృతిన్. 122

చం. అలకలపైని నూగి జలజానన ఫాలము నానఁబోవు, నిం
పలరెడు కర్ణికాచ్ఛవులయందునఁ దానములాడఁబోవు, స
ద్గళలసితాబ్జహారముల దారులఁ జారి పయంటలోని మె
ర్గులఁ గనఁబోవుఁ గౌతుకభరోత్కటముల్ యువకేక్షణావళుల్. 123

తే.గీ. చోద్యమంది యామె నతఁడు చూచుచుండె,
ఆమె యాతని నట్టులే యరయుచుండె;
వారి మధ్యనఁ గలయట్టి దూరమెల్ల
వారి మధ్యములటు కృశింపంగసాగె. 124

తే.గీ. ఆమె కనుచూపుదేఁటుల కయ్యె నతని
యక్షిజలజంబు లానందదాశ్రయములు;
అతని కనుచూపుదేఁటుల కయ్యె నామె
యక్షిజలజంబు లానందదాశ్రయములు. 125

కంతు. ఈవిధి సద్యోభవ రా
గావిష్టు లగుచుఁ, బరస్పరాలోకాంబుధిలో
వే వినిమజ్జితు లగుచుం
దావుందఱు లెరుఁగక యటఁ దత్తరుణులు నిలువన్. 126

కం. మల్లీ! మల్లీ! యనుచుం
గొల్లునఁ జెలులెల్లఁ దన్ను గూడఁగరాగన్
మల్లిక యచ్చోటుఁ దృటిలో
నొల్లకయుం దొఱఁగి వారి నొందఁగ నేఁగెన్. 127

ఆశ్వాసాంతము

విభావరి. వేలాపురీవాస! వేంకటేశస్వరూపా!
నీలాసతీనాథ! నీరజాతాయతాక్షా!
కాలాంబుదాభాంగ! కామిసంపూజితాంగా!
శైలోత్తమోద్ధార! సర్వలోకాధినాథా! 128

తరలము. కమలలోచన! క్రమభూషణ! కంసవారణ! సద్గుణా!
కుమతిశిక్షక! లోకరక్షక! కుంజరేశ్వరమోక్షకా!
అమరసేవిత! అర్థికీర్తిత! హంసపూజితవైభవా!
సమరభీషణ! భక్తతోషణ! చారుకౌస్తుభభూషణా! 129

తే.గీ. చెన్నకేశవ! సన్మునిహృన్నివాస!
శార్ఙ్గనందకకౌస్తుభచక్రధారి!
చారుబృందావనవనవిహారి! శౌరి!
శ్రీనివాస! మృదులహాస! చిద్విలాస! 130

కం.తు. ఇది వాణీవరదుఁడు, కృ
ష్ణదేశికాఖ్యుఁడు రచించు జక్కనకావ్యమునం
గుదురుగ విబుధప్రమద
ప్రదమై, నవమై, పరఁగును ప్రథమోల్లాసంబై. 131






కం. శ్రీ కరముగ మును దాలిచి
లోకవిమోహనకరమగు రూపము, నసురా
నీకము మోహిత మొనరిచి,
నాకౌకసులకె సుధ నిడు నటునిం గొలుతున్. 1

## సాయంకాలవర్ణనము

ఉ. అంత దినాంతమయ్యె; హరిదంతములందున సాంధ్యరాగముల్
దొంతరలౌచుఁ బర్వె; విగతోష్ణము లత్యనురాగవంతముల్
శాంతములౌచుఁ దోఁచె జలజాప్తునిదీప్తు; లనంతమందునన్
బంతులుగట్టి గూండ్లకయి పాఱఁగసాగె శకుంతసంతతుల్. 2

* తే.గీ. పావనంబగు గంగ నాప్లవము నందు
పరమహంసలీల నపరవార్ధియందు,
విష్ణుపదచారియును, తపోవిభవుఁ డైన
హంసుఁ డొక్కఁ డాప్లావంబు నందె నపుడు. 3

---

* పరమహంసలీల = ఉత్కృష్టమైన హంస, లేదా యోగీశ్వరుని వలె; విష్ణుపదచారి = అకాశమునందు చరించువాఁడు (వియ ద్విష్ణుపదం వా తు పుంస్యాకాశ విహాయసీ - అని అమరము), విష్ణుపదాసక్త చిత్తుఁడు; తపోవిభవుఁడు = తపస్సుయొక్క, వేఁడిమియొక్క అతిశయముగల వాఁడు; హంసుఁడు = సూర్యుఁడు (హంసో విహంగభేదే స్యా దర్కేవిష్ణౌ హయాన్తరే, యోగిభేదే మంత్రభేదే పరమాత్మని మత్సరే - అని విశ్వకోశము); ఆప్లావము = స్నానము, మునుక (సమే ఆప్లావ ఆప్లవః - అని అమరము).

తే.గీ. ప్రథమసందర్శనంబునఁ బ్రభవమైన
యౌవనాంగుల యత్యుత్కటానురాగ
మునకుఁ బట్టిన యద్దమో యనఁగఁ బర్వె
సాంధ్యరాగం బపు డపరాశాస్యమందు.

సీ. చిగురాకుచీరలో సింగార మొలికించు
నెలమావికొమ్మల చెలువుఁ బూని,
మధుమాససంపుల్లమంజుకింశుకవర్ణ
విరచితవరచిత్రవిధము నూని,
అనురాగవతులైన యతివల ముఖరాగ
మున కిడ్డ ముకురంపు ననువు మీరి,
క్రొత్తపెండిలికూతురు ముఖాబ్జమును గప్పు
నెఱకప్పు వైఖరి నెరయ నొనరి,

తే.గీ. గరిమఁ జైత్రోత్సవోత్సాహకలితు లగుచు,
అమరు లెల్ల వసంతంబులాడుచుండ,
నింగిపై నొలికిన యెఱరంగు భంగిఁ
బ్రబలె సాంధ్యరాగం బపరాశయందు. 5

* తే.గీ. రాజురాకకు ముందుగా రభసచేయు
పాదచారులవలె శ్వేతపాదరాజి
మొదటఁ దూరుపుదెసయందు నుదయమంది
క్రమముగా నన్యదిశలందుఁ గ్రమ్మికొనియె. 6

తే.గీ. అంతఁ బ్రాప్తాంతమైన యహ్నంబుయొక్క
పలితకేశచ్ఛవియొ యనఁ బరిణమించె,
మున్నుగా రాగరమ్యమై యున్న సంధ్య,
అంతకంతకుఁ దెల్లనై యాకసమున! 7

*. రాజు = రాజు, చంద్రుడు; శ్వేతపాదరాజి = తెల్లని కిరణముల వరుస.

* తే.గీ. అంతటన్ బట్టరానంత సంతసమున,
రాజురాకకు మున్నుగా రాజిఁగట్టి
అరుగుదెంచిన సన్నివహంబు లనఁగఁ
దారకావళి తోఁచె సత్పథమునందు. 8

## చంద్రోదయ, చంద్రికావర్ణనలు

చం. కువలయపోషకుం డగుచుఁ, గోమలకాంతిసురౌప్యమాలికా
ప్రవితరణంబుచేత జనవర్గముఁ దన్పుచు, జారచోరులం
బ్రవిభయమందఁ జేయుచును, భద్రముఁ గూర్చుచు నవ్యదంపతీ
ప్రవితతికిన్ క్షపాధిపతి ప్రాగ్గిరియందునఁ దోఁచె నంతటన్. 9

సీ. ప్రాగ్దిశాసుందరి భాస్వదలికముపైఁ
బెట్టిన కుంకుమబొట్టొ యనఁగ,
ఆకసంబను సుందరారామమందునం
బూచిన చెంగావిపూవొ యనఁగ,
వామనపాదంబు వ్యోమంబుఁ గప్పంగ
నందుఁ దోఁచిన శుభాబ్జాంక మనఁగ,
తాండవాలోలుఁడౌ చండీశు శీర్షంబు
నుండి జారిన రత్నఖండ మనఁగ,

తే.గీ. కాలఖనకుండు గగనంపుగనినిఁ దొలిచి
వెలికిఁ దీసిన మాణిక్యవలయ మనఁగ,
అమరు లమృతంబు దాఁచిన + యటిక యనఁగ,
అమృతదీధితి ఉదయాద్రియందుఁ బొల్చె. 10

* రాజు = రాజు, చంద్రుఁడు.; రాజి = వరుస (శ్రేణీ రేఖా స్తు రాజయః - అని అమరము); సన్నివహము = సజ్జనసమూహము, చుక్కల సమూహము; సత్పథము = నక్షత్రమార్గము (ఆకాశము), మంచిదారి (రాజమార్గము), (సత్యే సాధౌ విద్యమానే ప్రశస్తేఽభ్యర్హితే చ సత్, భవన్యాం తు సతీ స్త్రీస్యా న్నక్షత్ర తు నపుంసకమ్ - అని అమరము). + అటిక = వెడల్పు మూతిగల చిన్నకుండ.

తే.గీ. సుందరాంగుల సృజియించుచో విరించి
అమృతమయమైన మృత్తిక నపహరింప
నేర్పడిన కుహర మనఁగ నింపుమీరె,
నిందుబింబంబులో నొందు కందువపుడు. 11

తే.గీ. కొలిమిలోఁ బెట్టి కాల్చిన కుసుమశరుని
శస్త్ర మనిపించె విరహిణీసతుల కతఁడు,
తనదురక్తిని బింబించు దర్పణంబు
పగిది భాసించె స్వాధీనపతిక కతఁడు. 12

తే.గీ. మునుపు పొత్తిటికందువో యనఁగ మీరి,
అరుణుఁడైయున్న యామినీశ్వరుఁడు దోఁచె
నంతకంతకు విశదుఁడై, యర్భకుండు
పెరిగి జ్ఞానియై దీపించు విధము దోఁప. 13

తే.గీ. మున్ను క్షీరాబ్ధిజన్మంబుఁ గన్నకతన,
జగము నెల్లఁ బుట్టింటిగా సలుపఁబూని
శీతమును శ్వేతమునునైన యాతపంబు
పొంగువారించె విధుఁ డప్డు పుడమియందు. 14

సీ. ఆకుండలితకుసుమాస్త్రచాపోన్ముక్త
కుముదకాండప్రభాసముదయంబొ,
తామసీకామిని తనువుపైఁ దాల్చిన
మృదులంపు విశదంపు మేల్ముసుంగొ,
సౌమనసారామసంఫుల్లబహుపుష్ప
విగళితకింజల్కవృష్టిచయమొ,
సంవర్ధమానుఁడౌ సత్పుత్రుఁ గాంచి యు
ప్పొంగు క్షీరాబ్ధి తరంగతతియొ,

తే.గీ. తనయునిం గాంచి యుప్పొంగు ధవునిఁ గాంచి
పొంగి పొఱలెడు స్వర్ణదీభంగతతియొ,
యనఁగ మధురమై, మృదులమై, యద్భుతావ
హంబునై కౌముదీతతి యవనిఁ గప్పె. 15

ఉ. చల్లనివెన్నెలల్ సుధలఁ జల్లుచు నెల్లెడ నావరింప నా
చల్లని చంద్రికాతతులఁ జయ్యన గెల్వఁగనో యనంగఁ బల్
తెల్లదనంబుఁ దావియును దీయని యాసవముం ధరించి శో
భిల్లుచు మల్లెతీవియలు పెల్లుగఁ బూచె వనాంతరంబులన్. 16

* చం. తరళతరంగమాలికలతల్పమునం గుముదప్రతానినీ
సురుచిరవక్త్రబింబపరిచుంబనతత్పరుఁ డౌచుఁ, దన్మనో
హరముఖసౌరభంబుఁ దనువందునఁ దాల్చియు, దక్షిణుండునా
సరసములాడుచుం దిరిగె, స్పర్శనుఁ డన్యలతాళితోడుతన్. 17

ఉ. అప్పుడె విచ్చికొన్న నవహల్లకమాలలు వెట్టి కొప్పునన్,
గుప్పున మంచివాసనలు గుప్పెడు మల్లెలతావియత్తరున్
గొప్పగ మేనఁ బూసి , శశిఁ గూడెడి యామిని తార్చెనో తెరన్
చప్పున నన్నయట్లపుడు చంద్రు నొకానొక తెప్ప గప్పఁగాన్. 18

తే.గీ. చంద్రశాలలఁ బ్రియులతోసైత మున్న
సుందరాంగు లాదృశ్యమున్ జూచి చూచి,
తమక మిగురొత్తఁ, గాంతుల దరికిఁ జేరి,
చీరతెర లిడి, ప్రాప్తసంశ్లేష లైరి. 19

---

* కుముదప్రతానినీ = తెల్లకలువతీగ; లతా ప్రతానినీ వీరుత్ - అని అమరము; దక్షిణుఁడు = దక్షిణనాయకుఁడు (అనేకనాయికలయందు సమానముగాఁ బ్రవర్తించు నాయకుఁడు); స్పర్శనుఁడు = వాయువు; శ్వసనః స్పర్శనో వాయుః - అని అమరము.

## మల్లిక పూర్వదృష్టాఽజ్ఞాతపురుషుని గూర్చి యోచించుట

తరలము. అపుడు మల్లిక హర్మ్యమందున నంచటెక్కలపాన్పునన్
వపువునుం బడవైచి, బాధగవాక్షనిర్గతచంద్రికాం
శువులు స్నిగ్ధముఖంబుపైఁ బడి సుందరాత్మముఖేందుజాం
శువులఁ బోలఁగ, మున్ను గాంచిన సుందరాంగుని నెన్నుచున్. 20

చం. నికటమునందు నున్న ఘననిష్కుటమందున నున్న రమ్యదీ
ర్ఘిక నలరారుచున్న తొగటేకుల నూగిసలాడి, తత్సుగం
ధకలితశీతతాగుణము దాల్చుచు వీచుచు నున్న వాయువుల్
మొకమున వీచి, లో నెగడు పుష్పశరానలమున్ రగుల్పఁగాన్. 21

మ. కనువిందై వెలుగొందు నిందుఁడు వనిం గన్గొన్న యాసుందరున్
మనమందుం గనఁజేయఁ దత్స్మరణనిర్మగ్నాంతరాబ్జాతయై,
కనుదోయిన్ సగపాలు మోడ్చుచును, రాకామీలదబ్జాభయై,
కణతం జేయిడి, మల్లికాసతి యిటుల్ గావించె నాలోచనన్. 22

ఉ. ఎక్కడివాఁడో యాతఁడు రతీశుఁడు ధాత్రికి డిగ్గినట్లు దా
నక్కడ నుండె, నాపురుషు నారసి నప్పుడె వాని యాత్మలోఁ
జిక్కె మదీయమానసము; చేష్టలు దక్కెఁ; దదీయవక్షమం
దక్కును జేర్చి, సంతత మహా! పడియుండఁగఁ గల్గెఁ గోరికల్. 23

ద్వి.తు. పేరడుగనైతి, నే నూరడుగనైతి;
తోరంపువేడ్కతోఁ దోయజాస్త్రుండు,
నారసంబుల వ్రేయ నతశీర్ష నగుచు,
చోరదృష్టుల వానిఁ జూచితింగాని. 24

తే.గీ. చిత్రకారుని కుంచెల చెలువు నలరి
దీర్ఘములు, మృదులంబులై తేజరిల్లు
నతని యంగుళు, లాతని హస్తయుగళి
పూర్ణశతపత్త్రములఁ బోలి పొలుపుమీరు. 25

శా. శ్రీకారప్రతిమంబు, లాయతములై చెల్వొందు తత్కర్ణముల్
తాఁకందాఁకగఁ జాచు నున్నతములౌ తద్బాహుశీర్షంబులన్,
రాకాచంద్రమనోజ్ఞమౌ నతని వక్త్రంబందు నర్తించు న
స్తోకంబై, అనవద్యమై పరఁగు సద్యోబ్రహ్మతేజశ్ఛటల్. 26

తే.గీ. ఇట్టి సాముద్రికాంకంబు లెంచిచూడ,
తాల్చియున్నట్టి వేసంబుఁ దలఁచిచూడ,
అతఁడు శిల్పికుమారకుం డగు నటంచు
నిక్కముగఁ దోఁచు; నిందు సందియము లేదు. 27

ఉ. ఆదిమశిల్పి, సర్వసృజనైకకళాకుశలుండు, బ్రహ్మ, 'యీ
మాదిరి నుండగావలె సుమంజులశిల్పము' లంచు నొక్క స
మ్మోదరసైకమూర్తి మునుముందు సృజించె ననం దదంగ మా
మోదకరంబునై పరఁగు ముగ్ధలపాలిటి కల్పభూజమై. 28

తే.గీ. అతఁ డాదర్శమై యుండె నబ్జభవుఁడు
సృష్టియొనరింపఁగల చారుశిల్పతతికి;
అతఁడు సృజియింపఁగల శిల్పతతుల కెవ్వ
రౌదురో కదా! యాదర్శ మవనియందు. 29

మ. రసముల్ చిందెడు నాదు నాట్యముఁ గనన్ రాకుందురే యెందరో
రసికాగ్రేసరు లర్హసద్గుణఖనుల్ రమ్యాంగులౌ సుందరుల్;
వశమైపోయెనె నాదుమానసము నన్ వారెంత యర్థించినన్?
వశమైపోయెను నేఁడు దాని కదియే వానిన్ విలోకింపఁగన్. 30

ఉ. ఆతఁడు నన్నుసైతము మహాదరదృష్టులతోడఁ గప్పె, న
బ్జాతవిరోధిబింబమును సత్పరివేషము గప్పినట్లుగాన్,
ఆ తరళార్ద్రదృష్టులకు నర్థ మదేమొ? వినమ్రభావమో?
ప్రీతియొ? డెందమం దపుడె రెక్కొను నుత్కటరాగభావమో? 31

త్ర్యస్రగతి. వాని మోము హల్లకంబు పగిది నెఱ్ఱనయ్యె నపుడు,
మ్రానుపడియె దేహయష్టి మాటలేక సేతలేక,
కాని యంతలోన నూత్నకాంతి తోఁచె నాస్యమందు,
మీనులట్లు సంచలించి మెఱుపు లొలికె వానికనులు. 32

తే.గీ. ఇట్టి యనుభావముల నెల్లఁ బట్టిచూడ,
ఆతఁ డనురక్తుఁడేయని యాత్మఁ దోఁచు,
ఐన, నాతఁ డెక్కడివాఁడొ? అతని మఱల
నరయు భాగ్య మున్నదొ లేదొ? ఎఱుఁగ నైతి. 33

కం.తు. ఏవిధి నాతనిఁ జూతున్,
ఏవీటం జూతును, మఱి యేవాటిం జూతున్?
భావజుపోరును వీఁగెద
నేవిధమున నాతనియెడ నెదఁ జేర్పకయున్నన్.' 34

మ. అసితాబ్జేక్షణ యిట్లు చింతిలుచు, మున్నాకర్ణితంబైన యొ
క్క సమాచారము, ' గూళిదేవధరణీకాంతుండు క్రీడాపురీం
ద్ర సదేశోపవనంబునందు నొక నృత్యాగారనిర్మాణసం
ప్రసితుండై, నియమించె నొక్క యువశిల్పాచార్యు' నన్ దానినిన్. 35

తే.గీ. జ్ఞప్తికిం దెచ్చుకొని, నవ్యజనితమైన
యాశచే నేత్రయుగళంబు, నాననంబు,
ప్రత్యుషఃపరిఫుల్లపూర్ణాబ్జభాతి,
విచ్చుకొన నిట్లు దలపంగఁజొచ్చె నామె. 36

`తే.గీ. రూపమున ననంగునికీర్తి రూపుమాపు,
శిల్పమున విశ్వకర్మకు సిగ్గుఁగొల్పు,
గుణముచే శశాంకునిఁ గళంకునిగఁ జేయు,
ననఁగ విందుముగద! వాని గుణగణంబు. 37

ఉ. ఆ యువశిల్పియే యగునొ యవ్వనమందున నున్న యౌవన
శ్రీయుతమూర్తి? అట్లయిన తేపటిరాత్రిఁ దదీయదర్శన
శ్రీ యొనగూడు; వానికయి చేయఁగ సత్కృతి నాట్యశాలలో
శ్రీయుతులౌచు తేపెకద చేరుదు రార్యులు, గూళిదేవుఁడున్. 38

తే.గీ. విధివశంబున గురుపుత్త్ర విషయమందు
అనృతమాడిన ధర్మనందనుని పగిది,
ఒక్కకళ తక్కువైయుండె నుడువిభుండు;
అందుచేతఁ జతుర్దశి యయ్యె నేఁడు. 39

మ. పదిరెండౌ నెలలందుఁ జైత్రమతి సేవ్యంబౌచుఁ జెల్వొందుఁ, ద
న్మదసంవర్ధకచైత్రమందునను బెంపొందున్ సితార్ధంబు మో
హదమై, యందునఁ బౌర్ణమీరజని కళ్యాణైకసంధాయియై
హృదయాహ్లాదముఁ గూర్చు, నట్టి దివసం బేతెంచె రేపే కదా! 40

కం. రేపే చైత్రోత్సవమౌ,
రేపే క్రీడాపురజను లెల్లరు సొమ్ముల్
రాపాడఁగ గుములై విరి
తోఁపునఁ జైత్రుని గొలువఁగఁ దోతెంత్రు గదా! 41

కం. ఆ నవశిల్పివినిర్మిత
మైన వినూత్నమగు నాట్యమండప మా యు
ద్యానంబుననే యున్నది;
మానససరసిం గనకకమల మున్నటులన్. 42

ఉ. ఆ నవమండపంబున ననన్యసమానమనోజ్ఞనాట్యవి
ద్యానిపుణత్వ మేర్పడఁగ నాడఁగ నన్నుఁ బురాధినేత స
మ్మానముతోడఁ బిల్చెఁగద! మానుగ తే పటకేఁగి నృత్యసం
ధానకళాసుమంబులఁ దదాలయలక్ష్మికి నర్చసేసెదన్. 43

కం. ఆయుత్సవసమయంబున
నాయాలయశిల్పి కర్హమగు గౌరవమున్
జేయుట పరిపాటిగదా!
ఆయువశిల్పియుఁ దదర్థ మటనే యుండున్. 44

మ. అగునా ఆ యువశిల్పియే మునుపు నే నాతోఁటలోఁ గౌతుకం
బిగురొత్తం దిలకించినట్టి యువకుం, డీక్షింతునా యింక నా
తొగసింగారపుఁజూపువాని నట నృత్యోపాసనాధీననై,
'తొగరాయా! దయతోడఁ జూపఁగదె! తత్పూర్ణేందుబింబాననున్. 45

చం. జగముల నేలు మారునకుఁ జక్కని మామవు; చల్వవెల్గులం
జగములఁ జల్లి మ్రోడులను సైత మిగుర్పఁగఁజేతు వీవు; నీ
యగణితకాంతిపూరములయందలి శక్తి యదేమొ? దంపతుల్
వగలను మాని, సౌఖ్యరసవార్ధులఁ దేలుదురయ్య చంద్రమా! 46

తే.గీ. విరహిణులకెల్లఁ దీఱని వేఁడిఁగూర్చి,
ప్రియులకై ప్రతిక్షణము దపింపఁజేసి,
రాగబంధంబు సుదృఢంబు గాఁగఁజేసి,
కాపురంబుల నిల్పెదు కలువఱేడ! 47

ఉ. చల్లనిఱేడ! నీ కరుణఁ జల్లుము నాపయి, రేపుమాపు సం
ధిల్లెడు నుత్సవంబున సుదృష్టునిగా నొనరింపు మా సము
త్ఫుల్లసరోజనేత్రునిఁ, బ్రపూర్ణకళాతిమనోజ్ఞవక్త్రునిన్,
పల్లవితామ్రసాలనిభభాసురగాత్రుని, స్త్రీసుమాస్త్రునిన్.' 48

తరలము. అనుచు మల్లిక యబ్జవైరినిఁ బ్రార్థనం బొనరించుచున్
వనజబాణుని ధాటులందలి వంత నెట్లొ సహించుచున్
త్రిణయనార్పితచిత్తయైన గిరీంద్రపుత్త్రినిఁ బోలుచున్
కనులుమూసి పరుండఁ బాన్పునఁ గాంతునిన్ స్మరియించుచున్ 49

తే.గీ. కొంతసేపటి కామె సంక్షుభితమైన
యాత్మ విశ్రాంతమై తోఁచె; నక్షియుగళి
గురుత వహియించెఁ; గ్రమముగాఁ గూరు కొదవెఁ;
మీలితాబ్జినిఁబోలి యామె నిదురించె. 50

* * * * *

* తే.గీ. హర్మ్యమది గాదు! సామాన్యమైన గృహము;
చంద్రశాలలు లే వందుఁ, జక్కనైన
చెక్కడంబులు గల్గిన రెక్క లున్న
పెద్దకిటికీలగదు లున్న వింతె కాని! 51

ఉ. ఆగృహమందు నొక్క గదియందున సోరణగండ్లనుండి పు
న్నాగసుగంధయుక్తపవనంబులు మెల్లగ వీచుచుండఁగన్,
బాగుగఁ జంద్రికల్ సుధలవర్షము లీనుచుఁ బర్వుచుండ సు
శ్రీగుణసాంద్రుడైన యొకశిల్పికుమారకుఁ డుండి నిష్ఠతోన్. 52

ఉ. సుందరచంద్రికారుచులు సోఁకుచునుండగ మోముపైన, శ్రీ
చందనదారునిర్మితవిశాలతరంబగు పల్కమీద నా
నంద మెసంగ నొక్క వసనంబును నాఁటి రచించుచుండె నో
సుందరి వర్ణచిత్రమును చూడ్కుల కింపుగ నాతఁ డందునన్. 53

* హర్మ్యము = ధనికుల గృహము (హర్మ్యాది ర్ధనినాం వాసః - అని అమరము). రెక్కలు=తలుపులు;
చంద్రశాల = శిరోగృహము (చంద్రశాలా శిరోగృహమ్ - అని ఆమరము).

తే.గీ. అబ్జగర్భుండు చతురిమ నంత చేర్చి
అఖిలభువనైకసుందరియైన యొక్క
కామినీమణి నిర్మించు కరణిఁ దోఁప,
నతఁడు చిత్రింపఁగాఁ జొచ్చె నతివ నోర్తు. 54

తే.గీ. పూర్ణిమేందునిఁ బోలెడు ముఖము వ్రాసి,
మృదులబింబముఁ బోలెడు పెదవి వ్రాసి,
కలువపూవులఁ బోలెడు కనుల వ్రాసి,
కనకలతికను బోలెడు తనువు వ్రాసి, 55

తే.గీ. కంబువునుబోలు కమనీయకంఠమందుఁ
దరళమణిమౌక్తికంబుల సరులు వ్రాసి,
శ్రీల నుపమించు నాయింతి చెవులయందు
రమ్యమణిమయకర్ణపత్రముల వ్రాసి, 56

తే.గీ. సప్తవర్ణాన్వితసురేంద్రచాప మంచ
లమ్మ గాఁగఁ గించిదినకరాభిదీప్త
మగుచుఁ జెలువొందు జలదంబు పగిది వ్రాసి
ఉత్తరీయంబు నెత్తైన యురమునందు, 57

తే.గీ. అతిరయంబున నెత్తైన యద్రినుండి
క్రిందికిం దూఁకు సెలయేటి యందమైన
వేణిచందము బంగరుమేనునందు
మేల్మి జలతారుచీర నింపెసఁగ వ్రాసి, 58

తే.గీ. పంకజంబుల కెనయైన పాదములను
జిలుఁగుతీవల పాదరక్షలను వ్రాసి,
ఆస్యనయనంబులం దమితానురాగ
సముదితారుణతామనోజ్ఞతల వ్రాసి, 59

ఉ. ఆతఁడు సృష్టిచేసె భువనైకమనోహరమూర్తి, నొక్క రూ
పాతిశయప్రజిత్వరసురాబ్జముఖీజనకీర్తి, శంబరా
రాతినిశాతషష్ఠశరరమ్యసుకోమలగాత్రి, * నేత్రసం
జాతరసార్ద్రదృష్టిహృతసర్వయువవ్రజచిత్తలోప్త్రినిన్. 60

తే.గీ. ఆతఁ డెవ్వఁడో కాఁడు, మున్నా వనంబు
నందు సందృష్టుఁడైనట్టి సుందరుండె.
అతఁడు చిత్రించుచుండెఁ దా నందుఁ జూచి
నట్టి సుందరీసుమనోహరాంగకమునె. 61

ఉ. ఆ చెలి నట్లు చిత్తరువునందున నిల్పి యతండు ముగ్ధుఁడై
చూచును జూచుఁజూచు, నటు సూచుచు నీ యతిలోకమంజిమం
బీ చెలియందు నేయటుల మేకొనెనో యని యెంచు, నెంచి ముం
దా చెలిఁ జూచు భాగ్యమది యబ్బునొ లేదొ యటంచుఁ జింతిలున్. 62

కం. ఏకాంతంబున వనమం
దా కాంతను గాంచినపుడె యమితవ్రీడా
మూకీకృతుండ నైతిని;
వాకొనకుంటిని యొకింత వనితామణితోన్. 63

కం. ధరపై మెట్టిన యూర్వశి
కరణిన్ వరహావభావకలితేక్షణవా
గురలం బన్ని మదీక్షణ
వరఖంజనతతి కది వెస బంధముఁ గూర్చెన్. 64

* నేత్ర = కనులవలన (నుండి), సంజాత = పుట్టిన, రసార్ద్రదృష్టి = (శృంగార) రసముచే తడిసిన చూపుల చేత, హృత = హరింపబడిన, సర్వ = అన్ని, యువ = యువకులయొక్క, వ్రజ = సంఘముల యొక్క, చిత్త = మానసము లనెడు, లోప్త్రినిన్ = దొంగిలింపబడిన సొమ్ముగలదానిని - చౌరికాస్తైన్యచౌరే చ స్తేయం, లోప్త్రంతు తద్ధనమ్ - అని అమరము.

ఉ. అచ్చపలాక్షి యెవ్వతెయొ యాఖ్య నెరుంగను గాని, యాత్మయం
దచ్చువడెం దృఢంబుగఁ దదాకృతియే; కనుదమ్ము లామెకై
నిచ్చలు దారుల న్వెదకు; నిర్భరతత్పరిరంభణంబులోఁ
జెచ్చెర లీనమై తనువు సేరఁగఁ గోరును సౌఖ్యసీమలన్. 65

చం. సరసపునాట్యశిల్పముల సంసృజియించెడు వేళ నెందఱో
సరసిజలోచనల్ నటన సల్పరె సమ్ముఖమందు? చిత్త మా
తరుణులకై చలించెనె? తదబ్జముఖిం దరిసించినట్టి యా
తరుణమునుండి నామనము తద్వశమయ్యె నిదేమి చిత్రమో! 66

* తే.గీ. ఆకుఁదొడుగని మ్రాఁకు లే దవనియందు
చైత్రమం, దైనఁ జూతకిసాల మొకటె
పథ్యమై యుండు పరభృతప్రతతి కందు,
ప్రకృతిధర్మ మీ చందము పరఁగుచుండు! 67

తే.గీ. అటుల నా యింతియం దమితానురాగ
చింత గల్గుట నా దైవచేష్టితముగ
నెంతు, నెంతు నిష్ఠాదవు నితాంతవిప్ర
యోగదశను సైతము దైవయోగముగనె! 68

మత్తకోకిల. ఓయి చంద్రమ! ఓయి మాధవ! ఓయి మన్మథ! మీకునై
దోయిలిం ఘటియించుచుంటిని, తోయజాక్షినిఁ జూపరే!
ఏ యువాంగన వీక్షణంబుల నీ యువాత్మ సుమించెనో
ఆ యువాంగన నింకఁ జూచెడునట్టి భాగ్యముఁ గూర్పరే!` 69

తరలము. అనుచు నాయువశిల్పి దైవమునందె భారము వైచుచున్
వనజనేత్రనె సంతతంబుగ భావమందున నిల్పుచున్
వనజవైరిమరీచి నోర్వక పాన్పునం బడియుండఁగన్
క్షణద మాసి క్రమంబుగా దివసంబు దోఁచెను తూర్పునన్. 70

* చూతకిసాలము = మామిడిచిగురు - కిసాలయంకిసలయంకిసాలంకిసలంకిసమ్ - అని బహుళరూపపద కోశము; పరభృతప్రతతి = కోకిలల సమూహము.

## ప్రాతఃకాలవర్ణనము

తే.గీ. కలువకన్నెకుఁ దనకును గలుగఁబోవు
కష్టమగు నెడబాటుకుం గలఁగుచున్న
కలువరాయని శోకమగ్నాననంబు
విస్తృతంబు, తామ్రంబునై వెలిగె నపుడు. 71

సీ. పాలసంద్రంబులోఁ దేలియాడుచునున్న
ఫేనఖండంబుల విధము నూని,
తెల్లనౌపాన్పుపైఁ జల్లియుంచినయట్టి
బొండుమల్లెలపిండు పోలుపుఁ బూని,
వెండిపళ్లెరమందు విరళంబుగాఁ జిలి
కిన తండులంబుల యనువుఁ దాల్చి,
అవదాతశాటిపై నందందుఁ గుట్టిన
మంచిముత్తెంబుల మాద్రిఁ బొల్చి,

తే.గీ. అంతకంతకుఁ బాండురకాంతితోడఁ
బరఁగు గగనంబుకంటె వేఱ్ఱుఱుపరాక
నిష్ప్రభములయ్యెఁ దారకానివహ మపుడు,
స్వర్ణదీమగ్నవిశదాబ్జభాతి నొనరి. 72

మ. కమలామోదము సంఘటించుచు, జగత్కల్యాణముం గూర్చుచున్,
కమనీయంబయి, జంతుసంతతికి సౌఖ్యాపాదకంబై, సుభ
ద్రమునై పొల్చు కరప్రసారమునఁ జైతన్యంబు సృష్టించుచున్
విమలుండై యుదయించె సూర్యుఁడు మహావిష్వంశతోఁ దూర్పునన్.

తే.గీ. అధికకాలము కన్నుల కంటకుండ
దేశ మేఁగిన నాథుండు తిరిగిరాగ,
హర్షపూర్ణాస్యయైన యిల్లాలువోలె
పద్మినీకాంత విస్ఫుటాబ్జాస్య యయ్యె. 74

తే.గీ. * తిరిగివచ్చిన యినునికై త్వరితగతిని
పద్మిని భువనభవనకవాటములను
తెఱవఁగా నొదవిన క్రీంక్రవిరుతరీతి
దిక్కులను ద్విజరావముల్ పిక్కటిల్లె. 75

తే.గీ. అంబుజాప్తుని గాంచిన యాక్షణంబ,
కమలినీనేత్రములనుండి కారుచున్న
హర్షబాష్పపృషంతులో యనఁగ నొప్పె
తుహినబిందువు లాకుల తుదలయందు. 76

తే.గీ. వెండివెల్గుల లంకెల వేసి యిలకు
అనిలధుతమగుచున్న యబ్జాకరమునె
పీటగా నొనరించి + కృపీటజాప్తుఁ
డూయెలంగట్టి పద్మిని నూపె నపుడు. 77

తే.గీ. స్వచ్ఛహిమబిందుచయమందు స్నానమాడి,
ఫుల్లపంకేజమకరందభోజ్యచయము,
పద్మసౌరభ్యగంధిలవస్తుచయముఁ,
గూర్చుకొని హరిని సమీరుఁ డర్చచేసె. 78

ఉ. తోఁటలలోని మ్రాఁకులకుఁ దోయముఁ గట్టెడివారు గొందఱున్,
బాటల నాలమందలను బాడుచుఁ దోలెడివారు గొందఱున్,
నీటుగఁ దానమాడి హరినిన్ భజియించెడివారు గొందఱున్,
బోటులకౌఁగిటం దవిలి బోధమునందనివారు గొందఱున్,
బోటులు వీణెపైఁ బలుక బోధమునందెడివారు గొందఱున్,
చేటులతోడ వల్లభుల చేష్టలు వాకొనువారు గొందఱున్, 79

* ఇనుఁడు = భర్త, సూర్యుఁడు (ఇన స్సూర్యే నృపే పత్యౌ - అని విశ్వకోశము); పద్మిని = పద్మినీజాతిస్త్రీ (భర్తపరముగ), పద్మలత (సూర్యపరముగ), భువనభవనకవాటములు = లోకమను భవనముయొక్క తలుపులు; క్రీంక్రవిరుతులు = తలుపులు తీయు నప్పుడు గల్గు క్రీంక్రాయను చప్పుడులు; ద్విజరావములు = పక్షుల యఱపులు; + కృపీటజాప్తుఁడు = నీరజాప్తుఁడు = సూర్యుఁడు.

కం. ఈరీతిన్ బహుళవ్యా
పారాంచితులైరి తత్ప్రభాతమునందున్
పౌరులు, క్రీడాపురమను
నూరికి రవణంబు లగుచు నొప్పెడివారల్. 80

కం. అది చైత్రంబగుటను, నా
సుదినంబుననే విధుండు షోడశకళ లిం
పొదవఁగ ధరించి యుండుట
నదియే చైత్రోత్సవదిన మయ్యెం బ్రజకున్. 81

నాగరుల చైత్రోత్సవదినచర్యలు

ఉ. ఆ దివసంబునందు వనజాయతనేత్రలు మందిరంబులన్
మోదముతోడ నల్కి, తెలిమ్రుగ్గుల నెల్లెడఁ బెట్టి, పల్లవా
పాదితతోరణంబులను జక్కగ ద్వారములందుఁ గట్టి, దీ
పాదులచే నపూర్వముగఁ బ్రాంగణసీమ లలంకరించియున్. 82

చం. ఉదయమునందె తాము నుబ్రియుల్ సనుతంబుగ మాధవస్తవం
బెదఁ దలపోయుచున్ నిదుర మేల్కొని, తైలయుతావగాహదీ
వ్యదమలకాంచనాంగులయి, భవ్యవిభూషణవస్త్రవేషులై,
ముదితలు నాథులం గలిసి పూజలుసేతురు చైత్రుకోసమై. 83

కం. మోదుగుపూవులఁ బేర్చి కృ
శోదరలు సృజించి మాధవోజ్జ్వలమూర్తిన్
మోదంబున బాంధవమి
త్రాదులతోఁ బూజసేతు రతితరభక్తిన్. 84

కం. ఆదరమున మాధవుని ప్ర
సాదంబును స్వీకరించి, సరసోదనమున్
ఖాదనమొనర్చి, తాంబూ
లాదులఁ జర్వణమొనర్చి, యటుపై వేడ్కన్. 85

[1] తరలము. వెదురుగొట్టములందు నింపుచు వింతరంగుల నీరమున్
ముదిత లా జలమందుఁ గాంతుల మోముదమ్ముల ముంచఁగాన్,
అదటునం బ్రియు లా లతాంగుల యాస్యచంద్రుల స్వీయమౌ
వెదురుగొట్టపునీటివెల్లువ వెంట ముంతురు గ్రక్కునన్. 86

తే.గీ. బుక్కయును గుంకుమం బింకఁ బెక్కురంగు
పొడుల నొండురులపయినఁ బోసికొంచు
వివిధవర్ణసుమంబుల వేడ్కఁగొల్పు
[2] వీరుధంబులఁ దలపింత్రు వార లపుడు. 87

కం. ఈవిధి నెంతో కాలము
భావజమిత్రోత్సవపరభావనులై నా
నావర్ణరసాప్లవలీ
లావహులై చెలఁగి వార లటుపై వేడ్కన్. 88

కం. మలినములగు తనులను గం
ధిలమగు సలిలంబులందు నీరాడుటచేఁ
బులుగడిగిన ముత్తెపుఁ బే
రులయటు లొనరించి, తాల్చి రుచిరాంబరముల్. 89

1. కవిసమయప్రసిద్ధమగు చంద్రపద్మవైరముచే ముందుగా చంద్రునివంటి ముఖములు గల స్త్రీలు పురుషుల ముఖపద్మములను బాధింపగా పురుషు లా స్త్రీల ముఖచంద్రులను తిరిగి బాధించిరని ఇచట ధ్వని.
2. వీరుధము = తీఁగపొద - లతా ప్రతానినీ వీరుధ్ (త్) గుల్మి న్యులప ఇత్యపి - అని అమరము.

కం. సమలంకృతులై, సంధ్యా
సమయమునందున వసంతసంస్తుతిపరులై
ప్రమదంబున నగరోద్యా
నమునం గుములై పొలుతురు నాగరు లెల్లన్. 90

కం. ఆ యుద్యానమునందున
శ్రీయుతముగ నా పురపతి సేయు[1] మహంబున్
బాయక చూడఁగ నొడలికి
వేయగు కనులను ధరించి వేతురు వారల్. 91

నృత్యాలయవర్ణనము

కం. బృందారకసభ కెనయౌ
సుందరనృత్యాలయంబు శోభిలు నందున్,
డెందము ద్రవించు నెంతటి
మందున కైనను దదీయమంజిమఁ గనఁగన్. 92

తే.గీ. నాకనదియందు నింపొందు నళినమట్లు
ఆ వనంబునఁ బొల్చు నా యాలయంబు,
అంబుజాంతరస్థిత[2] వరాటంబురీతి
అందమగు నందు నొక్క నృత్యాంగణంబు. 93

తే.గీ. ఇరుగెడలయందు నత్యంతహృద్యమైన
భంగిమల నూని కించిన్నతాంగు లగుచు
పూవులం జల్లు జవరాండ్ర మూర్తులున్న
ఉన్నతములైన స్తంభంబు లున్నవందు. 94

1 మహంబు = ఉత్సవము (మహ ఉద్ధవ ఉత్సవః - అని అమరము); 2. వరాటము = బీజకోశము, కమలపుదుద్దు (బీజకోశో వరాట స్యాత్ - అని అమరము).

తే.గీ. అగ్రభాగంబు నందున్నయట్టి స్తంభ
యుగ్మకమునుండి తెరచీర యొకటి వ్రేలు.
పిహితమొనరించు నయ్యది వెనుక నున్న
విస్తృతంబగు నెలఱాతి వేది నెల్ల. 95

ఉ. ఆ తెలిరాతివేదికకు నంచులయందున నల్లరాతిచే
బ్రాతిగఁ జెక్కఁబడ్డ సుమవల్లిక లొప్పును; మధ్యమందు నె
న్నో తరహాల రత్నముల నూన్చి రచించిన పెద్దదైన య
బ్జాతము వొల్చు; పృష్ఠమున భాసిలు వర్ణపటంబు లింపుగన్. 96

కం. ఆ వేదికకడ సుకళా
శ్రీ విలసితమైన యొక్క గృహ మింపారున్,
ఆ వేశ్మమునుండియె నా
నావేషంబులు ధరించి నటకులు వత్తుర్. 97

మ. అది క్రొంగ్రొత్తగ గూళిదేవధరణీశాదిష్టుఁడైనట్టి, యి
ర్వదియారేండ్లును నిండకుండగనె శిల్పాచార్యుఁడైనట్టి, సం
విదితఖ్యాతుఁడు నైనయట్టి, యొక శిల్పిశ్రేష్ఠుఁ డా తోఁటలో
హృదయాహ్లాదిగ సంసృజించినది; లే దేతాదృశం బెందునన్. 98

## పూర్వరంగవర్ణనము

ఉ. అప్పుడె యెల్లదిక్కులను నంచితనిర్మలచంద్రికారుచుల్
గప్పుచుఁ బూర్ణచంద్రుఁడు వికాసము నొందెఁ, దదీయకాంతిలో
నప్పురవాటిలోని నటనాలయ మొప్పెను దాండవేశు కిం
పొప్పెడు రంగమై తనరు నుజ్జ్వలరాజతశైలమో యనన్. 99

కం. ఆ వెన్నెలకుం దోడుగ
వేవిధముల దీవియలను వెలిగించి రటన్,
ఆ వేశ్మం బటు లతిశో
భావహమై పోలెను సురవల్లభుసభనే. 100

తే.గీ. ద్విజులతోఁగూడి తన్నాట్యవేశ్మమందు
నాట్యశాస్త్రోక్తముగ నేడునాళు లుండి
నృత్యగురు వొక్కఁ డానాఁడు ప్రత్యుషస్సు
నుండి విహితహోమాదుల నొనరఁ జేసి. 101

ఆ.వె. నాటి సంజవేళ నాట్యరంగమునెల్ల
నర్చనేసి, యాతఁ డాటవెలఁదు
లందు మిన్నయైన యాటకత్తె నొకతె
నట్టువాడఁ బనిచెఁ దొట్టతొలిగ. 102

ద్వి.తు. ఆ నృత్యముం జూడ సామాత్యుఁ డగుచు
నా నగరినేతతో నానేల నేలు
గూళిదేవనృపుండు గూర్చుండె ముందు
ఆలోలనేత్రుఁడై అతివైభవమున. 103

ఖండగతి. ఆ వెన్కఁ గూర్చుండి రధికారు లెల్లరున్,
శ్రీవిభవులై పొల్చు చిత్రకారులుఁ, గవులు;
అవ్వారి వెనువెన్క నాసీనులైయుండి
రవ్వీటిజను లుత్సవాలోకనోత్సుకుల్. 104

కం. ఆ చిత్రకారులందున
నో చిత్తభవున కెనయగు యువకుం డుండెన్,
ఆ చిఱుతఁడె శిల్పకళా
వైచిత్ర్యంబునఁ దదీయ భవనముఁ గట్టెన్. 105

తే.గీ. నభమునందునఁ బూర్ణుఁడై ప్రభలఁ జల్లు
కైరవాప్తుండు నృత్యంబుఁ గాంచుకొఱకు
సభకు దిగివచ్చెనో యను సరణిఁ దోఁచె
సభ్యులందున నా శిల్పిసత్తముండు. 106

నాట్యవర్ణనము

తే.గీ. అంతకంతకు యవనికాభ్యంతరమ్ము
నుండి జనియించి వనినెల్ల నిండుకొనియె,
అంబుభృజ్జాతహృద్యారవంబు లట్లు
వేణువీణామృదంగనిస్వానతతులు. 107

ఖండగతి. అమరనాథునిసభకు నడ్డంబుగానున్న
వార్షుకాభ్రిమువోలె వ్యాపించి ముందున్న
జవనికాశ్రేష్ఠంబు జారిపోయినదంత,
మెఱసినది వేదిపై మెఱుపువలె నొకకాంత. 108

సీ. నీలసర్పముఁబోలు నిడుదంపువేనలి
అలనల్లఁ బిరుదుపై నాడుచుండ,
కమ్మకస్తురి తిలకంబు ఫాలమునందు
నెలలోని మచ్చయ ట్లలరుచుండ,
స్రక్చందనార్చిత శౌరిశంఖమురీతి
హారాంచితగ్రీవ మమరుచుండ,
గాలికిం గదలాడు క్రమవల్లరులట్లు
మృదువుగా బాహువుల్ గదలుచుండ,
పైకిఁ జెక్కిన వల్లెవాటు సందుననుండి
పాలిండ్లు బొంగుచుం దేలుచుండ,
పవమానవిధుతరంభాకాండముల రీతి
చలదూరువులు సొంపులొలుకుచుండ,

తే.గీ. పసుపుపారాణు లలఁదిన పాదయుగళి
కదలుచో ఘల్లుఘల్లంచు గజ్జె లాడ,
అలలకైవడి హస్తంబు లాడుచుండ,
నాట్యవేదికఁ బొల్చెను నటి యొకర్తె. 109

కం.తు. విప్పారిన వదనముతో,
విప్పారెడు గన్నులతుద విరిసిన చూపులతో
నప్పడఁతుక, మోదముతో
విప్పారఁగఁజేసె నపుడె ప్రేక్షకవదనములన్. 110

తే.గీ. అవని నిల్చిన రంభయో యనఁగ మీరి
యందు నిల్చిన యా యింతి యన్య గాదు;
ముందు మల్లికయను పేరఁ బుష్పవాటి
యందు దర్శితమైన కన్యకయె కాని! 111

చం. [1] తొలుత గజాననస్తవముతోడ నుపక్రమణంబు చేసి, పైఁ
జలితసుపల్లవాంగుళుల స్వస్తికపుష్పపుటాదిహస్తముల్
లలితముగా ఘటించి, యతిరమ్యములౌ కరణాంగహారముల్
వెలయఁగఁజేసి, యీశునకుఁ బ్రీతి సుమాంజలి సంఘటించియున్. 112

తే.గీ. పార్శ్వముల వేణువీణాదివాద్యతతులు
తాళయుతముగ మ్రోగుచు దరువులేయ,
నృత్తరీతులఁ జూపి లోకోత్తరముగఁ,
బార్వతిం గూర్చి యీరీతిఁ బాడఁదొడఁగె. 113

1. ఏకకాలమున హస్తపాదములను సవిలాసముగా, సమన్వయపూర్వకముగా గదలించుటకు గరణమని పేరు. ఇట్టి వివిధకరణముల సమాహారమే అంగహారము. స్వస్తికము, పుష్పపుటము అనునవి నృత్యము నందలి ప్రసిద్ధహస్తాభినయములు. వివరములకు భరతుని నాట్యశాస్త్రమును చూచునది.

శిఖరిణి. ' [1] శివే శృంగారార్ద్రా, తదితరజనే కుత్సనపరా,
సరోషా గంగాయాం, గిరిశనయనే విస్మయవతీ,
హరాహిభ్యో భీతా, సరసిరుహ సౌభాగ్యదాయినీ,
సఖీషు స్మేరా, తే మయి జనని! దృష్టిస్సకరుణా! ' 114
(శ్రీశంకరాచార్యకృత సౌందర్యలహరి నుండి)

ఖండగతి. ఈరీతిఁ బాడుచుం
జేరువన్ వాద్యముల్ శృంగారవీరాది
చారురసచారులై
తోరముగ మ్రోగంగఁ [2] దొగకంటి యంతటన్. 115

సీ. [3] మన్మథావిష్టమౌ మంజులాపాంగదృ
గ్రచనచే శృంగారరసముఁ జిలికి,
వ్యాకుంచితాపాంగపక్ష్మయై, వ్యాకుల
త్తారయై, భీభత్స మారఁజూపి,
కుటిలంపు భ్రువులతో, క్రూరంపు జూపుతో,
రక్తాక్షియై రౌద్రరసముఁ జిమ్మి,
కొంతగా ముడిచి పక్ష్మాంతముల్, బొమలెత్తి,
తరళదృష్టుల నద్భుతంబుఁ జూపి,
విప్పారుఱెప్పలున్, వెలుఁగు తారకలొప్పఁ,
జకితదృష్టుల భయానకముఁ జూపి,
విచ్చుకన్నుల మధ్య వెలయఁ దారకలు, గం
భీరదృష్టులఁ జూచి వీర మొలికి,

1. ఈ శ్లోకములో అష్టరసాత్మక మైన జగజ్జనని (పార్వతి) చూపు వర్ణితమైనది. దీని నర్తనము నర్తకి నాట్యవైదుష్యమునకు నికషోపలము వంటిది. 2. ముందు వర్ణింపబడు రసాభినయము నేత్రప్రధాన మగుటచే ఇచట తొగకంటి (= కలువకంటి) యను పదము సార్థకము.

3. ఈ పద్యమున శ్లోకార్థము నభినయించుచున్న మల్లికానృత్య మందలి రసదృష్టులు భరతనాట్య శాస్త్రోక్తముగ వర్ణింపఁబడినవి. శివునికి తాండవము (ఉద్ధతనృత్యము), శివకు లాస్యము (లలితనృత్యము) ప్రీతికరము లగుటచే నామె పై శ్లోకమునకు లాస్యమునే చేసెను.

తార లించుకఁ దోఁపఁ దరచుగా మూసి తె
　　　రచుచు ఱెప్పలు హాస్యరసము నొల్కఁ,
అర్ధమీలితములై సార్ధ్రతారకములై
　　　కదలని చూడ్కులఁ గరుణఁ జూపి,

తే.గీ. దృష్టుల కనుగుణంబుగా దేహలతను
సరసముగఁ ద్రిప్పి యామె లాస్యంబు చేసె;
దాని కా తోఁటలో నున్న స్థాణువులును
సపదిసంజాతపల్లవస్థాను లయ్యె. 116

ఖండగతి. అతులచైతన్యవిలసితమైన యట్టి
చేష్టితంబుల నామె యష్టరసములఁ జిల్కఁ;
నిశ్చేష్టులై చూచు నిష్కుటాంతస్థి
తజనంబు లుప్పొంగి తన్మయు లగుచుఁ గుల్కఁ. 117

ఉ. అందున గూళిదేవవసుధాధిపుఁ డా యువనర్తకీమణీ
సుందరరూపమున్ మిగులఁ జొక్కుచుఁ గాంచును; కాంచి దీని నే
చందము నొందఁగాంతుఁ, గని సౌఖ్యరసాంబుధి నొందఁ గాంతు, నా
యందున దీని కెట్లు నెన రబ్బఁగఁ గాంతు నటంచుఁ జింతిలున్. 118

ఉ. ఆ యువనర్తకీమణిని ఆ వనమందునఁ గన్నదానిఁగాన్
ఆ యువశిల్పిలోకవిధుఁ డాత్మ నెఱింగి మనంబు తొట్రిలన్
కాయము నిండఁ బుల్కల నికాయముఁ బూనును; స్వేదబిందుసం
వ్యాయతమై చెలంగఁ దను వాపయి వేపథు వూనుఁ జయ్యనన్. 119

ఉ. 'ఎంతటి భాగ్యమో మఱల నీక్షణసేయగఁ గంటి మున్నయ
స్కాంతమువోలె నా మనసు సంగ్రహియించి యదృశ్యయైన యా
కంతునికాంతఁబోలు లతికాంతసుగాత్రిని, దీని నాట్య మిం
తింతనరాని హాయిఁ గలిగించుచు నన్నతిముగ్ధుఁ జేసెడిన్. 120

కం. బంగరునకుఁ దావింబలె
సింగారము గూర్చుచున్న శృంగారరసా
పాంగేక్షణములఁ దగు నీ
యంగన లాస్యాంగము దగు నతిసుఖదంబై 121

ఆ.వె. అనుచు గూళిదేవుఁ, డాయువశిల్పియున్
డెందమందు నందమొందుచుండ
ఆమె యాడఁ దొడఁగె నధ్యక్షుఁ డైనట్టి
గూళిదేవుఁ గూర్చి గొండ్లి నిటుల. 122

జక్కిణి దరువు

జంజం తరికిటతా తరిత తరిత దణ
దణ జణు కిణతక కిణత కిణత తరి
కిటతక జంతరితా తకుంద కిణకు కిణ
కిణత కిణత దరిత దరిత
తదణత దణజణు తాహాంతజంతా
తహత జాంత తత్తళాంగ్ తక దికితక
తదిగిణతోం తత్తళాంగ్ తదిగిణతోం.

గూళిదేవ మహరాజ రే
కేళిలోల నరపాలరే
మేలు గలుగు గాత నీకు శ్రీ
గూళిదేవరసికరాజచంద్ర.

తారిత్తిరి జంతరి కిటతక
తత్తాళాంగ్ తక తరిత దణత
జణుత కిటత
తత్తతళాంగ్ జాంకిటతక
తరికిటతక తత్త తళాంగ్ తక తదిగిణతోం ॥ 123

పరభృతము. అనుచు జక్కిణి నాలపించుచు, ననుగుణంబుగ వాద్యముల్
ఘనముగా నినదించుచుండగఁ గలికి నృత్తము, నృత్యమున్,
కనకరత్నము లేర్చికూర్చిన కరణి మేళనసేయుచున్
కనులపండువుసేయఁ బ్రేక్షకగణము లెంతయొ ప్రీతితోన్. 124

కం. ' అబ్బా! యింతటి నాట్యం
బబ్బదు మున్నెపుడు మాకు నవలోకింపన్,
దబ్బఱసేయును మేనక
యుబ్బును నీ కాంతనటన మొక హస్తమునన్. ' 125

తే.గీ. అనుచు హర్షము మిన్నంట నంబరంబు
దద్దరిలునట్లు హర్షనాదం బొనర్ప,
వారికన్నను మిన్నగ వనితయందు
ఇష్టుఁడై యున్న గూళిదేవేశ్వరుండు. 126

మ. శ్రుతిపర్వంబుగఁ గేళిలోలుఁ డనుచున్ స్తోత్రంబుఁ గావించు చ
ప్రతిమానంబుగ నాట్యమాడు వనితారమ్యాంగవిన్యాసముల్
మతి నున్మత్తముసేయఁ దక్షణమె తన్మత్తాక్షిఁ గ్రోడంబునం
దతిగాఢంబుగఁ గ్రుచ్చనెంచు, నధరం బానంగ నెంచున్ మదిన్. 127

ఉ. ఆ యువశిల్పివర్యుఁడు తదంగనలాస్యవిలాస మాత్మకుం
దీయని తేనెవోలెఁ గడు దీయముఁ గూర్పఁగ, వార్ధివీచులం
దూయలలూఁగు కైరవహితోజ్జ్వలబింబమువోలె సౌఖ్యవీచులం
గాయమునెల్ల ముంచు, పులకల్ వహియించును నుత్కటంబుగన్128

తే.గీ. అంబరంబును గప్పెడు నభ్రమటుల
నంతలో యవనిక వేది నావరించె;
తొలఁగె నర్తకి నేపథ్యనిలయమునకు,
కమలగృహమును జొచ్చెడు కమలవోలె. 129

తే.గీ. మొదటినుండియు నత్యంతమోహవివశు꠶
డగుచు ఱెప్పలార్పక యామె నరయుచున్న
గూళిదేవరాజుకు꠶ బెద్దగోడయట్లు
కర్కశంబుగ꠶ దో꠶చెను కాండపటము. 130

తే.గీ. యవనికాచ్ఛాదిత యయిన యవ్వరాంగి
తో꠶చె నా యువశిల్పిచంద్రునకు నపుడు
జలదముఖమున మిఱుమిట్లుగొలుపు మెఱుపు
జలదగర్భము జొచ్చిన చందమునగను. 131

తే.గీ. యవనికాభ్యంతరమునుండి యంతలోన
రమ్యతరముగ మోహనరాగమందు
క్రమశృంగారరసవర్ధకంబు లైన
వివిధవాద్యనిస్వానముల్ వెడలసాగె. 132

తే.గీ. రంగమందున ప్రాదినీభంగతతులు
గలుగు దృశ్యంబు లింపుగ꠶ గట్ట꠶బడియె;
అలలప్రక్కన꠶ గుంజంబు లందునందు
గున్న యేను꠶గులట్టుల꠶ గూర్ప꠶బడియె. 133

కం.తు. తొల꠶గెన్ యవనిక యటుపై
వెలి꠶గెన్ మల్లిక వినూత్న వేషాలంకృతయై,
తెలివెన్నెలలో యమునాం
చలమున కేతెంచిన యభిసారిక రాధికయై. 134

తే.గీ. ఆమెనుం గన సభ్యుల యాననములు
వెలిగె వెన్నెలతో వేయి విధులయట్లు;
తాముసైతము గృష్ణులై తటిని చెంత
నుండనెంచిరి వార లత్యుత్సుకమున. 135

ఖండగతి. ఘల్లుఘల్లునఁ బాదకమలములు గదలాడ
అల్లనల్లన సన్నయవలగ్న మసియాడ
ఫుల్లదృష్టులతోడఁ బుల్కుపుల్కనఁజూచె
గొల్లదొరకొఱకునై కోరివచ్చిన రాధ. 136

ద్విపద. అంతలో నొక నికుంజాంతంబునుండి
కొంతగా వినిపించె గోపాలుమురళి;
చెంతకుం బరువెత్తె చిన్నారి రాధ,
శాంతించె సుషిరంబు సద్దింత లేక! 137

తే.గీ. కీరవాణిరాగంబునఁ గృష్ణుఁ డిటుల
నాలపించుచు రాధిక నపుడు ద్రిప్పె;
ఒక్కపొదకడఁ బాడు, నా చక్కి కేఁగఁ
దప్పుకొని వేఱొక పొదను దాఁగి పాడు. 138

తే.గీ. గోపకుని యాగడంబుల నోపలేని
రాధ కప్పుడు రోషగర్వంబు లొదవె;
మదముతో నడకలు గొంత మందమయ్యె,
అభినయంబున బిబ్బోక మావహిల్లె. 139

తే.గీ. ఆమె రోషగర్వంబుల నద్భుతముగ
నేకకాలమందు నభినయించుచుండె;
కాని యవి యామె యంతర్గతానురాగ
భావమున కుపాంగంబులై పరఁగుచుండె. 140

ఆ.వె. ఐనఁ గానుపించఁడయ్యె నామె కతఁడు,
పొదల దాఁగి యేవొ రొదలు సేసె;
ఆమెలోని రోష మంతకంతకు జారె,
గర్వ మెడలి లోనఁ గరుణ మీరె. 141

ఆ.వె. ఆవహించె దైన్య మా యింతివక్త్రంబు
నశ్రుమయము లయ్యె నామె కనులు;
[1] విప్రలబ్ధ యగుచు విభునిఁ గూర్చి యిటులు
పాడఁదొడఁగె నామె పాట నపుడు. 142

పల్లవి: యమునాతీరవిహారీ! యదుకులనాయక శౌరీ!
గోపీహృదయవిహారీ! గోవర్ధనగిరిధారీ!

చరణము: ఏయెడ నుంటివో, ఏ పొద నుంటివో,
నాయెద దోచిన నందకుమారా!

చందురుఁ బోలెడు నీ
సుందరరూపము కను
విందొనరింపఁగ రారా!

అనుపల్లవి: రాధాలోలా! రసమయశీలా!
బాధింపక నను వైళమె రారా! 143

మ. అరవిందానన యిట్లు దైన్యమిళితంబై పొల్చు శృంగారని
ర్భరమైయున్న పదంబుఁ బాడుచును దద్భావంబు లాస్యంబునన్
పరిపూర్ణంబుగఁ జూపుచుం బ్రియుఁడు దాఁ బ్రచ్ఛన్నుఁడైయున్న చో
టరయంగాఁ జనె, రమ్యపాదయుగవిన్యాసంబు సంధిల్లఁగన్. 144

ఖండగతి. [2] భౌమచారులఁ గల్గు పాండిత్యమును జూపి
ఆమె గమియించె రంగాంతముల కింపుగన్;
విరియుకన్నులఁ బొదలు [3] విభ్రాంతదృష్టులం
బఱపుచుం దెసలందుఁ బరికించె విభునికై. 145

1. విప్రలబ్ధ = అష్టవిధశృంగారనాయికలలో నొకతె. సంకేతమునందు ప్రియుని గాంచక వెతఁ జెందునది విప్రలబ్ధ. 2. నర్తకుల గమనములు (చారులు) భౌమీ (లేక భౌమ, అంటే పాదములు భూమిపై మోపి చేయునవి), ఆకాశికీ (అంటే గాలిలో పాదము లుంచి చేయునవి) అని రెండు విధములు. 3. ఇది యొక సంచారదృష్టి. చలించు ఱెప్పలు, తారకలు, విప్ఫారినకన్నులు గల్గి ఆకులపాటుతో గూడినది విభ్రాంత దృష్టి. ఆవేగ-సంభ్రమ-విభ్రమము లందిడి ప్రయుక్తము.

కం. వెన్నునికై రాధిక పలు
తెన్నులఁ గాంచఁగఁ, దదీయదృష్టులు దమపైఁ
గొన్ని బెరసికొనఁ దామే
వెన్నులు గాఁదలచి రచటి ప్రేక్షకు లెల్లన్. 147

తే.గీ. అట్టి చూపులు తనపైనఁ దొట్టికొనఁగ
గూళిదేవుండు భ్రమిసెను గూర్మిచేతఁ
గన్నులం గప్పుచుండెను సన్నుతాంగి
తన్నటంచుఁ, గామవశీకృతాత్ముఁ డగుట. 148

ఉ. ఆ సరసీరుహాక్షినయనాంతవినిర్గతదృష్టిజాలముల్
భాసురసారసాస్త్రశరవర్షములై మెయినెల్లఁ దన్నఁగన్
బాసి వివేకముం ధృతియు బాధమనోభవసంజ్వరార్తుఁడై
డాసి తదంగనం దన యెడందను జేర్పఁగనెంచు నప్పుడేన్. 149

ఉ. ఆ సరసీరుహాక్షి యటు లారయుచుండ సభాంతరంబునన్
భాసురుఁ డౌచుఁ బూర్ణశశిభాతిఁ గనంబడెఁ దాను మున్నుగన్
గౌసుమవాటి నేకతమఁ గాంచినయట్టి మనోహరాంగుఁ డ
బ్జాసనఫాలసన్నిభమహాస్సముదంచితఫాలుఁ డింపుగన్. 150

ఉ. పోయిన పెన్నిధిన్ మఱలఁ బొందినయట్లు, సరోఽంతరంబునన్
వాయువశంబున న్మునిగినట్టి సరోజము పైకిఁ దేల మో
దాయతిఁ గాంచినట్లు, జలదాంతరితేందుని వెండి జూచిన
ట్లా యువశిల్పిచంద్రుఁ గను నామెను బొందె నపారసౌఖ్యముల్. 151

తే.గీ. ఆమె దృక్చంద్రికాతతు లతని చూడ్కు
గముల లలితోదయార్కాంశుగణముతోడ
కలిసికొనుచున్న తచ్ఛుభకాలమందుఁ
బొదలెఁ బ్రబలానురాగంపు టుదయసంధ్య. 152

తే.గీ. అతని యాలోకవల్లరు లంటసాగి
యామె యాలోకలతలతో నలమికొనుచు
పంచశరదైవమునకు నిర్మించుచుండె
మంజుతరలతావేల్లితమండపంబు. 153

ఉ. ఆ కుసుమాస్త్రదివ్యకరుణాతిశయంబునఁ బోలె నంతటం
జేకురె నిర్నిమేషదశ శిల్పికిఁ, జెల్వకు, మేనుదీవలం
బ్రాఁకెను పుల్కరింతలు, సురక్తిమ నిండెను వక్త్రసీమలన్,
వ్యాకులితంబులయ్యె విచలారుణపల్లవలీల నోష్ఠముల్. 154

తే.గీ. అంతలో వచ్చి పొదరింటి చెంతనుండి
కొంటెకృష్ణుఁడు రాధిక వెంటఁజేరి
అంసలతల నల్లన సాఁచి, యామె కనులఁ
దటుకునన్ గప్పెను నిజహస్తములచేత. 155

ఉ. ఆమెకు మాత్ర మక్కజముగాఁ దను గాంచుచునున్న శిల్పియే
ప్రేమము మీరఁగాఁ జిలిపికృష్ణుని రూపున వచ్చి కన్నులం
గోమలపాణిపద్మముల గొబ్బున మూసినయట్లు దోఁచెఁ, దా
నామెను కృష్ణుడై కలిసినట్లుగ నాతఁడు నెంచె నాత్మలోన్. 156

తే.గీ. అపుడు బిడియంబు, రాగంబు లలమికొనఁగ,
కొంటెకృష్ణుని వారించి కోమలాంగి,
[1] వరనిహంచితశీర్షంబుఁ,[2] దరళనేత్ర
జనితలలితదృష్టులుఁ [3]బోలఁ జనఁగఁ దలఁచె. 157

1. వర = చక్కనైన, నిహంచితశీర్షంబు = బొమముడితోఁ గూడి, మెడను వంచుటవలన ఉన్నతమైన అంసము నానుకొనునట్లుగా రచించిన శిరోభంగిమ; విలాస, లలిత, గర్వ, బిబ్బోక, మోట్టాయిత, కుట్టమిత ప్రదర్శనము లందిది ప్రయుక్తము. 2. తరళ నేత్ర జనిత లలిత దృష్టులు = ప్రకాశించుచున్న కనులనుండి జనించిన లలితదృష్టులు. ముడువఁబడ్డ కొనలు, ఎగురవేయఁబడుచున్న కన్బొమలు గల్గి, సస్మితము, మన్మథవికారోపేతము నైన చూపుకు లలితదృష్టి యని పేరు. 3 పోలన్ = అతిశయింపఁగా.

తే.గీ. అలతి నవ్వుల నొల్కుచుఁ జిలిపి కృష్ణుఁ
డామె కరముల నల్లన నంటి యాపి
కన్నుసన్నల వారించి ప్రన్ననైన
కరములం గప్పి యామెను గవుఁగిలించె. 158

తే.గీ. కాంతు కౌఁగిట నా యింతి కరఁగిపోయె,
ప్రస్తుతంబగు శృంగారరసము భంగి,
ఆత్మ పరమాత్మయం దైక్యమైన యపుడు
పొందు సౌఖ్యంబె యాయింతి పొందుచుండె. 159

తే.గీ. అంతలో రంగపార్శ్వంబులందుఁ బొదలి
వినఁగనయ్యెను వేణునిస్వనచయంబు,
ముందుగా మంద్రమై, పైని మురజకాంస్య
వల్లకీగీతకలితమై ప్రబల మగుచు. 160

ఖండగతి. తాం తకిటతాం తకిత తత్తళాంగు తకతోం
ధిత్తళాంగు తకతోం తత్తళాంగు తకతోం
తధిగిణ తధిగిణతోం తకతోం తళాంగుతోం
తాహింత తత్తాహి తకతైత తహితతోం. 161

తే.గీ. అనుచు లయతాళయుతముగా నపుడు మ్రోగె
మురజ మద్దానితోఁ గూడి మ్రోగె నితర
వాద్యములు; వాని కనువుగఁ బదము లిడుచు
హరియు, రాధయు ముదమున నాడుచుండ్రి. 162

చం. మృదువగు పాదపద్మముల ముద్దుగఁ దాళముఁ బట్టి యాడుచున్,
పదగతు లెల్లొ యవ్విధము బాణియుగంబుల ముద్ర లూనుచున్,
పదకరముద్రలందుగల భావము నేత్రములందుఁ జూపుచున్,
పదకరనేత్రభంగులకు వ్యాఖ్య యొనర్చుచు నాస్యలీలలన్. 163

తే.గీ. ప్రకృతియుఁ బురుషుండు గలసి పరఁగినటుల,
వాక్కు నర్థంబు నొక్కటై ప్రబలినటుల,
పూవుఁ దావియు నేకమై పొలిచినటుల,
వార లేకమై నాట్యానఁ బరఁగుచుండ్రి. 164

ఆశ్వాసాంతము

విలాసిని. శ్రీకంఠవందితా! శ్రీసతీనందకా!
వైకుంఠమందిరా! భక్తమందారకా!
లోకాధినాయకా! లోకసంస్థాపకా!
శ్రీకేశవా! హరీ! చేతనోద్ధారకా! 165

కం. వేలాపురీశ! కేశవ!
లీలానిర్మితమనుష్యలేఖావరపా
తాళాదిలోక! శితో
ష్ణాలోక! జగద్ధితకరచారువిలోకా! 166

కం.తు. ఇది కృష్ణదేశికాఖ్యుఁడు,
సదమలవర్తనుఁడు సేయు జక్కనకావ్యమునన్
చదువులదేవత కృపచే
నొదవును రెండవదగు మధురోల్లాసం బగుచున్. 167






కం. శ్రీ ని వరించెడు వేళన్
మానితమౌక్తికమరకతమాణిక్యములం
బాణుల నెత్తి, రమాల
జ్ఞానతశీర్షమునఁ జల్లు హరినిం గొలుతున్. 1

## నాట్యాంతము

ఉ. ఆ నలినాస్య యిట్టు లసమాద్భుతరీతిని నాట్యమాడి, య
హ్నాననమం దహస్కరుని నారయుచుండి యదృశ్యయైన సం
ధ్యానలినాస్యచందమున నాయువశిల్పినిఁ గాంచు చంతలో
లోనికి నేఁగసాగెను, పిఱుందులపై జడ నాట్యమాడఁగన్. 2

ఉ. అంబుజనేత్ర యేఁగుతరి నచ్చట నిల్పిన కృత్రిమంపుఁ గుం
జంబునఁ జీరకొం గెటులొ సక్తముగాఁగఁ దదంచలంబు ము
క్తంబొనరించు వ్యాజమునఁ గ్రక్కునఁ దిర్గుచు, నోరసేయు చా
స్యంబును, కేకరాక్షులను నారయుచుం జనె శిల్పిసత్తమున్. 3

తే.గీ. అటువలెం దిరోహితయగు నామె వేణి
యందు నింపొందు పూవుల నంటి పోవు
భృంగములరీతి నాశిల్పి దృష్టిజాల
మామె వెన్నంటి తెరవెన్కఁ కరుగసాగె. 4

ఉ. ఆ రుచిరాస్య ఫుల్లనయనాబ్జములందునఁ జిక్కికొంచు, నా
నీరజనేత్ర కాండపటనిహ్నుత యైనను దిర్గిరావు శృ
ఙ్గారరసప్లుతంబులగు జవ్వనుచూపులు; రాత్రివేళఁ బ
ఙ్కేరుహపాళిగర్భములఁ జిక్కుకపోయిన తేంట్లకైవడిన్. 5

సన్మానము

తే.గీ. అపుడు వేదికమీద విన్యస్తమయ్యె
నతులమణిమయస్వర్ణసింహాసనంబు;
వికచసారసమట్టుల వెలుగు వేది
కద్ది కర్ణికయట్టుల నందమయ్యె. 6

కం. ఆ సింహాసనము కడన్
భాసిలుచుండెను సుగంధపంకంబులు, స
ద్వాసాభరణంబులు, నా
నాసుమదామంబులు, నయనంబుల కింపై. 7

తే.గీ. వందిమగధులు సంస్తుతుల్ వల్కుచుండ,
సచివుఁడొండు కైదండ యొసంగుచుండ,
గూళిదేవనృపాలుండు కోర్కిమీర,
హైమసింహాసనారూఢుఁ డయ్యెనంత. 8

కం. అతనికిఁ బార్శ్వమునఁ బురో
హితనాట్యగురువు లధివసియించిరి; పయి భా
రతి కెనయగు నా నర్తకి
ప్రతిసీరం దొలఁగి వచ్చె రంగస్థలికిన్. 9

తే.గీ. తదుపరి పురోహితుండు వేదములు వల్కు
చుండఁ, బన్నీరముం జిల్కుచుండ నొక్క
బ్రాహ్మణీసువాసిని, గురువర్యుఁ డాశి
షంబులం దన్పుచుండగ సమ్ముదమున. 10

చం. ప్రమదముతోడ రత్నవిసరంబులు దాపిన స్వర్ణహారమున్
కుముదదళాక్షికంఠమున గొబ్బున వైచి, తదంగవల్లికన్
దమకము నాపలేక కయిదమ్ముల సాఁచుచుఁ గౌఁగిలించె లో
కము గనుచుండఁగానె కడుగాటముగా నరపాలుఁ డంతటన్. 11

చం. బలిమినిఁ గౌఁగిలింప నరపాలకుఁ డా లలితాంగి హస్తిచే
నలుగుడువడ్డ యంబుజినినల్వునఁ జాలఁ గలంగి, మెల్పునన్
స్ఖలితసువర్ణమేఖలను సర్దుకొనంజను వ్యాజమూని పై
దొలఁగుచుఁ బాసెఁ గౌఁగిలినిఁ, దొయ్యలు లన్నిట జాణలే కదా! 12

కం. సౌదామనిఁ బోలెడు నా
పైదలి తెరచాటు కట్లు వైళమె యేఁగన్,
వేదికయందున ధ్వాంతం
బాదేశంబైన యట్టు లగపడెఁ బ్రజకున్. 13

తే.గీ. బ్రాహ్మణి యొకర్తు తనతోడు రాగ నామె
శీఘ్రముగనె వేదినిఁ బ్రవేశించె మఱల;
సచివుఁ డాయింతి నంతట సాదరమున
నధివసింపఁగఁ జేసె నర్ఘాసనమున. 14

తే.గీ. బ్రాహ్మణాశీరవంబులు పరఁగుచుండ,
స్వర్ణభూషణ,నూత్నవస్త్రాదిబహుళ
గౌరవాంకంబు లాయింతి కప్పగించె
బ్రాహ్మణీసతి సచివుని భావ మెఱిఁగి. 15

తే.గీ. అంత నాయింతి యవనికాభ్యంతరమున
కరుగ నుంకింప నాయత్న మరయుచున్న
గూళిదేవేశుఁ డామెను గూరుచుండు
మనుచుఁ గేలూచె, నామెయు నటులె చేసె. 16

కం. సచివుం డంతటఁ బల్కెన్
'ప్రచురకళావైభవమున రంగస్థలమున్
రచియించిన జక్కన శి
ల్పిచంద్రముఁడు రాఁదగు నిఁక వేదికి' ననుచున్. 17

చం. అని పలుకన్ లతాంగి హృదయంబునఁ దత్తరపాటు నొంది, యీ
యనువునఁ జింతసేయు, 'ఎవడా వరశిల్పి? వనంబునందు నే
మును గనుగొన్నవాఁడును, నపూర్వముగా నిట నన్నుఁగన్నులం
గొనకొని పల్కరించు యువకుండును జక్కననామకుండొకో!'. 18

కం. అను చాశ్చర్యంబునఁ గను
క్షణమాత్రము మూసి 'యతఁడె జక్కన యౌన
ట్లొనరింపుము పంచశరా!'
యని స్మరుఁ బ్రార్థించుచుండు నంతటిలోనన్. 19

సీ.తు. ఆజానుబాహుండు, నరవిందనేత్రుండు,
రాకేందువక్త్రుండు, రమ్యగాత్రుండు,
విస్తారవక్షుండు, బింబారుణోష్ఠుండు,
బాలేందుసమచారుఫాలభాగుండు,
ఆయతశ్రవణుండు, నబ్జాతదళహనుం,
డద్రికూటోపమానాంసద్వయుండు,
రంభోపమోరుండు, రక్తాంబుజకరుండు,
హర్యక్షమధ్యముం, డరుణపాదుండు,

తే.గీ. ఐన కుసుమాస్త్ర సంకాశుఁడైన వాఁడు,
మున్ను మల్లిక వనమునఁ గన్నవాఁడు,
శిల్పభారతి కుఱ్ఱఁడై చెలఁగువాఁడు,
జక్కనాహ్వయుఁ డెదుట సాక్షాత్కరించె. 20

ఉ. కోకిల కబ్బినట్లు నవకోమలచూతకిసాలశాఖ, సం
ధ్యాకమనీయగాత్రికి సుధాకరదర్శన మబ్బినట్లుగన్,
కేకికి శ్రావణాంబుదము గీల్కొనినట్లుగ నభ్రమందునన్,
ఆ కుముదాక్షుఁ డామె కతిహర్షము గూర్చుచు నిల్చె చెంగటన్. 21

కం. చక్కన జక్కననామము,
చక్కన రూపంబు, మిగులఁ జక్కన యిచటం
జెక్కిన శిల్పంబు లనుచు
నక్కడి జనులెల్లఁ బొగడి రాయువశిల్పిన్. 22

ఉ. ఆ సభనున్న గుబ్బెతలు హాయినిఁ గూర్చు తదీయరూపమున్
వీసరవోని కూర్మిమెయి వీక్షణసేతురు నిర్నిమేషులై,
ఆ సుమబాణమూర్తి నెదలందున నిల్పి, యజస్రతన్నిది
ధ్యాసపరీతలై, పొలుతు రచ్చపుయోగినులట్లు ధన్యలై. 23

ఉ. చల్లని దక్షిణానిలము సల్లెడు గంధపుతావియట్లు, సం
ఫుల్లమహోత్పలవ్రజసముత్థితగంధిలపాంసులట్లు, వి
ద్యుల్లతికాక్షణక్షణవిధూననమంజిమయట్లు, వేదిపై
మల్లికదర్శనం బమితమైన ముదంబును గూర్చె శిల్పికిన్. 24

తే.గీ. అతని యాలోకజాలంబు లావరాంగి
ముఖముపై వ్రాలె వెన్నెలపుల్గు లగుచు,
పెదవిపై వ్రాలెఁ జిల్కలపిండు లగుచు,
అంబకంబుల వ్రాలె ఖంజంబు లగుచు. 25

తే.గీ. సచివసూచితమైన యాసనముపైన
నాతఁ డాసీనుఁ డయ్యె నింపార నపుడు;
జలజసింహాసనంబునఁ గొలువుదీర్చు
బ్రహ్మనే తలపించెఁ దద్వైభవంబు. 26

నయాగరా వృత్తము. క్రొన్నిటం బదపద్మముల్ గడిగి, క్రొంబొట్టు లంటించియున్,
పన్నీరంబులు సల్లి, చందనపుఁ బంకంబుఁ గైసేసియున్,
పున్నాగాసవమంటి చేతిపయి, పూజించి రావేదిపై
తన్నాళీకశరాంగు నప్పుడు ముదంబొప్పఁ బుణ్యాంగనల్. 27

కం. తదుపరి సచివుఁడు నానా
మృదుపట్టంబర, సువర్ణకృతభూషణముల్
పదిలంబుగ రతనంబులు
పొదిగిన పళ్లెరమునందు పూరించి తగన్. 28

కం. ఆ శిల్పాచార్యుని కీ
గా సంరంభింపఁ, ద్వరగఁ గరసంజ్ఞలచే
నీశుండు గూళిదేవుం
డా సంరంభమ్ము నుడిపి యనె నీరీతిన్. 29

నయాగరా వృత్తము. ఈరంగస్థలి జక్కనాఖ్యుఁడగు నీశిల్పి నిర్మించెఁబో
వేఱెందుం గనలేని యందములు వెల్గొందఁగా, నందు నిం
పారంగాఁ దొలినాట్యమున్ సలిపి ప్రారంభమున్ జేసె నీ
నారీరత్నము మల్లికాఖ్య నటనావిష్టసర్వాంగియై. 30

కం. ఉచితంబగు నీ యంగన
ఉచితంబుగ సత్కరింప యువశిల్పివరున్,
రుచిరంబగు నాట్యముచేఁ
బ్రచురంబుగ ఘనునిఁ గొల్చు బర్హిణమటులన్. 31

కం. అని పల్కి గూళిదేవుఁడు
కనుసన్నల నట్లొనర్పఁ గమలేక్షణకుం
దన తలఁ పెఱిఁగించిన నా
వనజాక్షియు నూత్న మోదభరితాంతరయై. 32

ఉ. ఎంతటి భాగ్యమో కలిగె నీశునిఁ బార్వతి కొల్చినట్లుగా,
చెంతను జేరి కవ్వడిని చెల్వ సుభద్రయుఁ గొల్చినట్లుగా,
సంతసమార నీతనిని సభ్యసమక్షమునందుఁ గొల్చు కొం
డంత యదృష్ట మిప్పుడని యంగన యెంతయు సంతసించుచున్. 33

ఉ. అందెలు ఘల్లుఘల్లురన, నన్నువకౌ నసియాడ నల్లనన్
ముందుకు సాగి పళ్లెరము ముద్దుగఁ బట్టి కరాంబుజంబులన్,
సుందరి సిగ్గుటందములు శోభిల ముందుకు వంగి పళ్లె మా
సుందరు హస్తమం దునిచెఁ జూపులుఁ జూపులు నేకమై చనన్. 34

కం. అ మదవతి యటుపై సుమ
దామంబును వైచె శిల్పితల్లజు మెడలోన్,
రామునికంఠంబున సుమ
దామం బిడు సీతవిధముఁ దలపించు చొగిన్. 35

నయాగరా వృత్తము. ఆ సత్కారముకన్న యా చెలువ యాలోకసంశ్రేణియే,
ఆ సింహేంద్రవలగ్న వక్త్రనయనానంతసౌందర్యమే,
ఆ సింగారి స్మితప్రణిష్ఠమగు నవ్యాజశృంగారమే,
ఆ శిల్పీంద్రుని కప్డు గూర్చె నతులానందసౌభాగ్యమున్. 36

ఉ. అందముమీరఁ బళ్లెరము నందియ వంగినయప్డు తోరమై
సుందరమై బయల్పడిన సుందరి దేహపు వంపుసొంపులన్
డెందమునందు మెచ్చుచును దృష్టి మరల్పక చూచుచుండెఁ గా
మాంధుఁడు గూళిదేవుఁ, డిల నందము బ్రహ్మను వెఱ్ఱిఁ జేయదే? 37

నయాగరా వృత్తము.
ఆ శిల్పీంద్రుని చూపుచాలులను నాకాశగంగానదిన్
ఆ శైవాలసమానవాల సరసాలోకయాతృవ్రజం
బాశీర్షంబుగఁ గ్రుంకి కాంచె నపు డత్యచ్ఛశృంగారలీ
లాశాలిత్వము; పుణ్యగాహమున లాభింపవే సద్గతుల్? 38

* * * * *

## పారస్పరికానురాగవర్ణనము

మ. ఎటులో జారెను రాత్రి , కాని కునుకొక్కింతేనియున్ బట్ట దా
నటికిన్, శిల్పికులావతంసునకు, తంద్రాపాదియౌ నాత్మలో
పటిభాగంబు తదంగనాహృతముగా భాసింప నాశిల్పి, కా
నటి కా భాగము శిల్పిసంహృతము నైన ట్లాత్మ దీపింపఁగన్. 39

నయాగరా వృత్తము.
అన్యూనంబగు రీతి నర్తకికి, నా శిల్పికిన్, మున్నె దన్
విన్యస్తంబయియున్న రాగమను బీజంబు నాట్యాంతమం
దన్యోన్యంబుగఁ గూడినట్టి సరసాలోకనాసేచనన్
ధన్యంబై, పరివృద్ధమై, ప్రసుమితంబై , ప్రభాసింపఁగన్. 40

తే.గీ. [1] శంబరాహితుండను నైంద్రజాలికుండు
సూత్రములఁ గ్రుచ్చి యాడించు పుత్రికలటు
లన్యవశములైయున్న కాయంబు లూని
నెట్టుచుండిరి క్షణముల నెట్టొ వారు. 41

సుగతి. ఏవల్లిం దాఁకిన మల్లికాంగముగ భాసించు నాశిల్పికిన్,
ఏవీచిం గన్నను మల్లికాభ్రువుగ భాసించు నాశిల్పికిన్,
ఏవాణిన్ విన్నను మల్లికాధ్వనిగ భాసించు నాశిల్పికిన్,
ఏవంకం జూచిన మల్లికాకృతియె భాసించు నాశిల్పికిన్. 42

1 శంబరాహితుడు = మన్మథుడు – శంబరుడను మాయావియైన యొక రాక్షసునికి శత్రువు. వానిని నిర్జించిన వాఁడు గనుక, వానికంటెను మాయావి (ఐంద్రజాలికుడు) యైనవాడని ధ్వని.

కం. తొలుతన్ బిందువుచందము
పొలుతుక హృదయంబునందుఁ బొడమిన వలపే
[1] జలతైలన్యాయంబునఁ
దలకొని సర్వేంద్రియస్థితంబయి పర్వన్. 43

చం. జలజపరాగసంకలితసౌరభపూర్ణసుషీమవాతముల్
మలసిన నామె తప్తమనమందున భగ్గున రేఁగు జ్వాలికల్,
కలరవ మింత విన్పడినఁ గర్ణము చిల్లులువోవుఁ, జల్లవె
న్నెల లొకయింత దాఁకినను నివ్వటిలున్ పెనుబొబ్బ లొంటిపై. 44

ఉ. ఆకులసవ్వడిన్ వినిన నాతని యంఘ్రుల చప్పుడంచు నా
లోకనసేయు వానికయి, లోలదవీయమహీజకాండమున్
వ్యాకులమొందుచుం గనుచు నాత్మ దలంచుఁ దదంగమంచు, శా
రీకలరావమున్ దలఁచు హృద్యతదీయగళారవంబుగన్. 45

ఉ. ఆతనినే నిరంతరము నాత్మను ధ్యానమొనర్చుచున్ నవా
బ్జాతములట్టి కన్నులను సొంతము మూసి తదైక్యమొంది తా
నాతనియట్లు నవ్వును, సమాలపనం బొనరించుఁ, జూచుఁ, జే
ష్టాతిశయంబునందు తను [2] లాత్మవినిఘ్నములౌఁగదా ధరన్! 46

ఉ. ఆతని మున్ను గాంచిన సుమాటవియందుఁ జరించు చొంటిమై
నాతని వెండి గాంచఁ దివు, రచ్చట నాతఁడు లేకయున్నఁ దా
నాతనిఁ బుష్పదామమున నర్చనచేసిన నాట్యవేదియం
దాతురమొప్పఁ జూచు, నట నాతనిఁ గాంచక నిల్చు వెఱ్ఱియై. 47

1. జలతైలన్యాయము = నీటియం దొక్క నూనెచుక్క నిడిన, అది నీటియందంతటను వ్యాప్తి నొందు విధానము; 2. ఆత్మవినిఘ్నము = ఆత్మకు అధీనమైనది. పరతన్త్రః పరాధీనః పరవా న్నాథవా నపి, అధీనో నిఘ్న ఆయత్తః – అని అమరకోశము.

ఉ. సోరణగండిచెంగటఁ బ్రసూనశరాహతచిత్తయౌచు నా
సారసనేత్రుకై నిలుచు, చక్షువు లంగమునిండ దాల్చుచున్
దారుల వానికై వెదకుఁ దానెటకైనను బోవునప్పు డా
వారణయాన, నాథుకయి వంతలఁజెందెడి చక్రిపోలికన్. 48

కం. వారము లీగతి జారఁగ
వారింపఁగ నలవికాని వలవంత మదిన్
గారింపఁగ నొకపరి శ్రృం
గారవతి మహార్తిజనితకాఠిన్యమునన్. 49

ఉ. సన్ననిచీరఁ గట్టి, కడుచక్కని పైఠిణిఱైకఁ దొడ్గి, లే
సన్ననిజాజిపూవుల నిజాసితకేశములందుఁ బెట్టి, వి
ద్యున్నవవల్లియో యనఁగఁ, దొయ్యలి మున్నుగఁ దాను శిల్పినిం
గన్నవనంబుకే చనియెఁ గారణమేమియు లేక యొంటిగన్. 50

కం. మానవుఁ డెన్నివిధంబులఁ
బూనినఁ దరచుగ జయములు వొడమకయుండున్,
కానీ దైవబలంబునఁ
బూననిదే కొన్నిసార్లు వొడమును జయముల్. 51

కం. ఈరీతి నయాచితముగ
నారాజీవాక్షి భాగ్య మాదినమం దా
యారామస్థలియందే
సారఫలోన్ముఖమయి తగు చందము దోఁచెన్. 52

ఉ. ఆ తరుణీశిరోమణి వనాంతరమం దటుసొచ్చి, చేటికా
వ్రాతముతోడఁ దాను మును వారివిహారము సల్పినట్టి య
బ్జాతసరస్తటంబున తుషారసుశీతలవాతపోతముల్
చేతము నింత సంతసిలఁజేయ నొకింతవడిన్ నిషణ్ణయై. 53

తే.గీ. వారిజంబుల కెనయైన పాదములను
సలిలముల ముంచి తరగల సంస్పృజించి
ఆత్మరాగంబు సంవ్యాప్తమైన తెఱఁగు
త్వరగ వ్యాపించు తరగల నరసి యరసి. 54

ద్వి.తు. ఆ యలల గుర్తించు చాశిల్పివరుఁడు
సంస్మితంబొనరించు సమయంబునందు
విచ్చుకొను ముఖమందుఁ దచ్చాడుచున్న
శ్మశ్రువుల, భ్రూకుటుల సౌందర్యగరిమ. 55

తే.గీ. సలిలముల నలవోకగా సాగిపోవు
హంసమిథునంపు సౌందర్య మరసియరసి
స్వీయమగు భావిదాంపత్యజీవితంబు
నటులె కావింపుమని స్మరు నాత్మ వేఁడి. 56

ద్వి.తు. తేఁటిరాయని తీయతీయని యెలుంగు
చాటుగా విని మోము చేటంత చేసి
తావులం బంపి యాతని దరికిఁ బిలుచు
పద్మినీముఖరాగవైభవముఁ జూచి. 57

తే.గీ. చంచుపుటములఁ దనులఁ గరంచి వేడ్కఁ
జెలువలం గూడి యూగుచు నలలపైని,
పైని వలపుమైఁ గవగూడి పైకి లేచి
కలరవంబులఁ బాడెడు కవులఁ జూచి, 58

ఉ. ఆవనజాయతాక్షి యిటు లాసరసీమహిమంబు నాత్మ సం
భావనచేయుచుండగనె ప్రాంతమహీధరపాదభూమిసం
భావితనిస్వనం బొకటి భావుకమై విననయ్యె, మ్రోగుచున్
భావజునల్లెతాటిరొద భాతిగ ఖంగురుఖంగురం చొగిన్. 59

## పునర్దర్శనము

కం. ఖంగను నాధ్వని మనమం
దుం గుతుకంబును బొనర్ప ద్రుతగతిఁ జని యా
యంగన పొడగాంచెను హృద
యంగమము, దృగుత్సవకరమగు దృశ్యంబున్. 60

చం. కలదొక మల్లికావ్రతతికావృతకుంజము, దాని చెంగటం
గలదొక శ్యామలోపలము, కాంతులనీనెడు దానిముంగిటన్
గలఁడొక శిల్పి, యాతఁ డతికౌశలమొప్పఁ దదశ్మమందునన్
నలువున రంభఁ గెల్చు నొక నాతినిఁ దొల్చుచునుండె నిష్ఠతోన్. 61

తే.గీ. అతిమనోహరమగు వానియాస్యమందు
ఎందుకో విషాదచ్ఛాయ లొందియుండె;
పూర్ణిమేందుబింబంబుపై ముసరికొన్న
అభ్రశకలంపునైల్యంబు ననుకరించి. 62

తే.గీ. ఎడఁదలోపల మూర్తీభవించియుండి
ఎదుటఁ గనరాక వెతఁ గలిగించుచున్న
ప్రమద నొకదాని నాశిల్పివర్యుఁ డెదుట
నిల్పికొనుచుండెనోయేమొ శిల్పముగను! 63

తే.గీ. ఆ మనోహారి నర్తకి యౌనొ యేమొ!
కాక యతఁడెట్లు సృజియించుఁ గరము వంచి
పిఱుఁదుపై నుంచి, కనులందు వెఱఁగు నించి,
ప్రియునికై చూచు లాసికీవిగ్రహంబు? 64

తే.గీ. టంకధాటికి శిలయె తలంకుచుండ
ఆతఁ డేకాగ్రచిత్తుఁడై యచట నుండి
శిరసుఁ ద్రిప్పక చెలువనే చెక్కుచుండె,
ఆ రవంబులె యాశలయందు నిండె. 65

మ. త్వరగా మల్లిక మల్లెతీవలపొదం దాయంగ నేతెంచి, ని
వ్వెరపాటున్, మదిఁ దొట్రుపాటు నొదవన్ వీక్షించుచున్ వాని, స
త్వరమే హర్షవికాసితాస్య యగుచుం దాఁ బొల్చెఁ గల్పాగమున్
బరివీక్షించినయట్లు, చేతను సుధాభాండంబుఁ గొన్నట్లుగన్. 66

కం. వెదుకంబోయిన తీవియ
పదములకుం దగిలినట్లు, వాంఛితమగు సం
పద యెదురైన ట్లపుడా
మదవతిహృదయంబు సుఖసమాప్లుత మయ్యెన్. 67

ద్వి.తు. ఆమెకుం దోఁచె నాయారామవరమె
అమరోద్యానతుల్యం బగుచు నపుడు;
ఆమెకుం దోఁచె నాయౌవనాంగుండె
భూమికిం దిగినట్టి పురుహూతుఁ డగుచు. 68

ఖండగతి. ఆతఁ డెవ్వండొ కా డాయింతిహృదయంబె
యాలయంబుగ నున్న యపరకందర్పుండు;
అతఁడు చెక్కుచునున్న యా శిలాప్రతిమూర్తి
యామె మూర్తియె కాని యన్యరూపము గాదు! 69

చం. అతులతపస్సమాధిగతుఁడైన మునీంద్రుని యాత్మపట్టికన్
స్థితమయియున్న ప్రాఁబలుకుచేడియరూపమువోలె నాత్మహృ
ద్గతమయియున్న యావనిత కమ్రతరాకృతినే దృషత్తునం
దతఁడు బహిర్ముఖంబుగ వెలార్చుచునుండె సమాధినిష్ఠుఁడై. 70

కం. ఆతని గాంచిన వెంటనె
యాతతమై పరఁగుచున్న యనురాగాంభో
జాతసుకేసరములగతి
నాతికి మెండుగఁ బులక లొనరె మెయినిండన్. 71

కం. హృదయాంభోనిధియందున
నుదితంబగు రాగమనెడు నూర్మివ్రజపుం
దుదలందలి బిందులవలె
మృదుగాత్రంబున [1] నిదాఘపృషతము లొదవెన్. 72

మ. [2] అనురాగాతిశయంబుచే నొదవు సారౌత్సుక్యధైర్యంబు లా
వనితారత్నముఁ ద్రోయు ముందునకు సంభాషింప నాశిల్పితోన్,
మనమం దప్పుడె యంకురించి త్రప తన్మత్తాక్షి వారించు న
ట్లొనరింపంగను మానినీమణులకున్ యుక్తంబుగాదం చొగిన్. 73

కం. రాగం బీగతి ముందుకు
లాగన్, పదపడి వెనుకకు లాగం ద్రపయున్,
తూఁగాడెను కెరటంబులఁ
నూఁగాడెడు నోడవోలె యోషిన్మనమున్. 74

తే.గీ. ఇట్టులుండంగ జయము ప్రాప్తించెఁ దుదకు
[3] ప్రబలతరమైన యనురాగభావమునకె;
ఐనఁ ద్రపయును పూర్తిగా నరుగదయ్యె,
అద్ది రాగంబునకు నంగ మగుచునుండె. 75

---

1. నిదాఘపృషతములు = చెమటబిందువులు; 2. ఈ పద్యమునందు `వనిత', `మత్తాక్షి', `మానిని' యను పదములు సాభిప్రాయములు. వనతి పురుషమితి వనితా – పురుషుని బొందునది వనిత. అట్లే, మానోఽస్యా ఇతి మానినీ – ప్రణయకోపము గలది మానిని. మదించిన కనులు గలది మత్తాక్షి. వనిత కావున అనురాగమత్తాక్షియై ముందుకు సాగఁబోవ, మానినుల కది తగదని మానజనితమైన త్రప యామెను వారించినదని భావము. 3. అనురాగ త్రపలు రెండును బలముగా నున్నను, రెంటిలో ననురాగము బలవత్తరమైనదని భావము.

మ. అపుడా తొయ్యలి యల్లనల్ల నరవిందాభమ్ము లౌ నంఘ్రులం
ద్రపమైఁ బూన్చుచు ముందుకేఁగి నిలిచెన్ దచ్ఛిల్పికిన్ వెన్కగాన్,
తపమున్ భగ్నము సేయఁగాఁ దపసి చెంత న్నిల్చి, మౌగ్ధ్యంబుచే
[1] నుపచారం బొనరింప జంకు [2] దివిషద్యోషామణిం బోలుచున్. 76

ఉ. ఆతఁడు మాత్ర మాయువతి నారయఁడయ్యె, సమాధినిష్ఠుఁడై
చేతము దేవిపై నిలిపి చింతనసేయు మునీంద్రువోలెఁ, దా
నాతలనీతలం గనక యాత్మగతాంగన కాదృషత్తునం
దే తతకౌశలంబున ఘటించుచునుండె స్వరూపకల్పనన్. 77

తే.గీ. లోనఁ గల్గు నింతిని శిలలోన నతఁడు
చెక్కుచుండెను గాని వీక్షింపఁడయ్యె
ఆ లతాంగియె దివినుండి యవతరిలిన
అచ్చెరంబోలి తనవెన్క వచ్చి నిలువ! 78

ఉ. ఆతఁడు వల్కకుండె; నటులైనను వానికిఁ దానె యెద్దియో
కైతవమూని పల్కుట యగౌరవసూచక మౌనొ యేమొ యం
చా తరళాక్షియుం బలుక కాస్యము వంచి త్రపాభితప్తయై
యాతని వెన్కనే నిలిచె నచ్చపు శిల్పమటుల్ స్థిరంబుగన్. 79

ఉ. ఆమె యవస్థనుం గనుచు [3] నక్కటికంబును బూనెనో, మఱిం
కేమి [4] నిదానమో యెరుఁగ మియ్యదిగాని హఠాద్రయంబునన్
భామిని యంశుకం బెగసి వాని ముఖేందునిపైని వ్రాలఁగా
సౌమమరందముల్ గలయఁజల్లుచు వీచె సుగంధివాతముల్. 80

1. ఉపచారము = అన్యులను సంతోషపరచుటకై పలుకు నిచ్చకము, లేదా ప్రార్థనము, సేవ, పూజనము; ఉపచారపదమును ఇచ్చకమనే అర్థంలో కుమారసంభవంలోని రతీవిలాప ఘట్టంలో కాళిదాసు ఈవిధంగా వాడియున్నాడు.

శ్లో. హృదయే వససీతి మత్ప్రియం, యదవోచ స్తదవైమి కైతవం,
**ఉపచారపదం** న చేదిదం, త్వ మనంగః కథ మక్షతా రతిః.

2. దివిషద్యోషామణి = దేవతాస్త్రీరత్నము; 3. అక్కటికము=దయ; 4. నిదానము=కారణము.

చం. అలవలె లేచి యామె వసనాంచల మాస్యముపైన వ్రాల, నా
సులలితమైన స్పర్శ కెదఁ జోద్యమునందుచు సంభ్రమంబునన్
గలువలఁబోలు గన్నుల వికాసముజింద మరల్చి యాస్యమున్
జెలువున రంభనే గెలుచు చెల్వను గాంచెను శిల్పి యంతటన్. 81

కం. తన హృదయమ్మును దోచియు
తన హృదయాలయమునందె దాఁగిన తరుణిన్
తన వెన్కఁ గనుంగొనఁగనె
ఘనతరమగు తత్తరంబు గ్రమ్మెను వానిన్. 82

తే.గీ. ప్రస్తరంబును దొలువంగ హస్తమందుఁ
గలుగు నులియును సుత్తెయుఁ దెలియకుండ
పతితమైపోయె ధరణికి, వానిచూపు
పతిత మగుచుండగనె యామె వదనమందు. 83

తే,గీ. తాను జెక్కిడి ప్రతిమయె ప్రాణ మూని
పల్కరింపంగ వచ్చిన పగిది నున్న
పడఁతి నాతండు పల్కరింపంగలేక
కొలది క్షణములు చేష్టలు దొలఁగియుండె. 84

ఉ. ఆతని మోమునుం గనఁగ నచ్చటికిం జనుదెంచి యార్తిచే
నాతని మోముఁ గాంచఁగనె యాతఁడు జెక్కిడి శిల్పమట్లుగన్
జేతలు మాని, ముగ్ధయయి సిగ్గున మొగ్గయిపోయె నాతియున్,
ఆ తెఱఁగుం గనుంగొనఁగ నాతని కింకను బుట్టె వేడుకల్. 85

తే.గీ. రేయియెల్ల[1] నినునికై నిరీక్ష చేసి
ఉదయమందున నతని పొం దొదవఁగానె
అతని తైక్ష్ణ్యంబు నోపక యలసిపోవు
[2] పద్మినీవిధంబున నామె పరఁగె నపుడు. 86

1. ఇనునికై = సూర్యునికై, భర్తకై (ప్రియునికై); పద్మిని = తామరతీగ, పద్మినీజాతినాయిక.

కం. ఇతరేతరసందర్శన
కుతుకాన్వితదృష్టిజాలగుంఠితతనులై,
అతితనువగు తెర చాటున
ప్రతిభాసిలు చిత్రములటు పరగిరి వారల్. 87

తే.గీ. ఇట్టు లన్యోన్యసంవీక్షణేచ్ఛతోడ
ఎన్ని క్షణములు గరఁగెనో యెరుఁగ రైరి.
దేశకాలపరిణతి వర్తింప నట్టి
అమలినానందకలితాత్ము లగుచు వారు. 88

తే.గీ. అంతలోననె చెంతనే యలరుచున్న
ఆమ్రశాఖాంతకిసలంబు లారగించి
గళము సవరించి యింపుగాఁ బలుకుచున్న
కోకిల లెడంద నాకట్టుకొనఁగ సాగె. 89

తే.గీ. ఆరవంబుల విను చప్రయత్నముగనె
పలికె జక్కన యిట్టు 'లే భాగ్యఫలమొ
పరభృతంబున కింతటి పాట గలిగె,
లేక యది మీకు స్వాగతశ్లోక మగునొ?' 90

తే.గీ. ఆ పలుకులోని మర్మంబు నామె యెరిఁగి
'ఏల కారాదు మీరు రచించుచున్న
శిల్పసుందరి కియ్యది శివదమైన
సంస్తవం' బంచుఁ బ్రతివల్కెఁ జతురముగను. 91

తే.గీ. దాని కతఁ డందుకొనియెను, 'తథ్య మదియు,
విగ్రహంబున మీరూపె వెలయుచుండె,
దానినే పాట నెపమునఁ దలిరుదిండి
తియ్యతియ్యగ నేఁడు నుతించుచుండె'. 92

తే.గీ. దాని కాయమ పల్కె, 'సత్య మది కాదు,
గ్రావనిర్మితమల్లికాకారమునకు
త్వగ్వినిర్మితమల్లికాతనువునకును,
ప్రాణదుండైన బ్రహ్మనే పాడుచుండె. 93

తే.గీ. దాని కాతఁడు వల్కె, 'సత్య మది కాదు,
అట్టి బ్రహ్మకు చైతన్య మావహిల్లఁ
జేయు నృత్యభారతికినై చేయుచున్న
సంస్తవమె యౌను నీ పికసంరవంబు.' 94

తే.గీ. నర్మగర్భంబుగా నిట్లు నడచుచున్న
భాషణంబులవలన విస్పష్ట మయ్యె,
పేరుకొనలేని యనుభూతి వారిలోన
పేరుకొనియుండె ననుమాట వేగముగను. 95

తే.గీ. కొదమకోయిల పలుకు దోహదముసేయ,
ఉదితమైన సంభాషణ మెదలయందు
మెదలు వలపును వెలి కిట్లు పొదలఁజేసె,
కొదమకోయిల కాదొకో మదనుబంటు? 96

## స్నేహసంవర్ధనము

ఖండగతి. ఇట్లు హృద్గతభావ మెరిఁగించు
సంభాషణం బెంత సమయంబు సాగెనో కాని,
భావిలక్షణములం బరికింప
నత్యంతఫలవంత మైనట్లుగనె తోఁచె నదియె. 97

చం. అతఁడు పురూరవుం గలియ నంబరముం డిగి వచ్చు నూర్వశిం
గుతుకముతోడ వ్రాయఁగను గూర్చొను గాని, తదీయరూప మే
గతిఁ గనుగొన్న వాని మతి కబ్బదు; మల్లిక వాని నంతలో
వెతకుచు వచ్చి నిల్చెదుట, వెంటనె యూర్వశి తోఁచు వానికిన్. 98

తే.గీ. కంఠదఘ్న శరీరలై కట్టివేల్పుఁ
జీర లిమ్మని వేఁడెడు చిగురుబోంట్ల
వ్రాయుతరి నాతనికిఁ దోఁచు, వార్షుకాభ్ర
సిక్తమగు మల్లికాతనుచిత్ర మెదుట. 99

చం. అతఁడు నలాకృతిం గొని స్వయంవరమండపమందు నున్న ది
క్పతుల స్వరూపముల్ నలువుగా రచియించును గాని, యామెకున్
హితముగఁ దోఁప వయ్యవి, తదిష్టహితంబుగ మార్చి వ్రాయు ది
క్పతుల నతండు, నప్పు డవి భాసిలుచుండును వానిఁ బోలుచున్.100

తే.గీ. సాంద్రచంద్రికావృతచంద్రశాల యందు
నాట్యమాడఁగఁ బోవు నా నాతి గాని,
సాగకుండును పదమింత సరస లేక
పూర్ణశశిఁ బోలు నాశిల్పిపుంగవుండు. 101

తే.గీ. ఆమె బృందావనంబున స్వామికొఱకు
అభిసరించెడు రాధగా నభినయించు,
అతఁడు వెన్నుని యాకృతి నవధరించి
ఆమె నక్కునఁ జేర్చును ప్రేమ మీర. 102

తే.గీ. ఆమె నదివోలె వక్రంబులైన గతుల
సంచరించును * ఘనవేణి సంచలింప;
ఆతఁ డామోదరసభంగితాబ్ధి యగుచు
ఐక్యమొనరించుకొను లోన నామె నపుడె. 103

* ఘనవేణి = మేఘమువంటి జడ (స్త్రీపరముగ), మేఘయుతమైన నీటిపాయ (నదీపరముగ)

తే.గీ. ఈకరణి ననుక్షణమును వృద్ధినందు
[1] ప్రణయగుణమున వారు [2] నిబద్ధులగుచు
కాయజుఁడు పూలమాలచేఁ గట్టియున్న
[3] పుత్రికాదంపతులఁబోలి పొల్చుచుండ. 104

## వివాహప్రస్తావనము

ఉ. పార్వణచంద్రికారుచులు పర్వుచునుండ శిరోగృహంబునన్
పార్వతిపెండ్లి నొక్కపరి భామిని నాట్యముసేయ ముగ్ధుఁడై
సర్వము మర్చి చూచుచును, స్వాంతమునం గడు సంతసించుచున్
శర్వుఁడు గౌరినిం దరియు సౌరున జక్కన డాసి మల్లికన్. 105

చం. పలికెను, 'నాట్యగానముల భారతిఁ బోలుదు వోలతాంగి! నీ
సులలితహావభావయుతసుందరనాట్యరసస్రవంతిలో
జలకములాడి, మన్మనముఁ జక్షువులుం గనె నల్వ వానినిన్
నలుపుగఁ గూర్చినందుకుఁ గనంగలయట్టి యమోఘభాగ్యముఁ. 106

ఉ. [4] రాజనిభాస్య! నీవు రసరంజితరీతి నటింప [5] భూమిభృ
ద్రాజకుమారి శర్వుని కరగ్రహణం బొనరించు గాథ, నే
[6] నోజఁ దదేకమగ్నమయియున్న మనంబున నీశ్వరుండనై
భ్రాజిలినట్లు మైమఱచి స్వప్నజగత్తున సంచరించితిన్. 107

తే.గీ. ఇట్లు చరియించు టగునేమొ యింతి! నిన్నుఁ
జూచి నప్పుడె నాలోనఁ బూచినట్టి
రాగవల్లరి ఫలమూనఁగాఁ గలట్టి
సమయ మేతెంచె నని తెల్పు సంజ్ఞకంబు! 108

---

ప్రణయగుణమున= అనురాగగుణమను గుణమునందు(త్రాటియందు); 2. నిబద్ధులగుచు = బాగుగా కట్టబడినవా రగుచు; 3. పుత్రికాదంపతులు = బొమ్మ ఆలుమగలు; 4. రాజనిభాస్య = చంద్రునితో సమానమైన ముఖముగలదానా! 5. భూమిభృద్రాజకుమారి = పార్వతి; 6. ఓజన్ = ఉత్సాహముతో.

ఉ. వ్రాతును సంభ్రమించి పలురంగుల చిత్రములన్, మఱింక నే
బ్రాతిగ బొమ్మలం దొలుతు రాతను గాని లతాంగి! యవ్వి యే
రీతిగఁ జేసినం ధర శరీరుల చిహ్నములైన మాటలం
జేతనతన్ వహింపకయె చెంతను నిల్చును మ్రోడు లట్టులన్. 109

తే.గీ. తరుణి! నే వ్రాయు వర్ణచిత్రంబులకును,
లలన! నేఁ దొల్చు రాతి శిల్పంబులకును,
ప్రాణమిడఁ గల్గు నాట్యభారతివి నీవె!
మన్మనోరాజ్యమునకు సమ్రాజ్ఞి వీవె! 110

తే.గీ. పూవునకుఁ దావి యబ్బిన పొలుపు నలరి,
బొమ్మకును జీవ మబ్బిన పోల్కిఁ దనరి,
మ్రోడునకుఁ బూవు లబ్బిన జాడ నొనరి,
నాదు భాగ్యము పండును నీదుచెంత! 111

ఉ. కావున నో వధూటి! రతి కామునిఁ బ్రేమ వరించినట్లుగన్,
నీవతులానురాగరసనిర్భరచేతముతో మదీయమౌ
జీవితమందుఁ బాల్గొనఁగఁ జేకురెదేనిఁ, దలంతు దివ్యమౌ
సేవధి లభ్యమైనటులు, చేతికి స్వర్గము చిక్కినట్లుగన్ . 112

కం. అన విని లజ్జావనతా
ననయై, రాగారుణవదనాంచితయై, గా
త్రనిచితపులకాంచితయై,
క్షణమాత్రం బామె నిల్చెఁ జకితేక్షణయై. 113

ఉ. మీదటఁ జంద్రికల్ గురియ మీననిభాక్షులనుండి, పల్కె నా
మోదముతోడ మల్లిక `అమోఘము నీపలు కార్య! యేదినం
బాదరమొప్ప నిన్ వనమునందునఁ గాంచితొ నాటినుండియున్
నీదు స్వరూపమే యెదను నిల్పి భజించుచు నుంటి నిత్యమున్. 114

తే.గీ. సలిలబుద్బుద మట్టుల క్షణికముగనె
ప్రియము గూర్చును నాయాట ప్రేక్షకునకు;
కాని యింపుఁ గొల్పుచు నిల్వఁగలదె యిద్ది,
నీదు శిల్పము లట్టుల నిరతముగను? 115

తే.గీ. కాన నశ్వరంబైన నా కళకు నీవె
శాశ్వతత్వముఁ గల్పించు స్రష్టవోయి!
అభినయింతును నీకు నర్ధాంగి నగుచు,
అభిచరింతును నీలోని యంశ మగుచు'. 116

తే.గీ. అనుచు నక్కన వ్రాలంగ నాలతాంగి,
బిసములంబోలు బాహుల వెసను సాఁచి
కూర్మిమై నామెఁ దనలోనఁ గూర్చికొనియె
అబ్ధి గంగను లోఁగొన్న యట్లతండు. 117

తే.గీ. ఇట్లు వివశాంగు లగుచు వా రెంతసేపు
గడపిరో రాత్రియం దెరుగంగ లేము;
కాని తారలు మాత్రము గగనమందు
కాలమునె కొల్చుచుం దిరుగాడుచుండె. 118

*****

## వివాహము

మ. పరమంబై తనరారు శ్రీమదనగోపాలాలయం బద్ది, యం
దు రతీమన్మథులట్లు గన్పడిరి భద్రోద్వాహసంరంభులై,
వరపట్టంబరధారులై, కుసుమసంప్రాతోల్లసత్పాణులై,
గరిమన్ మల్లికజక్కనాహ్వయులు, రాగాయత్తచిత్తాబ్జులై. 119

తే.గీ. లేరు బంధుజనంబులు, లేరు సఖులు,
లే రధికసువాసినులును, లేరు విప్ర
వర్యులును, లేరు బహువిధోపాయనంబు
లిచ్చువారు, లేరటఁ జూచి మెచ్చువారు. 120

తే.గీ. ఉండెను బురోహితుండును, నుదధికన్య
మాడ్కి నున్న యతని పత్ని, మఱియు నుండె
మల్లనాహ్వయుఁ డగుచు శోభిల్లువాఁడు,
నంధుఁడగువాఁడు, జక్కన్న యనుఁగుతండ్రి.. 121

తే.గీ. వారి యెదుటను, వేణుగోపాలు నెదుట,
మల్లెదండల ముందుగా మార్చుకొనియు,
పైనిఁ బాణుల నెనరారఁ బట్టుకొనియు,
వారు గాంధర్వలీల నుద్వాహమైరి. 122

తే.గీ. వాద్యములు లేవు, గోపాలు వంశి దక్క;
సాధ్వు లట లేరు, రుక్మిణీసాధ్వి దక్క;
ఖాద్యములు లేవు, ఖండశర్కరలు దక్క;
బందుగులు లేరు, తార్క్ష్యుని ప్రతిమ దక్క. 123

ఖండగతి. ఐన సాగెను పెండ్లి యసమానతరలీల,
మానసంబులు గలియఁ గాననంబేమైన
మరుభూమియేమైన మంగళప్రదమైన
పరిణయనవేదియై పరఁగదా ధరలోన! 124

తే.గీ. అట్లు పరిణీతులై వార లాదరమున
మల్లనార్యుని పాదపద్మముల వ్రాలఁ,
గొడుకుఁ గోడలి నెనరునఁ గ్రుచ్చి యెత్తి
తలలఁ బుడుకుచు మల్లన పలికె నిట్లు. 125

కం. 'వనమం దామని విధమున,
ఘనమందునఁ జంచలవలెఁ, గమనీయముగన్
చనుదెంచితి వస్మద్గృహ
మునకుం గోడల! ఘనశుభ మొనరుత నీకున్. 126

ఉ. బాల్యమునందె తల్లి నెడఁబాసిన జక్కన నింతదాక వా
త్సల్యముతోడఁ బెంచితిని, తామరసాక్షిరో! వాని నిష్ఠ సా
కల్యముగాఁ ద్వదర్పితునిగా నొనరించితి నింక నీవె సౌ
శీల్యము, ప్రేమముం గదుర క్షేమకరంబుగఁ జూచికోఁదగున్. 127

కం. రామునికిన్ సీతవలెం,
గామునికిన్ రతి విధమునఁ, గష్టసుఖములం
దేమరక పతికి భాగ
స్వామిని వయి పరఁగు మింక వనితామణిరో! 128

ఉ. చిన్నికుమార! జక్కన! విశిష్టగుణాఢ్యయు, నాట్యరాణియున్,
సన్నుతశీలయున్, వినయసంయుతయున్, మృదువాణి యైన యీ
క్రొన్ననబోడి పత్నియగు గొప్ప యదృష్టము గల్గె నీకు, నీ
విన్నళినాక్షిఁ జూచికొను మింక మహాదరరాగపూర్ణతన్. 129

కం. వాసంతికిఁ జాతమువలె,
భాసురముగ వృంతమువలెఁ బ్రసవంబునకున్,
ఈ సుకుమారికి నాశ్రయ
మై సతతం బుండుము సుత! యానందముగన్. 130

తే.గీ. వేఁడివెల్గును వీడని నీడవోలె,
హరునియం దర్ధమైయున్న యంబవోలె,
బ్రహ్మముఖమును బాయని వాణివోలె,
నీకు మల్లిక తోడుగా నెగడవయ్య! 131

ఉ. నీకుఁ బదాఱు వర్షములు నిండక ముం దొకనాఁడు శిల్పముల్
జోకగఁ జెక్క నా కనులఁ జొచ్చిన శాతదృషత్కణాళిచేఁ
జీకుతనంబు చేకురెను జిన్నికుమారక! నాటినుండియున్
లోకువ నైతిఁ, బెంచి తెటులో యటుల న్నిను శక్తియున్నటుల్. 132

కం. అటులైనన్ శిల్పకళా
పటుతాఖిలలోకగౌరవార్హుఁడ వగుచున్
ఘటియిల్లుట నాదు పురా
ఘటితసుకృతకారణంబుగాఁ గనిపించున్. 133

కం. దానికిఁ దోడుగ నేఁడీ
మానిని వధువై తనరుట మది నలరించెన్;
సూనున కేనిధిఁ గోరును
మానగు స్నుషకంటెఁ దండ్రి మహిలో నెపుడున్! 134

కం. కావున నేలికొనం దగు
నీ వరవర్ణిని నెపుడు మహీయఃప్రియతన్
లేవుగద దీనికంటెను
శ్రీవహమగు విధులు నీకుఁ జిన్నికుమారా!` 134

తే.గీ. అనుచు నాశీర్వదించెడు నంధపితకు
భక్తిఁ బ్రణమిల్లి, తానును వధువుఁ గూడి
కృష్ణు నర్చించి, జక్కన గృహముఁ జొచ్చె
మల్లికామల్లనలతోడ నుల్ల మలర! 135

చం. సురభిరమాగమంబునఁ బ్రశోభిలు పుష్పవనంబుసాటిగన్,
స్ఫురదవదాతచంద్రికల సొంపువహించు నిశీథమట్లుగన్,
స్ఫురదరవిందబృంద పరిశోభితమైన కొలంకురీతిగన్
సురుచిరమయ్యె నాగృహము సుందరి మల్లిక పాదమూనఁగన్. 136

ఆ.వె. ఎన్ని నాళ్లనుండొ యిల్లాలు లేకున్న
ఆ గృహంబునందు నామె పదము
మోపినంతలోనె మొలిచె వసంతంబు,
క్రొత్త నైన కళలు కొమరు మిగిలె. 137

******

## సంయోగశృంగారము

ఉ. అంచితరీతి నంకురితమై, యటుపైఁ బలుశాఖ లాకులుం
గాంచి ప్రవృద్ధమై, ఉపరిఁ గ్రమతరప్రసవోత్కరంబులం
గాంచి, ఫలోన్ముఖంబగుచుఁ గన్పడు మల్లికవోలె మల్లికా
కాంచనగాత్రి కన్పడెను కాంతుని యింట ననంతరంబునన్. 138

తే.గీ. * తనదుముఖరాగదీప్తిచే ననలుదాల్చు
మంజుచంపకలతవోలె మల్లికయును
విభునిముఖరాగదీప్తిచే విరియుచున్న
వక్త్రమును దాల్చుఁ గూర్మి యింపార నిపుడు. 139

* 'ముఖరాగేణ చంపకః' (ముఖరక్తిమ సంపెఁగ కకాలవికాసము కల్గజేయును)అను దోహదక్రియ ఇచ్చట స్మరణీయము.

చం. అతని సమక్షమందుఁ గననప్పుడు దోఁచు క్షణంబు లేండ్లుగా
మతినిఁ దదంగనామణికి, మక్కువఁ జెంతను జేరి వల్లభుం
డతిదృఢమైన కౌఁగిళులయందు బిగింప యుగంబులేనియున్
గతమగుఁబో క్షణాకృతిని; కాలగతుల్ ధిషణానువర్తినుల్! 140

మ. విభునిం గాంచిన తక్షణంబె విరియున్ వేళకు కెందమ్ములై,
విభునిం బాసిన తక్షణంబె మొగడున్ వేవేగ లేమొగ్గలై,
విభుఁ డాలింగనమందుఁ గూర్ప వెలయున్ వే విస్ఫుటార్ధంబులై,
శుభరాజీవదళాయతాక్షి కిపు డక్షుల్ చిత్రచిత్రంబుగన్. 141

ఉ. ఆమె ప్రభాతమందుఁ దరుణాతప మాస్యముఁ గ్రమ్ముచుండఁగన్
గోముగ నిల్చి యద్దమును గొంచు నిజాస్యముఁ గాంచుచుండగన్
గాముని కీర్తిరేఖలటు గ్రాలుచు మోవిపయిం బయల్పడుం
బ్రేమపుఁజిన్నెలెన్నొ, యవి ప్రీతిఁ గనుంగొను చామె సిగ్గిలున్. 142

ఉ. చిక్కులువడ్డ హారమును జెమ్మటఁ దోగిన గాత్రవల్లరిన్
నొక్కులువడ్డ మోవినిఁ గనుంగొను చాసతి రాత్రియందునన్
మక్కువమీర సల్పిన 'యమాయికపుం' బను లాత్మయందునం
గ్రక్కునఁ దోఁపఁ గల్యమున గాటపుసిగ్గున మొగ్గయై చనున్. 143

ఉ. చాటుననుండి వల్లభుని సద్గళనాదము విన్నయంతనే
పాటిలు నాలతాంగి తనువందు నిశాతములౌచు రోమముల్
సూటిగ వచ్చి వల్లభుడు చొక్కపుఁ గౌఁగిటఁ గ్రుచ్చినంతనే
నాటి తదంగకంబును నొనర్చును తన్వ్వల సందితంబుగన్. 144

చం. సురుచిరచంద్రికారుచుల శోభిలు రాత్రినిఁ బుచ్చి వేడ్కమై
సరసిజముల్ హసించుతరిఁ జక్కనితోటఁ జరించు జక్కనన్
దరహసదంబుజాతములు, దష్టములైన సుపక్వబింబముల్,
వరలికుచంబులుం దరళవాఃకణముల్ రహిఁ బిల్చుఁ జెంతకున్. 145

సీ. తెలితావిమల్లెలం జెలువుండు గోసియ
మాల లందంబుగా మగువ గూర్చు
కమలంబులం గోసి కాంతుండు కడనుంప
తోరణంబులఁ గాంత తొడరి కూర్చు
చంపకంబులఁ గోసి సఖుఁ డీయఁ దద్రజం
బుల గంధచూర్ణంబుఁ బొలఁతి గూర్చు
మధుపుష్పములఁ గోసి హృదయేశుఁ డందీయ
మకరందతీర్థంబు మడఁతి గూర్చు

తే.గీ. స్వాదుఫలముల నతఁడీయ వానిఁ గూర్చు
సారనైవేద్యముగ నింతి చతురముగను
పొగడపూవుల నతఁ డీయఁ బొందుపఱచు
మంగళాక్షతల్ వానితో మంజులాంగి. 146

కం. సంబారంబుల నీగతి
సంబరముగఁ గూరుచుకొని జంపతు లాపై
నంబుజబాణునిఁ జాల శు
భంబుగ నర్చింతురు ప్రతిపర్వమునందున్. 147

సీ. రంగు లింపుగఁ గల్పి రమణీమణి యొసంగ
రమ్యచిత్రంబుల వ్రాయు నతఁడు,
శృంగారమయనాట్యభంగు లాసతి సూపఁ
జెలువారు శిల్పముల్ దొలుచు నతఁడు,
రంగారు భావంబు నంగనామణి సూప
శృంగారగీతి రచించు నతఁడు,
శృంగారగీతి నా చెల్వ యాలాపింప
హితముగా వీణ వాయించు నతఁడు,

తే.గీ. ఆమె యెదుటను నిల్చుచో నతఁడు నిల్చు
నామె కనుపాపలందుఁ బ్రియంబు గదుర,
ఆమె ప్రక్కకు నిల్చుచో నతఁడు వొల్చు
భారతిం గూడియున్నట్టి బ్రహ్మవోలె. 148

కం. ఈవిధి నితరేతరరా
గావిష్టమనస్తనులయి యాద్వయ ముండన్
జీవితమే యొక పూవుల
నావగఁ గొనసాగుచుండె నాద్వయమునకున్. 149

కం. సుతుఁడును గోడలు నీగతి
జతవీడని జక్కవకవ సౌరునఁ దనరన్
ప్రతినవమోదోద్భాసిత
మతియై తనరెను పితయగు మల్లన మిగులన్. 150

ఆశ్వాసాంతము

కం. శ్రీరమణీహృదయేశ్వర!
ధారాధరనీలదేహ! దానవవైరీ!
నారాయణ! పరమేశ్వర!
నారదసన్నుత! మురారి! నరహరి! శౌరీ! 151

కం. శ్రీరుక్మిణీశ! కేశవ!
సారసభవశంకరాదిసర్వామర ని
త్యారాధితపదసారస!
సారసనేత్ర! హరి! సర్వజగదాధారా! 152

కం. బృందావనకేళీపర!
నందకుమార! నిఖిలభువనానందకరా!
కందర్పకోటిసుందర!
సుందరపీతాంబరధర! శుభదాకారా! 153

కం. వాసిగ నిది మూడవ యు
ల్లాసం బగుచుం దగు, రసలక్షితముగ శ్రీ
దేశికుఁడను కవిచంద్రుఁడు
వ్రాసిన `జక్కనచరిత్ర` వరకావ్యమునన్. 154






కం. శ్రీ రామాకృతి నూనుచు
నారీహర్త యగు రావణాసురునిన్ సం
హారించిన యా శ్రీమ
న్నారాయణునకు సతంబు నతియొనరింతున్. 1

## గూళిదేవుని విరహతాపము

ఉ. ఎప్పుడు గూళిదేవధరణీశుఁడు మల్లికఁ గాంచెనో మనం
బప్పుడె తన్మనోహరి [1] రసాప్లుతవీక్షణజాలకంబులోఁ
దప్పక చిక్కిపోయెను; [2] సుతారపు వాగురలోనఁ జిక్కి యే
చొప్పున ముక్తినిం గనని [3] చుట్టుఁబులుంగు తెఱంగు నొప్పుచున్. 2

ఉ. మున్నుగ నా విలాసవతి ముద్దుగ నాడిన నాట్యమందు సం
పన్నములైన భావముల భావమునందున నిల్పు, నిల్పి యా
సన్నుతగాత్రి గాత్రమునఁ జక్కగఁ జేర్చు విధాన మెద్ది యం
చెన్నొ యుపాయముల్ వెదకు, నిక్షుశరాహతుఁడైన యాతఁడున్. 3

---

1. రసాప్లుతవీక్షణజాలకంబు = (శృంగార) రసముచేత బాగుగా నార్ద్రమైన చూపుల సమూహ మనెడు వల. జాలక మను పదమునకు సమూహము, వల యను రెండర్థము లున్నవి. 2. సుతారపు వాగుర = సూక్ష్మమైన వల. అంటే కనపడకుండ యుండి ప్రాణులను బంధించు వల (అట్టిదే మల్లిక చూపులలోని విలాసము). 3. చుట్టుఁబులుఁగు = చక్రవాకపక్షి. జంటగూడి యుండుట చక్రవాకముల స్వభావము. అట్టి పక్షులలో నొకదానిని బంధించిన, దాని కధికతరమైన దుఃఖము కల్గును. అట్లే గూళిదేవుని పరిస్థితి యుండెనని భావము.

చం. ఉసురని పాన్పుపైఁ బడును; యోషిత లల్లన శీతలంబులౌ
కుసుమసుగంధిలాంబువులఁ గుంచిక లార్ద్రమొనర్చి వీవఁగా
రుసరుసలాడు వేడి యని; ఔమ్మున గంద మలందఁ గుందెడున్
[1] వ్యుషితసుదారుసంస్థితవిభూతి నలందినయట్లు బెల్లుగన్. 4

తే.గీ. సవితకంటెను తీక్ష్ణుఁడై [2] జ్యౌత్స్నియందుఁ
బొదలు 'చలివెల్గు' నాతండు వదన మెత్తి
సూటిగాఁ జూడఁజాలక నీటియందు
నొందు తద్బింబముం గాంచి పొందుఁ దృప్తి. 5

తే.గీ. ఎడతెగని జాగరణచేత నెఱ్ఱనైన
అతని నేత్రము లపుడా పయస్సులందు
ప్రతిఫలించుచు నందె చెల్వారుచున్న
తావలకంటెను వేఱుగఁ దోఁచకుండు. 6

తే.గీ. ప్రమదవనమునఁ దిరుగు నా ప్రభున కెపుడు
కంటఁబడు దాడిమీసుమోత్కరము లపుడె
మల్లికాధరసీమను ఫుల్లమైన
మృదులసంస్మితరోచిస్సు లెదను మెదలు. 7

తే.గీ. [3] సుమలిహంబులు మూఁగిన కమలములను
జూచు నెప్పుడు నతఁ డప్డె సుమశరుండు
తేఁటిత్రాటిచే గట్టిన తియ్యవింట
విరులశరములఁ గూరిచి వ్రేయు నతని. 8

---

1. వ్యుషిత (వి+ఉషిత) సుదారుసంస్థితవిభూతి = బాగుగా కాల్చబడిన కట్టెలందున్న బూడిద; 'సుదారు' అనుటచేత దహనయోగ్యములైన కాష్ఠములని స్ఫురించును. 2. జ్యౌత్స్ని = వెన్నెలరాత్రి – 'జ్యౌత్స్నీ చంద్రికాయాన్వితా' అని అమరము; 3. సుమలిహము = తుమ్మెద; 4,5,8 పద్యములలో ననేకపదములు ప్రకృతార్థానుగుణముగా వాడబడినవి.

తే.గీ. మల్లికావేల్లితంబైన మావి నతఁడు
చూచు నెప్పుడు నప్పుడే సుమశరుండు
చూతపల్లవజాతనిశాతశరము
లిక్షుధన్వునఁ గూర్చి శిక్షించు నతని. 9

సీ. భూమినిం గాంచుచో భామినీకటిచక్ర
మాత్మలో స్ఫురియించు నవనిపతికి,
నాకముం గాంచుచో నారీవలగ్నంబె
తలఁపునందునఁ దోఁచు ధరణిపతికి,
చంచలం గాంచుచోఁ గాంచనాంగీతను
లతికయే తోఁచును కుతలపతికి,
సలిలముం గాంచుచో లలనాస్మితాంచితో
జ్జ్వలరసంబే తోఁచు వసుధపతికి,

తే.గీ. వాయువుం గాంచుచోఁ దోఁచు వన్నెలాఁడి
మందనిశ్వాసరాజియే మనుజపతికి;
పంచభూతాత్మకంబైన ప్రకృతి యెల్ల
మల్లికారూపమై యిట్లు సెల్లుచుండు. 10

శా. హద్దుల్ గానక వృద్ధినొందు నఘతుల్యంబౌచు నాఁటేనికిం
బ్రొద్దుల్ జాఁటినకొద్ది మల్లికపయిన్ రూఢంబులై కోరికల్
ప్రోద్దామంబుగ బుద్ధినిం గలచఁగా, ముప్పొద్దు నాయింతినే
బుద్ధి న్నిల్పుచు, నామెఁ గూడుటకునై వ్యూహంబులం బన్నుచున్. 11

తే.గీ. ఉండ నాతని మనమందు నుల్లసిల్లె
నూహ యొక్కటి మింట విద్యుత్తువోలె,
అంత మల్లిక కాతఁ డాహ్వాన మంపఁ
దత్తఱింపఁగ సాగెఁ దత్క్షణమునందు. 12

* * * * *

## గూళిదేవుని యాహ్వానము

చం. మరుసటినాఁడు గన్పడిరి మల్లికగేహము చెంగటన్ భటుల్,
వరుతురగాధిరూఢులయి వచ్చినవారలు; వారివెంబడిన్
గిరిశిఖరోన్నతం బయిన కృష్ణసితోక్షయుగంబు లాగు సుం
దరశకటంబునందుఁ బ్రమదాద్వయముం గననయ్యె నిమ్మగన్. 13

ఆ.వె. మెట్లపీట నొండు మేకొని భటు లుంప
శకటనికటమందుఁ, జంచలాంగు
లబ్జపత్రలలిత మగు నంఘ్రు లా పీట
పైనిఁ బూన్చి దిగిరి బండి నంత. 14

ఆ.వె. అట్లు బండి డిగ్గి యలనల్ల నడయాడు
స్త్రీలవెంట భటులు సేతులందు
బహువిధంబులైన బహుమానముల నూని
నడచుచుండ్రి వినయ మడరుచుండ. 15

ద్వి.తు. అంతియే కాక యాయింతులకు ముందు
రాజసం బుట్టిపడ రాజభటయుగము
నడచుచుండెను దారి నాయింతిదొవకుఁ
జూపుచుం బాణులం జురకత్తు లూని. 16

తే.గీ. వేగుచుక్కలదొవవోలె వెల్గుచుండ
ముందు నడచెడి భటులు, పిఱుందఁ జనెడు
స్త్రీలు సంధ్యాంగనాద్వయిలీలఁ దగిరి;
ద్వాదశాదిత్యులం బోలి వారివెంట
స్వర్ణపేటికల్ గొని యన్యభటులు సనిరి. 17

ఉ. చక్కగ వార లీగతిని జక్కనమల్లిక లున్నగేహముం
దక్కక సొచ్చి, మల్లికకునై కొనివచ్చిన సొమ్ములున్న యా
చొక్కపుఁ బెట్టె లా సరసిజోదరసోదరగాత్రి చెంతనే
చక్కగ నిల్పి, యీ గతిని సల్పిరి జల్పము లామెతోడుతన్. 18

కం. `అమ్మా! మల్లిక! నీకిపు
డెమ్మెయి నేరికి దొరకని యిద్ధసుఖంబుల్
సొమ్ముల్ సంపద లొదవెడు
నమ్మహితాదృష్టరేఖ యంకురమయ్యెన్. 19

మ. నవలా! యెప్పుడు గూళిదేవధరణీనాథుండు నీనాట్యముం
బువుఁదోఁటం బరికించెనో యపుడె సమ్మగ్ధాంతరంగుండునై
యవనీనాథుఁడు వొల్చెఁ, దత్ఫలముగా నంపెన్ మముం బేర్మి, ని
న్నవనీనాథుని ముఖ్యనర్తకిగ నాహ్వానింపఁగా నియ్యెడన్. 20

తే.గీ. ఇంద్రుసభయందుఁ జెలువొందు నిందుముఖుల
యందు నింపొందు నూర్వశి చందమొంది
గూళిదేవభూపేంద్రు పేరోలగంబు
నందు నుండనోపుదు గాత! యిందువదన! 21

కం. వనితారత్నమ! పొందునె
యెనినాళ్లుఁ దపించిరేని నితరాంగనలన్
జనపత్యాదరణశ్రీ ?
ఘనభాగ్యం బొదవె నీకుఁ గాదన కింకన్. 22

చం. ప్రమదముతోడ మేము గొనివచ్చిన పెట్టెలనున్న కాన్కలం
బ్రమదయుతాంతరంగవయి భామిని! చేకొనఁ బోలు నిమ్మగన్!
సుమకృతశయ్యకంటె మృదుసుందరమౌ శకటాంతరస్థ త
ల్పముపయిఁ గూరుచుండి వడిఁ బార్థివుకొల్వుకుఁ జేరుకోఁదగుఁ!`23

మ. అనుచా కాంతలు గూఱిదేవధరణీశాదేశముం దెల్పఁగన్,
వనజాక్షీమణి విస్మయంబు గదురన్ వారిన్ విలోకించి, యి
ట్లనె `నో మానినులార! మీ ప్రభుని యవ్యాజాదరంబున్ మనం
బున భావింతును మత్పురాచరితసత్పుణ్యార్థసంసిద్ధిగన్. 24

ఉ. ఎందఱు సుందరాంగులు మహీధవు రాజ్యమునందు లేరు? వా
రందఱియందు నెందఱు వరాంగన లందపునాట్యరీతులం
బొందియు రాచమన్ననలఁ బొందకయుందురు? వారికన్న న
న్నెందుకొ డెందమందు నృపుఁ డెక్కువగాఁ దలపోయుచుండెడిన్! 25

తే.గీ. అనుపమానం బనుత్తమం బైనదయ్యు
పార్థివప్రతిపాదితం బైన పదము
దూతికామణులార! కాదొక్కయింత
వాంఛనీయంబు గృహిణినై పరఁగు నాకు! 26

ఉ. మొన్ననె పెండ్లియాడితిని ముచ్చటమీర మనోజ్ఞరూపసం
పన్నుని, సద్గుణాశ్రయుని, మంజులశిల్పసరస్వతీసమ
భ్యున్నతికిన్ బ్రధానుఁడగు నుత్తమశిల్పిని జక్కనాఖ్యుఁ, ద
త్సన్నిధిలోనె నాకళను ధన్యమొనర్చికొనం దలంచితిన్. 27

తే.గీ. బ్రహ్మముఖముల నిల్చిన బ్రాహ్మివోలె
అతని శిల్పములందు శాశ్వతముగాను
నృత్యభంగిమాకృతులతో నిల్వఁగాను
నుత్సుకంపడుచుంటి నే నువిదలార! 28

చం. అతనినె తేనిగా మఱియు నా పరమేశునిఁగా భజించెదన్
అతని సుఖంబె నాదుసుఖ మాతని దుఃఖమె నాదు దుఃఖమౌ
అతని సమాశ్రయంబె తగు నామరసౌఖ్యదమౌచు నాకు, నే
నతనికిఁ దప్ప నన్యులకు నర్పణసేయఁగఁజాల నాకళన్. 29

కం. కాన నృపప్రేషితమగు
కానుకలన్ స్వీకరింపఁగాఁ గా నర్హన్,
వానిన్ వినయాన్వితముగ
భూనాథుని చెంతకె కొనిపోఁదగు నింకన్.' 30

మ. అనుచున్ మల్లిక వల్క నాభటులు, నయ్యంభోజపత్రాక్షులున్,
ఘనమౌ విస్మయమంది యిట్లనిరి,' ఓ కళ్యాణి! యీరీతిగం
దనకై తానుగ వచ్చినట్టి సిరినిం దప్పించుకో జాతురే!
మును పెన్నండును గాంచ మిట్టి ముగుదన్ మోహానధీనం ధరన్ 31

తే.గీ. ఇదియె నీ యభీష్టంబేని నిందువదన!
ఇంక నేమనగలవార మీతెఱంగె
ఎఱుకపరతుము గూళిదేవేంద్రునకును,
శుభము గల్గుత నీకెప్డు శోభనాంగి! 32

ఉ. ఎమ్మెయి నిర్ణయించినను ఇందునిభాస్య! వసుంధరావిభుం
డిమ్ముగ నీకె యంపినవి యీ రవణంబులు; వీని నెమ్మెయిం
గ్రమ్మరఁ గొంచు మేముఁ జనఁగానము గావున రాజునానచే
నెమ్మిఁ బరిగ్రహింపఁదగు నీవె మనంబున శంక మానుచున్.' 33

చం. అన విని మానినీతిలక మాస్యమునందున మందహాసముం
దొణకఁగఁజేయుచుం బలికె, ' దూతికలార! నృపాలునాజ్ఞఁ గా
దనుటకు నెంతదానను? గృహస్థసుధర్మపథానువర్తినై
జనపతిపంపు సేయుటకు సాధ్యము గాదని విన్నవించితిన్. 34

కం. కావున నీ నిర్ణయమును
క్ష్మావల్లభునకుఁ దెలుపుడు కరుణ దలిర్పన్
భూవిభుఁ డీవిన్నపమును
భావించి యనుగ్రహించుభాతిగ నన్నున్!' 35

తే.గీ. అనెడు నామె కాదూతికావనిత లేమి
నుడివిరో కాని యొక్కింతవడికె వారు
తురగములపైని భటరాజి తోడురాగ
వీడి రవ్వీడు శకటాధిరూఢు లగుచు. 36

## గూళిదేవుని యాగ్రహము

కం. మల్లిక కడకుం బోయిన
పల్లవగాత్రలు వినిచిన వార్తలు మదినిం
బెల్లుగఁ గలఁచఁగ ధరణీ
వల్లభుఁ డాగ్రహవశుఁడయి వాకొనె నిటులన్. 37

ఉ. కొంచెపువేశ్యయై తనరి కుంభినిలోని జనంబు లెల్ల [1] నే
త్రాంచలలాలసాంచితరసాప్లుతవీక్షణజాలకంబులన్
[2] నించుచుఁ గాంచుచుండగ [3] వినిర్గళితత్రపయై నటించు నా
[4] చంచలచిత్త యేడ? వరసాధ్వీపదం బదియేడ? ధాత్రిలోన్. 38

తే.గీ. రమ్యసౌందర్యవతులైన [6] రమణు లెల్ల
రత్నములఁబోలి యుందురు రాజ్యమందు;
రాజ్యమందలి రతనాలరాసు లెల్ల
రాజుఁ జెందుట లోకధర్మంబు గాదె! 39

తే.గీ. రాళ్లు గొట్టి జీవించెడి [7] రమణుకన్న
సర్వభోగభాగ్యములచే స్వర్గపతిని
బోలు రాజచంద్రుండు సేవ్యుండు గాడె?
పణ్యజీవు లయిన వారభామినులకు! 40

1. నేత్రాంచల = కనుగొనలయందలి, లాలసాంచిత = అత్యంతాభిలాష గల (కామోభిలాష స్తర్షశ్చ, స మహాన్ లాలసా - అని అమరము), రసాప్లుత = శృంగారరసముచే తడిసిన, వీక్షణజాలకంబులన్ = చూపు చాలులచేత; 2. నించుచు = కప్పుచు; 3. వినిర్గళితత్రపయై = బాగుగా తొలగిన సిగ్గు గలదై; 4. చంచలనేత్ర - ఇది సాభిప్రాయపదము (పలువురు పురుషులయందు ఆసక్తమైన చూపులు గలది - అని ధ్వని); 6. రమణి - సాభిప్రాయపదము (రమయతే నాయక మితి రమణీ - అని వ్యుత్పత్తి); 7. రమింపజేయువాడు రమణుడు - ఇది ఎగతాళిగా వాడినపదము - రాళ్లు గొట్టి జీవించు మోటు వాడా రమణుడు ? అని ఉపాలంభనము.

తే.గీ. ప్రమదవనమును బోలిన రాజ్యమందు
పుల్లమల్లికచంద మింపొందుచుండు
మల్లికాతన్వి; అనుభవింపంగ దాని
నవ్వనస్వామి యగు నృపుఁ డర్హుఁ డగునొ?
క్షుద్ర[1] మధుపాళులే యౌనొ క్షోణిలోన! 41

చం. [2] అనుపమనైపుణిన్ మును పహల్యను, తారను సంసృజించి, యా
వనితల భిక్షుకర్షులకు భార్యలుగా నొనరించె, నిప్పు డీ
ననకెనమైన కోమలిని, నాట్యకళానిధినిన్ సృజించి కూ
ర్చెను నొక కాసెవానికిని; చిత్రములౌ ముదివేల్పు చెయ్దముల్! 42

తే.గీ. రాచవానికిఁ దగినట్టి రమణి నకట!
కాసెవానికిఁ గట్టుట కడిఁదితనమె?
అమరనది నీదవలసిన హంసి నకట!
వైతరణిలోన ద్రొబ్బుట పాడియగునె? 43

తే.గీ. అద్రితటమున జనియించి, అవనిఁ బాఱి,
తుదకు రత్నాకరుం జేరు నదులయట్లు
రాజ్యమందలి సుందరీరత్నరాజి
రాజుఁ జేరుట యుభయతారకము గాదె! 44

కం. అని యెంచుచు నాజనసతి
తనపురమున కెట్టులైనఁ దజ్జలజాక్షిం
గొనిరాఁగల మార్గంబులఁ
గనుమూసి యొకింతసేపు గణుతించి తగన్. 45

1. మధుప+ఆళులు = మధుపాళులు = త్రాగుబోతులయొక్క, లేదా తుమ్మెదలయొక్క సమూహాములు; 2. భిక్షుకర్షులు = భిక్షుక + ఋషులు = భిక్షుకులైన ఋషులు; ముదివేల్పు = ముదసలివేల్పు= బ్రహ్మ; ననకెనమైన = పూవుతో సమానమైన; ఈ పద్యములో 'ననకెనమైన కోమలిని' 'కాసెవానికి' (ఉలితో జీవితము బుచ్చు వానికి) గూర్చెననుటలో గల ధ్వనిని గమనించు నది. అట్లే 'ముదివేల్పు', 'భిక్షుకర్షులు' అను సార్థకపదములవల్ల గల్గు ధ్వనిని గమనించునది.

తే.గీ. ఒక్కసచివుని చెంతకు నొప్పుమీరఁ
బిలిచి వాని వీనుల నెదో పలికె నృపుఁడు;
ఆతఁ డంత హయారూఢుఁ డగుచు నేఁగె
సరభసంబునఁ గైదాళపురము దెసకు. 46

ఉ. అట్టుల మంత్రి నంపి, వసుధాధిపుఁ డాత్మవనంబునందునం
గట్టిన చంద్రకాంతమణికమ్రవితర్దికపై మనంబునం
దొట్టికొనంగ యోచనలు తొంగిలియుండి, నభంబునందునం
దెట్టువగట్టిసాగు పలుతెప్పల యొప్పును గాంచుచుండఁగన్. 47

కం. పవమానధుతము లగుచున్
వివిధాకృతులం ధరించి [1] వియదధ్వమునన్
[2] నవకంబుఁ బ్రదర్శించెను
[3] నవకంబు ధరించినట్టి [4] నవకంధరముల్. 48

సీ.తు. ఒక్క మేఘము దోఁచె నులితోడ శిల్పములఁ
జెక్కుచున్నట్టి యువశిల్పివోలె,
ఆ మేఘపుం బ్రక్క నన్యమేఘము దోఁచె
నాశిల్పిరచితాలయంబురీతి,
ఆ యాలయంబందు నర్చాంశువుల్ దోఁచె
ప్రవిలాస్యదప్సరఃప్రమదభంగి,
అంతలో నొక్క కాలాంబుదం బెటనుండొ
వచ్చి యామెను గప్పివైచుచుండె,

తే.గీ. ఆమనోహరదృశ్యంబు నరయుచుండె
గూళిదేవుండు కనుఱెప్ప గొట్టకుండ;
వాని హృదయంబు కద్దంబు బట్టినట్లు
పొనరు చాదృశ్య మాతనిం దనుపుచుండె. 49

1. వియదధ్వము = ఆకాశము; 2. నవకంబు = మనోజ్ఞత, అందము; 3.నవకంబు = క్రొత్తనీరు; నవకంధరముల్ = నూత్నమేఘములు; ఇందులో కంధరశబ్దస్వారస్యమును గమనించునది.

## గూళిదేవుడు జక్కనను వసంతమండప నిర్మాణమునకై నియోగించుట

కం. మనుజాధినాథుఁ డంపఁగఁ
జనిన యమాత్యుండు వచ్చె సరగునఁ దన వెం
టను జక్కన నిడికొనుచున్
క్షణకాంతిని గూడివచ్చు జలదం బటులన్. 50

ఉ. వచ్చిన శిల్పిసత్తముని స్వర్ణమణీమయపీఠమందునన్
మచ్చికమీరఁ గూర్చొనఁగ మానుషవల్లభుఁ డేర్పరించి, వా
క్రుచ్చెను 'జక్కనార్య! యిలలోఁ గల శిల్పులలోన నెవ్వరున్
హెచ్చినవారు లేరు నిను, నీవిట వచ్చుట మాదు భాగ్యమౌ! 51

ఉ. ఓ నిరవద్యశిల్పసుకళోదధిపూర్ణకళానిధీ! త్వదు
ద్యానవినిర్మితం బయిన తాండవమండపమంజిమంబు మ
న్మానసహంసి నెప్పు డసమానసుఖాంబుధిలోనఁ దేల్చెనో
యా నిముసంబునుండి మది నాశయ మొక్కటి పొంగువారెడిన్. 52

ఉ. ఉన్నది మా వనాన నొక న్యూనతరంబగు మండపంబు, ఏ
తెన్నున నీడుగా దది త్వదీయకళావినిబద్ధమైన యా
తిన్నని మండపంబునకు ధీరవరేణ్య! ఇదంప్రమాథసం
పన్నమనుండనై మఱొక మండప మందునఁ గట్టఁ గోరెదన్. 53

ఉ. ఓ వరశిల్పివంశకమలోద్భవ! మత్ప్రమదావనంబునన్
వావిరి వేల్పుతేని సభభంగి నెసంగు వసంతమండపం
బీవు రచింపఁగాఁ దగును; ఇంద్రునిఁబోలి వసంతవేళలన్
స్త్రీవిసరంబుఁ గూడి విహరింపఁగఁ బోలును నాకు నందునన్. 54

---

52-60 వఱకుగల పద్యములలో జక్కనను ప్రసన్నుని చేసికొనుటకై గూళిదేవుడు వాడిన యుదాత్తతర సంబోధనవాక్యములను, వానియందు వాడబడిన పదముల స్వారస్యమును గ్రహించునది.

ఉ. ఇమ్ముగ నీవుమున్ను రచియించిన శిల్పకళాభిశోభి స
ద్మమ్మున నాట్యమాడిన సుమంజులనాట్యకళాధిరాణియే
నెమ్మని నీకుటుంబినిగ నేఁడు ప్రవర్తిలు నంచు వింటి నో
కమ్మని వార్త శిల్పివర! కంటిని సౌఖ్యము దాన నామదిన్. 55

కం. కనకంబున కబ్బినయటు
లనుపమమగు తావి, తద్వరాంగన సతియై
తనరుట నీకళ కింకను
బొనరించును దోహదమని పొంగుదు నేనున్. 56

ఉ. ఆ రమణీశిరోమణి రసాభ్యుచితంబుగ నాట్యమాడుచో
నా రమణీయభంగిమల నశ్మమునందున నచ్చువోసి శృం
గారరసైకసాగరముగా రచియింపుము చైత్రమండపం
బో రసికాగ్రగణ్య! యికఁ బుష్పవనంబున సత్వరంబుగన్. 57

మ. అరుదారన్ వరనృత్యభంగిమలతో నాపుష్పితాంభోజినీ
వరపున్నాగసుమల్లికాప్రముఖసద్వల్లీప్రతానంబుతో
భరితంబై కనువిందుఁ గొల్పు వరశిల్పౌఘంబుతో నొప్పు సుం
దరచైత్రాలయ మింక శిల్పికులవిద్యానాథ! నిర్మింపుమా! 58

ఉ. ఈ మహనీయకార్యము నొకింతయు విఘ్నములేక తీర్పఁగా
నో మహనీయశిల్పివర! ఉండుము మాభవనంబునందునన్
నీమదిఁ గూర్చు మల్లికయు, నీజనకుండును తోడనుండి నీ
సేమముఁ జూచుచుండఁగను, సేవకు లెప్పుడు గొల్చుచుండఁగన్. 59

ఉ. రాఁగల జ్యేష్ఠపూర్ణిమ వరంబగు భద్రముహూర్త మున్నదం
చాగమశాస్త్రవేత్తలగు నార్యులు మాకెరిగించి రందుచే
వేగమె నీవు రాఁదగుదు వీపురికిన్ సకుటుంబివౌచు శి
ల్పాగమవార్ధిపారగ! మదాజ్ఞను దప్పక నిర్వహింపఁగన్.' 60

కం. అని గూళిదేవనరపతి
ఘనగౌరవ మెసఁగఁ బల్కి కాంచనమణిభూ
షణచీనాంబరగణముల
ఘనమోదం బెసఁగ నొసఁగఁ గైకొని యంతన్. 61

చం. పలికెను జక్కనాఖ్యుఁడు, 'అపారకృపారసపూర్ణముల్, మహా
లలితము లైన మీపలుకు లయ్యెను భూతలనాథ! నాయెదం
జిలికిన తేనెచిన్కు, లిఁక శిల్పకళానయనాభిరమ్యమై
వెలిగెడు చైత్రమండపము వేగ రచింతును మీదు నానతిన్.' 62

ఖండగతి. అని పల్కి యోలగంబును వీడి
చనె జక్కనాఖ్యుండు సత్వరమె కైదాళకున్
కననయ్యె నప్పుడే గగనసీ
మను వీడి కడలిలోఁ బడఁబోవు రవి పడమటన్. 63

ఉ. మున్నుగ భ్రాజితంబులయి మున్గుచునున్న దివాకరాంశులన్
వెన్నడికొంచుఁ గాంతులను వేగమె గోల్పడుచున్న మేఘముల్
మిన్నున వెల్గ నొక్కయెడ, మీరెను వేరొకచో దదంశులే
సన్నని యంచులై పరఁగ సౌరువహించుచునున్న మేఘముల్. 64

కం. ఫలియించెడి కోర్కెలవలెఁ
జలియించుచుఁ జరచర గిరిసానువులందున్,
తొలఁగుచుఁ దటముల నటుపై
నిలనెల్లఁ దమంబు నించె నినరుచు లంతన్. 65

* * * * *

---

63, 64, 65 వ పద్యములలో గల కథాధ్వనిని గమనించునది. 63వ పద్యములో జక్కన యొక్క నిర్గమనమును సూర్యాస్తమయముతో సంవదించుటచే, ఈనిర్గమనము జక్కనకు సుఖాస్తమయకారకము కాగలదని భావికథాధ్వని. 64వ పద్యములోని పూర్వార్ధము జక్కనయొక్క భవిష్యత్తును, ఉత్తరార్ధము గూళిదేవుని మనోధర్మమును (పన్నాగమును) ధ్వనించుచున్నది. 65వ పద్యము జక్కనకు గూళిదేవునిచెంత క్షణికముగా నభ్యుదయ మబ్బినను, తుదకు దుఃఖమే పరిణమించునని ధ్వనించుచున్నది.

## వసంతమండప నిర్మాణము

చం. ఒనరఁగ జ్యేష్ఠపూర్ణిమముహూర్తమునందునఁ బూవుదోఁటయం
దనువగు చోట భూమికిని నాగమరీతిని శిల్పకర్మకుం
బనివడు సాధనంబులకు బాగుగ నర్చయొనర్చి గూళిదే
వన్నృపుఁడు చెంతనుండి పరివారయుతుండయి చూచుచుండఁగన్. 66

మ. రమణీయంబగు చైత్రమండపము నిర్మాణింపఁగాఁ జొచ్చె నా
[1] యమరజ్యేష్ఠనిభప్రశస్తసృజనవ్యాపారపారీణతం
గొమరుంబ్రాయము మీరకుండగనె కైకొన్నట్టి శిల్పీంద్రుఁడౌ
[2] కమలాస్త్రోపమమూర్తి జక్కన మహాకౌశల్య మేపారఁగన్. 67

చం. అతఁడు రచింపసాగె నపు డష్టసరోజదళంబులట్లు శో
భితమగు పార్శ్వముల్ గలిగి, వృత్తసమాకృతి నొప్పి మధ్యలోన్,
అతులమనోజ్ఞమై తనరు నాలయ మచ్చట, నశ్మమందు ని
ర్మితమయినట్టి పాండురజలేజసమాకృతి నొందు దానినిన్. 68

తే.గీ. ఆ సరోజదళంబులయట్టు లున్న
భాగముల యంచులందును, వర్తులంపు
మధ్యభాగపరిధియందు మంజులంపు
ప్రతిమలున్నట్టి కంబంబు లతఁడు నిల్పె. 69

తే.గీ. అష్టదిక్కుల నతఁడు విశిష్టమైన
నీటియంత్రంబులన్ నిల్పె నీటుగాను,
వాని చుట్టును బహువర్ణసూనరాజిఁ
గలిగి రాజిల్లు వీరుధంబులను నిల్పె. 70

1. అమరజ్యేష్ఠనిభ = బ్రహ్మతో సమానమైన (బ్రహ్మాఽత్మభూః సురజ్యేష్ఠః పరమేష్ఠీ పితామహః – అని అమరము), ప్రశస్త = ప్రసిద్ధమైన, సృజనవ్యాపార = సృష్టిచేయుటయను వృత్తి యందలి, పారీణతన్ = ప్రావీణ్యమును; 2. కమలాస్త్రోపమమూర్తి = మన్మథస్వరూపుడు.

కం. ఈగతి నిర్మాణంబను
యాగమున సతంబుఁ దేలు నాశిల్పివరున్
దాఁ గొల్చుచుండె నాట్యక
ళాగమపారీణయైన యాతని సతియున్. 71

ఉ. ఆ యువతీలలామ భువనైకవిమోహనలీల నాట్యముం
జేయును శిల్పిచెంగటను, జేయఁగ నావరనాట్యభంగిమల్
బాయక చూచి, చిత్తమున భావన చేసి, మనోహరంబుగా
నాయువశిల్పి యశ్మమున నాకృతిఁ గూర్చుచునుండు వానికిన్.72

* సీ.తు. కనుసన్నలన్ మెలఁగు కాంతుండు కడనుండ
మనమందు నుప్పొంగు మగువ నొకట,
విభుఁ డేఁగుదెంచు నావేళకుం దొడి, సెజ్జ
సంసిద్ధమొనరించు చాన నొకట,
వేళకున్ రాకున్న విభునికై మనమందుఁ
బరితపించుచు నున్న ప్రమద నొకట,
సంకేతమును జేర స్వామి రాకున్న స్మర
సంభ్రమార్తిని జెందు సకియ నొకట,
సంకేతములఁ గాంచి స్వామితనువందుఁ బొల
యల్కతోఁ బతిఁ దూఱు నతివ నొకట,
సంకేతముం జేర స్వామికై సంభ్రమం
బున జ్యోత్స్నయం దేఁగు వనిత నొకట,
ఆషాఢమాసాన నన్యదేశస్థుఁడగు
పతిఁ దల్చి కృశియించు పడఁతి నొకట,
ప్రణయకోపంబుచే వల్లభుని నెడసేసి
విరహంబుచే గుందు తరుణి నొకట,

* ఈపద్యమందు అష్టవిధశృంగారనాయికలు వర్ణింపబడినారు. ఈ నాయికాలక్షణములకు బ్రహ్మశ్రీ శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రులవారి కావ్యాలంకారసంగ్రహమును చూచునది.

తే.గీ. ఎదుట నటియించు మల్లిక - హృదయమందుఁ
బొదలఁజేసిన మూర్తులఁ బొదలఁజేసి
ఱాతియందున, రచియించె నాతఁ డెపుడు
క్షతిని గననట్టి శృంగార కావ్య మచట. 73

సీ. మల్లికాతనుకాంతిఁ గొల్లలాడుచు నున్న
కనకంపుగాంతుల గడపలుంచి,
మల్లికాధరసీమ మల్లాడు స్మితరీతి
నొరపైన ముత్తెంపుదెరలఁ గూర్చి,
మల్లికాదీర్ఘపక్ష్మద్వయంబునుబోలు
తపనీయమయమైన తలుపు లూన్చి,
మల్లికాధరకాంతి నుల్లసిల్లుచు నున్న
మాణిక్యతోరణశ్రేణిఁ బూన్చి,

తే.గీ. మల్లికాకపోలంబుల మాడ్కిఁ దనరు
చంద్రకాంతమణీమయసరణిఁ గట్టి,
అచ్చువోసిన యందమో యనఁగ మీరు
చైత్రగృహమును నిర్మింపసాగె నతఁడు. 74

* సీ. అశ్మ మొక్కటి కన్ను లరమోడ్చి ప్రియురాలి
పరిరంభసుఖమునఁ బరవశించె,
గ్రావ మొక్కటి నాసికాపుటంబులు విప్పి
ప్రియురాలి మల్లెల వలపు నానె,
ప్రస్తరం బొక్కటి హస్తాంగుళు లదల్చి
ప్రియురాలిఁ జెంతకుఁ బిలుచుచుండె,
పాషాణ మొక్కటి పాణిచేఁ బ్రియురాలి
చెక్కు లల్లనల స్పృశించుచుండె,

తే.గీ. ఊయి యొక్కటి మదిఁ బ్రియురాలిఁ గవయఁ
గలలు గనుచుండె నాచైత్రనిలయమందు,
శిలలకైనఁ బంచేంద్రియాస్తిత్వ మొదవు
ప్రాణదుండైన వరశిల్పిబ్రహ్మ యున్న! 75

ఉ. మైనమురీతి నవ్యమగు మార్దవమూనుచు టంకధాటికిన్
లోన నెసంగు నందమును లోకము మెచ్చఁగ వెల్వరించెఁ, బా
షాణచయంబు లయ్యెడను, జ్ఞానసుటంకనితేజితంబులై
జానగు సంస్కృతిన్ వెలికిఁజల్లెడు చేతములట్లు బెల్లుగన్. 76

ఉ. అంచితరీతిఁ బుష్పవనమందున నాట్యముసేయు మల్లికన్
పొంచి, రహస్యలీల వని పొంతను గల్గు గృహంబునుండి వీ
క్షించుచు గూళిదేవధరణీశుఁడు నించును గూర్మి, నించి యో
చించును శయ్య కాచెలువఁ జేర్చునుపాయముఁ బెక్కుభంగులన్. 77

## దౌహృదవర్ణనము

కం.తు. వారము లీగతిఁ గ్రమముగ
జారుచునుండఁగఁ గనుపడసాగెను మల్లికలో
సారపుఁజిన్నెలు కొన్ని న
వారంభవ్యంజకంబు లగుచున్ హృద్యముగన్. 78

ఉ. చెక్కుల శ్వేతవర్ణరుచి చెల్వువహింపఁగ, నంతెకాక ము
న్నెక్కడనుండెనో తెలియనేరని కౌ నొకయింత గన్పడన్,
చక్కని యానమందు నలసత్వపుఁజిన్నెలు గానుపింపఁగా
నక్కన నామెఁ జేరిచి ప్రియంబున జక్కన హేతు వారయన్ ... 79

* ఈ పద్యమును జక్కన నాయికానాయకులు గూడియున్న శిల్పములు చెక్కినాడని, అందలి నాయకులు వర్ణితవిధముగా నాయికల నుపలాలించుచుండిరని అన్వయించుకొనవలెను. అశ్మ,పాషాణ,ప్రస్తర,గ్రావ శబ్దములు శిలకు పర్యాయపదములు (పాషాణ ప్రస్తర గ్రావోపలాశ్మాన శ్శిలా దృషత్ - అని అమరము).

మ. దరహాసంబున నిండు మోము నొకయింతన్ వంచి మందాక్షపుం
దెరలో దూరిచి, వాలుఁగన్నుతుదలందే చేర్చి క్రొంజూపులన్,
బరివీక్షించుచు స్వీయమౌ యుదరమున్ భర్త్రాస్యమున్, భద్రసుం
దరమౌ వార్తను దెల్పె నాథునకు నాతన్వంగి యింపారఁగన్. 80

శా. ఆవార్త న్విని జక్కనాఖ్యుఁడును సర్వాంగీణరోమాంచుఁడై,
భావోదీర్ణముదుండునై, పొలిచె నక్షత్రశ్రేణిపైఁ జయ్యనన్
ద్యావాభూములఁ జుట్టివచ్చినటు, లాశాంతద్విపారూఢుఁడై
తా వాహ్యాళి యొనర్చినట్లును, మహాధన్యత్వముం గన్నటుల్. 81

కం.తు. ఫలవంతంబగు వల్లికపగిదిన్
పొలుపగు మల్లికఁ దిలకించుచు జక్కనయున్
ఫలితామ్రంబును బరికించు కృషీ
వలుచందంబునఁ బరమానందము నొందున్. 82

ఉ. వింతలువింతలై పరఁగు ప్రేయసి కోర్కెలు దీర్చు నాతఁ డొ
క్కింత కొఱంతలేక, చెలి కింత శ్రమం బొనగూడకుండఁ దాఁ
జెంతనె యుండుఁ దోడుగను, చెల్వగు గీతము లాలపించి యా
యింతిఁ బ్రసన్నఁజేయుఁ, మదికింపగు మాటలు వల్కు నెప్పుడున్. 83

కం. అన్యోన్యంబగు ప్రేమ మ
గణ్యంబయి యుండ నిట్లు గడచుచునుండెన్
ధన్యంబయి దివసంబు ల
నన్యాదృశసుఖమయముగ నాయుగమునకున్. 84

* * * * *

ఊలు దెచ్చుటకై జక్కన దూరప్రాంతమున కేగుట

ఉ. నిచ్చలు కర్మయోగివలె నిశ్చలచిత్తముతోడ బొమ్మలం
బొచ్చెములేక చెక్క నయిపోయెను జక్కనశిల్పి మున్నుగం
దెచ్చిన రాల్ సమస్తమును; తేగ మఱింకను శిల్పయోగ్యమై
హెచ్చెడు రాల్ బిరాన, నతఁ డేఁగెను దూరమహీధ్రసీమకున్. 86

తే.గీ. ఎన్నిసారులు ఊలకై మున్ను దాను
కాననంబున కేఁగలే దైన నిపుడు
తనువు మాత్రమె తనతోడఁ దరలివచ్చె;
ఎడఁద మాత్రము మల్లిక కడనె యుండె. 87

చం. మఱవఁగఁ గల్గునా నిముషమాత్రము, దాను గృహంబు వీడుచో,
బొరలుచుఁ జెక్కులందు నునుముత్తెములట్లు, పయోధరాద్రులం
బెరసి విశీర్ణమాణమగు మేదురబాష్పకణంబు లుర్లఁగా
నరుణములైన కన్నులను నధ్వముఁ గాంచెడు మల్లికాకృతిన్. 88

చం. 'అబలను, ప్రేయసిన్, సుమసమాంగిని, నూత్నకుటుంబినీమణిన్,
[1] శబరవిభీతరఙ్కుసమచంచలనేత్రను, దౌహృదాన్వితన్,
ప్రబలతరప్రియాప్తిమెయిఁ బ్రక్కనఁ బాయక చేరి కొల్వఁగా
సొబగగుఁగాని యిట్లు వనిఁ జొచ్చుట చెల్లునె భర్త కారయన్.' 89

మ. అని చింతించుచు నాతఁ డాచెలినె నిధ్యానించుచు న్నిత్యమున్,
ఘనమై తోఁచెడు రాజకార్యమునకుం [2] గాలొడ్డగాలేక యె
ట్లనొ [3] కాంతారమునం దనుక్షణము కల్పాభీలమై చెల్గఁగ
న్మనెుచుండెం గణియించుచున్ బ్రియను జెందంగల్గు[4] తద్ఘస్రమున్. 90

1. శబరవిభీతరఙ్కుసమచంచలనేత్రను = వేటకానిచే భయపెట్టఁబడిన లేడివలె చలించు కన్నులు గలదానిని (ఇందు భావికథాధ్వనిని గమనించునది); 2. కాలొడ్డగాలేక = విఘ్నముసేయగా లేక; 3. కాంతారము = దట్టమైన అడవి; 4.తద్ఘస్రమున్ = ఆ దినమును (ఘస్రో దినాహనీవాతు క్లీబే దివస వాసరౌ - అని అమరము).

ఆ.వె. అంతెకాక యాతఁ డంధుఁడైన తనదు
పితను దలచి యెదను వెతను బొందు;
అతని సేమ మెట్టు లర్ధాంగి చూచునో
యనుచు నాత్మలోన వనట నొందు. 91

గూళిదేవుఁడు మల్లిక నాహ్వానించుట

ఉ. కంటికి ఱెప్పవోలె నిజకాంతను గాచుచునున్న శిల్పి యి
ప్డొంటరిగా వనంబునకుఁ బోయెనటంచు నెఱింగి వెంటనే
తుంటరి గూళిదేవుఁడు తదుజ్జ్వలగాత్రను రాజమందిరం
బంటగఁ దోడితెచ్చు వెరవారయుచుం, గని యొక్కదాసినిన్. 92

తే.గీ. దాని చెవియందెదో చిల్కి తత్క్షణంబ
మల్లికాసతి కడకేఁగు మనియె దాని;
అదియు సోపహారంబుగా నామెఁ గాంచి
యిట్లు వల్కెను మధురోక్తు లెసకమెసఁగ. 93

ఉ. 'ఓరమణీయనర్తనమయూరిక! మల్లిక! సంజ్వరార్త్తయై
చేరఁగరాదు నేఁడు [1] మహిషిం బ్రతినిత్యము నర్తనంబుచే
వారక తన్పు రాజనటి, [2] భావిని! యయ్యది కారణంబుగాఁ
గూరిమిఁ బిల్వఁబంచె నిను గొండ్లియొనర్పఁగ రాణి సన్నిధిన్. 94

చం. వినుటయె కాని నీదు నటవిద్యను రాణి యితఃపురంబుగా
గనుటకు నోచుకో దిదియుఁ గారణమయ్యెను నిన్నుఁ బిల్వ నో
వనజదళాక్షి! యింక మది వందక సుందరనాట్యగుంభనం
బున మహిషీమణిం దనుపఁబోలును, మేలును గాంచఁగాఁదగున్.' 95

1. మహిషి = పట్టపురాణి (కృతాభిషేకా మహిషీ – అని అమరము); 2. భావినీ = అందకత్తె (సార్థకపదము)

కం. అని యాహ్వానముఁ బల్కెడు
వనజాక్షీమణి మనోజ్ఞవాక్చతురిమకుం
దనియుచు మల్లిక యాగతి
మనమం దొకయింతసేపు మంత్రముసేసెన్. 96

ఉ. `కాంతుఁడు చెంత లేడు తగు కార్యముఁ దెల్పఁగ, రాణిపంపు మ
న్నింతున? నింతునా చెలిమి? నేరకయున్నఁ దదాగ్రహాగ్ని నే
వంతలపాలు గావలసివచ్చునొ? కాంతుని కబ్బినట్టి శ్రీ
మంతము రాజపోషణము మాయునొ దీని నిరాకరించినన్! 97

తే.గీ. అంతిపురిలోన నర్తనం బనుటచేత
సారపరిచారికాజనచయముతోడఁ
గొల్వుదీఱిన యారాణి కొల్వునందె
నాట్యమగుఁగాన నిది యవజ్ఞదము గాదు! 98

తే.గీ. ఐన గుర్విణి నౌట సాధ్యంబు గాదు
నాట్యమాడంగ నాకంచు నచ్చజెప్పి
అంపుదును దీని నేదోస మంటకుండ`
ననుచు యోచించి మల్లిక యనియె నిట్లు. 99

కం. `వనితా! గుర్విణి నౌటను
జనపతిసతి యానఁ దీర్పఁజాలను, దానన్
వినయంబున నీవార్తను
వినిపింపఁగ రాణి కిపుడు వేఁడెద నిన్నున్. 100

తే.గీ. మహిషి యానతిఁ గాదని మనఁగఁ గలనె?
ఐన నది గర్భమందున్న భ్రూణమునకు
హానికరమగుఁ గాన నాట్యంబు నాడ
లే, నిది గ్రహించి తెల్పుమా రాణి కిపుడు.` 101

చం. అనవుడు రాజదాసియు ధరాధిపతిం దరిసించి పల్కె, 'గ
ర్భిణియగు కారణంబున ధరేశ్వర! నాట్యము సేయఁనేరఁగా
జన నని పల్కె మల్లిక, నిజంబుగఁ దోఁచెను నాకు నద్దియున్
నునుపగు చెక్కులం దెలుపు నూల్కొనుటన్, నడుమింత దోఁచుటన్. 102

తే.గీ. పండువెన్నెల లొల్కెడు నిండు చంద్రు
నతకరించుచునుండె నా యతివ మోము,
హంసపోతంపు గమనంబు నతకరించు
చుండె నాయింతి యలసంపు సుగతిరేఖ. 103

కం. భూతలనాయక! చేకురె
నాతరుణీతనువున నిపు డనుపమమై ము
న్నే తరుణీతనువందును
ఖ్యాతముగానట్టి యంద మాశీర్షముగన్. 104

తే.గీ. ఉండె నెట్టి శక్తియొ యామె యుదరమందు,
తత్ప్రభావంబుచే నామె తనువ దెల్ల
నిండుచంద్రునికాంతిలో నిగ్గులొల్కు
పాలరాతి ప్రతిమవోలెఁ బ్రభలఁ జిల్కె. 105

తే.గీ. పుటముపెట్టిన బంగరు పొలుపు మీరి
గర్భసంప్రాప్తిచే నామె కాయమెల్ల
పూర్వదృష్టము గానట్టి పూర్ణకాంతిఁ
బూని యతిలోకచారుతాస్థాని యయ్యె.' 106

తరలము. అనుచుఁ బల్కెడు దూతివాక్యములందు విన్పడు మల్లికా
తనుమనోజ్ఞత మాత్రమే తన ధ్యానమందున నిల్పుచున్
మనుజనాథుఁడు పాపభీతిని మాని దౌహృదమాన్య యం
చును దలంపక యామెఁ గూడఁగఁ జూచుచుం బలుభంగులన్. 107

కం. తలకక పరసతి యనుచుం
దలపక గుర్విణి యనుచును, ధరణిపుఁ డంతన్
నెలఁతుక నెటులైనను దన
తలిమంబునఁ జేర్చుకొనఁగఁ దహతహపడుచున్. 108

ఖండగతి. చెంతకున్ రావించి చెలికత్తె చెవిలోన
స్వాంతమున సద్యోభవంబగుచు నున్న
నూతనాదేశమున్ నూరిపోసెను రాజు;
దూతియున్ వల్లెయని తొలఁగి చనె నంత. 109

ఉ. ఈ తెఱఁ గేఁగి దూతికయు నిష్ఠురసోపమమైన వాక్కులం
జేతముఁ బల్లవింపఁగను జేయుచు మల్లికతోడఁ బల్కె, 'నో
శీతకరోపమాలిక! విశేషముఁ దెల్పితి రాజ్ఞితోడ, నా
నాతియు నంత సంతసిలి నన్నిట కంపెను వెండి బిల్వఁగన్.' 110

ఉ. 'చక్కని జాణలందుఁ గడుచక్కని దాన వటంచు, నాట్యమం
దెక్కుడులేనిదాన వను చెల్లరు బల్కగ విందుఁ గాని, ని
న్నొక్కపరిం గనుంగొనఁగ నోపను మల్లిక! అందుచేత నిన్
మక్కువమీర నేటి నిశి మా నిలయంబునఁ జూడఁ గోరెదన్. 111

ఉ. అంతియకాక మంజులలతాంతసమంచితమైన మల్లికా
కాంత ఫలోన్ముఖం బయిన కైవడి నీవును బ్రాప్తసత్త్వవై
కాంతివహించి యుంటివను కమ్మనివార్తను వింటి, నప్డె ఏ
కాంతమునందు నిన్ బిలిచి కానుక లివ్వఁగఁ గంటి నాత్మలోన్. 112

ద్వి.తు. ఆపన్నసత్త్వలై యలరారుచున్న
ఆశ్రితస్త్రీల కాహ్వానముం బల్కి
పరితోషమిచ్చు టగుఁ బట్టంపురాణి
కనువైన ధర్మ మీ జనపదములోన. 113

ఉ. కాన లతాంగి! నేటి నిశఁ[1] గైరవమిత్రుఁడు పూర్ణుఁడౌచు సం
ధ్యాననమందుఁ బొల్చుతరి నందల మొక్కటి సాదరంబుగా
నేనిదె పంపుదాన, ముదమెచ్చఁగ నచ్చరవోలె నందునన్
యానమొనర్చి మాదు నిలయమ్మున కిమ్ముగ నీవు రాఁ దగున్.114

తే.గీ. ప్రసుమితాబ్జినీయుత సరోవరమువోలె,
తరళచంచలాన్విత వియత్పథమువోలె,
త్వత్తనూప్రభచేత శుద్ధాంతమెల్ల
భవ్యసౌందర్యదీప్తమై పరఁగుగాత!` 115

తే.గీ. అనుచు నీ కెరిగించి రమ్మనియె నన్ను
అవనినాథునిరాణి యత్యాదరమునఁ,
గాన దీని నుల్లంఘింపఁ గాదు నీకు
రాణిపనుపును దీర్పుము రాజవదన!` 116

తే.గీ. స్వాదుభాషల నీరీతిఁ బలుకుచున్న
అతివపల్కులు సత్యంబు లనుచు నమ్మి,
మహిషియానతి యవిలంఘ్య మనుచుఁ దలఁచి,
మల్లికాసతి యీరీతి మగుడఁ బలికె. 117

తే.గీ. `మల్లనార్యులు మాకూర్మి మామగారు,
వారనుమతించిరేని మీ పట్టమహిషి
వాంఛితంబును దీర్పంగ వత్తునమ్మ!
అరయుచుండుము, త్వరలోన నడిగి వత్తు!` 118

తే.గీ. అనుచు మల్లిక మల్లన నరసి యపుడు
విషయ మెఱిఁగించి యతని దీవెనలఁ గోరె;
అతఁడు పూర్వాపరంబుల నాత్మ నెంచి
అంతిమంబునఁ బొమ్మని యనుమతించె. 119

1. ఇట్లు చెప్పుట వలన అది పూర్ణిమారాత్రియని గ్రహించునది.

## ప్రదోషవర్ణనము

సీ. రోదసీమరుధరా ప్రోల్లసిత మృగతృ
ష్ణాదృష్ట లోహితసలిల మనఁగ,
సద్యో నృహర్యక్ష సంశీర్ణ రక్ష స్త
నుస్యంది రక్తసందోహ మనఁగ,
గగనాటవీలగ్న ఘనదవానలశిఖా
సాంద్రారుణప్రకాశంబొ యనఁగ,
పశ్చిమాశాహార్య బహుకందర వ్యక్త
గైరికద్రవఝరీకాంతి యనఁగ,

తే.గీ. తామసాత్ముని చిత్తంపుఁజిత్ర మనఁగ;
ఆగ్రహంబున కిడినట్టి యర్ఘ మనఁగ,
అరుణమై నిండె భూనభోఽంతరము లందు
సాంధ్యవిద్యుతి యంతలో సాంద్ర మగుచు. 120

కం. ఆ సమయంబునఁ గన్పడె
వాసిగ రాగావృతమగు వపుషంబులతోన్ -
వేసరిక లేక కాకా
బాసలఁ బలుకుచుఁ జరించు ధ్వాంక్షము లైనన్. 121

తే.గీ. * జతను వీడుచుఁ జనినట్టి పతినిఁ దలఁచి
ప్రాపులేక కుందెను చక్రవాకకాంత;
ఎట్టిబడి యక్షిగతుఁడైన యినునిఁ జూచి
పక్ష్మముల మూసె పద్మినీపద్మనేత్ర; 122

* ఈ పద్యమున మల్లికాపరిస్థితి ధ్వనితమైనది. చక్రవాకిస్థితి యామె పరాధీనస్థితికి ప్రతిబింబము. పద్మినీస్థితి యాగామిపరిస్థితికి ప్రతిబింబము. ఎట్టిబడి = (దుర్భరమగు ననురాగముచే గాని యాగ్రహముచే గాని) ఎట్టినై, అక్షిగతుడైన = కంటబడిన, లేదా కంటిలోని నెఱుసువలె బాధించువాడైన (ద్వేష్యే త్వక్షిగతః - అని అమరము); ఇనుని = భర్తను, రాజును; పక్ష్మములన్ = పూఱేకులను, ఱెప్పలను; పద్మినీపద్మనేత్రి = కమల ములవంటి కన్నులుగల పద్మినీజాతిస్త్రీ (రాజపరముగ), కమలములే కన్నులుగా గల పద్మలత (భర్త పరముగా).

తే.గీ. [1] అంత నుదయాద్రికాననంబందు నున్న
ఎఱుపుగన్నేరు పూచిన విరులచెండొ
ముసిఁడిచెట్టునఁ బండిన మిసిమిపండొ
యనఁగఁ దూర్పున రాకాశశాంకుఁ డొదవె. 123

తే.గీ. సాంద్రచంద్రికాశాటిక చాటునందు
ఎంత దాఁగిన నేమయ్యె? నిందునందు
సహజమై యొదవిన కళఙ్కంబు మాత్ర
మనపగతమయి సందృష్టమగుచు నుండె. 124

మల్లిక రాజప్రాసాదమున కేగుట

ఉ. అప్పుడె మల్లికాగృహముఖాంగణమందున వచ్చి నిల్చె నిం
పొప్పెడు [2] యాప్యయానము; సముజ్జ్వలభూషణభూషితంబునై,
యప్పుడె కోసినట్టి కుసుమావళిచేత సమంచితంబుగాఁ
గప్పిన యట్టిదై పరఁగు కాంచనయాన మనన్యసామ్యమై. 125

తే.గీ. దానినుండి డిగ్గిన దొక్క తరళనయన;
చేత సుమగుచ్ఛముం బూని చిన్నినడల
లోనికిం జని, వచ్చిన దాననాన
సంస్మితం బొల్క మల్లికాసహిత యగుచు. 126

సీ. తెల్లవెన్నెలఁబోలి, తెలిమల్లెలంబోలి
మెఱుఁగారు క్షౌమంబు మేనఁ గట్టి,
నీలమేఘముఁబోలి, నెమలిపింఛముఁబోలి
వెలుగొందు కురులందు విరులు దాల్చి,
సౌదామనింబోలి, సద్గణంబులబోలి
తులకించు మణివిభూషలను దాల్చి,
పంకజంబులఁబోలి, పల్లవంబులఁబోలి
భాసిల్లు పదములం బావ లుంచి,

తే.గీ. నొసట సురభిళతిలకంబు నెసఁగఁ దీర్చి,
కనులయందునఁ గాటుక నొనరఁ బెట్టి,
చెవుల వజ్రంపుగమ్మల దొవను బొదవి,
మల్లికాసతి నడయాడె మంజులముగ. 127

తే.గీ. చెలువ లిర్వురు సుఖముగ శిబికయందుఁ
గూరుచుండిరి; యంతటఁ [3] గొప్రములను
బల్లకినిఁ బూన్చి శైబికు లల్లనల్ల
నడవఁజొచ్చిరి రాడ్భవనంబు వైపు. 128

ఉ. అందముఁ జిందు పుష్పవన మయ్యది; అందునఁ జెల్వునందుఁ బౌ
రందరమందిరంబుగతి రమ్యనృపాలకమందిరంబు; త
న్మందిర [4] తోరణాంతికమునందున నిల్చిన దంత మల్లికా
సుందరిఁ దోడితెచ్చిన వసుంధరనాథుని యందలం [5] బొగిన్. 129

తే.గీ. అంత మున్నుగ దిగి నిర్మలాఖ్యమైన
దూతికాకాంత తనకుఁ జేయూత నొసఁగ,
పద్మపీఠిని డిగుచున్న పద్మవోలె
పల్లకిం డిగి మల్లికాపద్మవదన. 130

తే.గీ. ప్రాంగణంబును దాఁటి రాయంచనడల
భూపమందిరమ్మును జేరఁబోవు నపుడు
పుల్కుపుల్కున మల్లికాముఖముఁ గాంచి
అనియె నిట్టుల నిర్మల యామెతోడ. 131

1. ఈ పద్యమునందును, తరువాతి పద్యమునందును చేసిన చంద్రవర్ణనములందు గూళిదేవుని స్వభావము ధ్వనితము. ముసిఁడిచెట్టు = విషముష్టిచెట్టు; గన్నేరుపూలును, ముసిడిపండును ప్రాణాపాయకరము లగుట గమనించునది; 2. యాప్యయానము = పల్లకి, శిబిక (శిబికాయాప్యయానం స్యాత్ - అని అమరము); 3. కొప్రము = కొప్పరము = మూఁపు (కొప్పరము, మూఁ, పటంచన నొప్పు నంసము - అని ఆంధ్రభాషార్ణవము); 4. తోరణము = బహిర్ద్వారము (తోరణోఽస్త్రీబహిర్ద్వారమ్ - అని అమరము; పుష్పమాలాదికాదులు గట్టుటకై ఇంటి వెలుపల స్తంభద్వయముచేత ద్వారమువలె గట్టబడునది తోరణము); 5. ఒగిన్ = చక్కగా, లెస్సగా.

తే.గీ. `అమ్మ! మల్లిక! యెన్నియొ యమరుచుండు
ఊహకందని వ్యూహంబు లుర్వియందు;
వలను జిక్కెడి మీనంబు పగిదిఁ గాక
వాని నధిగమించుటె యౌను జాణతనము!` 132

తే.గీ. అనెడి పల్కుల యాంతర్య మాత్మలోన
నూహసేసెడు నంతలో నుర్వరేశు
మందిరద్వార మాసన్నమయ్యె, దాన
నన్యచింతన మాని వయస్యతోడ
మల్లికాసతి సొచ్చెను మందిరంబు: 133

నృపాలభవనవర్ణనము

కం. ఈవిధిఁ జని మల్లిక కనె
దేవేంద్రపురీంద్రవిభవదీప్తం బగుచున్
సేవధి యగుచుం గళలకుఁ
బ్రావీణ్యంబగు నృపాలభవనాంతరమున్. 134

తే.గీ. భిత్తికలయందు నిలువెత్తు చిత్తరువులు
పొందుపఱుపఁబడిన వందు నందముగను;
చూరునందుండి వ్రేలాడుచున్నవందు
సుందరములైన * చాందినీ లందునందు. 135

తే.గీ. రతినిఁ దలదన్ను సుతను భారతినిఁ జేసి,
వావివరుసలఁ దలపక వలపుఁగొనుచు,
నామె నక్కునజేర్చెడు నబ్జభవుని
చెయ్దమును జూచి నవ్వెడు చిత్తభవుని, 136

* చాందినీ = Chandelier

తే.గీ. గౌతమునిఁ బంపి నదిని విగాహమాడ,
నతనిభార్య నహల్యను నంకమందు
జేర్చికొను సహస్రాక్షుని చేష్టలెంచి
నిండువేడ్కను గర్వించు ఖండశరుని, 137

తే.గీ. వశముదప్పిన వలవంత వచ్చియున్న
గురునిపత్నిని గాఢోపగూహనములఁ
జొక్కఁజేయుచుఁ దాఁజొక్కుచున్న విధునిఁ
జూచి మీసలం దువ్వెడు సూనశరుని, 138

తే.గీ. పుష్పకంబున వాహ్యాళిఁ బోవునెడల
ఎదురువచ్చిన రంభను నదిమిపట్టి
ఎదను జేర్చికొనియెడి లంకేశుఁ గాంచి
సంతసంబునఁ జప్పట్లు చఱచు మరుని, 139

తే.గీ. అబ్జభవు నోలగంబున కరిగివచ్చు
శుక్తిమతి నతిలాలసాసక్తుఁ డగుచు
నడ్డుకొని రమియించు నాహార్యరాజు
దొడ్డతనమును గొనియాడు తుంటవిల్తుఁ, 140

తే.గీ. బెక్కుభంగుల మందిరభిత్తులందు
వ్రాసినారందుఁ, దచ్చిత్రవైభవంబుఁ
గాంచ రేకెత్తు వాంఛలు కంటిమంట
మున్ను మరునిఁ గాల్చిన యష్టమూర్తికైన. 141

మత్తకోకిల. పాలసంద్రమునందుఁ బొల్చెడు పాఁపరాయనితల్పమున్
బోలి యందున నందమౌ నొక పూలపాన్పు విశాలమై;
క్రాలు నయ్యది దేవదారువు కాష్ఠమందున దంతపుం
బూలఁదీవెలఁ గూర్చి కూర్చిన భూరిమంచతలంబునన్. 142

ఉ. ఆరమణీయతల్పమున కంతికమందున ధూపధానులన్
సౌరభధూపధూమములు సౌరువహించును; స్వర్ణపాత్రలన్
సారపు భక్ష్యభోజ్యములు, చల్లనిమద్యము లొప్పు, బుట్టలం
గైరవకేతకీప్రియకకాంచనముల్ హసియించు నింపుగన్. 143

తే.గీ. తల్పభూమికిఁ బ్రక్కగా నల్పమైన
కుట్టిమము గల్గు, నందునఁ గోమరుమిగులు
నంచయీకలదిండుల నలరుచున్న
కాంచనాసనంబులు మనోజ్ఞంబు లగుచు. 144

కం. ఆ యాసనముల కెదురుగ
నాయతమగు నొక గవాక్ష మలరుచునుండున్
తోయజశత్రుఁడు చిల్కును
తీయని సుధ లందునుండి తెల్లనిరేలన్. 145

ఖండగతి. అట్టి యాసనమందు నధివసింపఁగఁ జేసి
మల్లికాసతి నెంతొ మర్యాద మీరంగ,
'ఏలువారికిఁ దెల్పి యిదె వత్తు' నని పల్కి
లోనికేఁగెను నిర్మలానీరజదళాక్షి. 146

ఉ. చల్లని సోగవెన్నెలలఁ జల్లుచు సోరణగండినుండి, యా
మల్లికయున్న భూమిని హిమాంశుఁడు మంజుసుధాస్రవంతిగా
నుల్లసిలంగఁజేయఁగఁ, దదుజ్జ్వలగాత్రియుఁ బొల్చెనంత నా
వెల్లువలోనఁ దేలెడు నవీనసుహల్లకవల్లియో యనన్. 147

ఉ. అందునఁ గూరుచుండి, ముఖమందునఁ దన్గనుచున్న తల్పమున్,
పొందగు భోగ్యవస్తుచయముం బరికించి, తదీయదృశ్యమున్,
ముందుగ నిర్మలాముఖసముక్తములైన వచస్సులన్, మనం
బందు సమన్వయించి, కుముదానన విస్మయ మందుచుండఁగన్. 148

## గూళిదేవుఁడు మల్లికను బలాత్కరించుట

ఉ. మెల్లగఁ దల్పులం దెఱచి మీసముదువ్వుచు గూళిదేవభూ
వల్లభుఁ డామె చెంత నిలువంబడె, ద్రౌపదిచెంత మత్స్యభూ
వల్లభుస్యాలకుండు నిలువంబడినట్లుగ మున్ను, రామభూ
వల్లభుసాధ్వి చెంతను [1] క్షపాచరనాథుఁడు నిల్చినట్లుగన్. 149

చం. జనపతి యట్లు నిల్వ జలజాయతనేత్ర భయాదరంబు లా
త్మను బెనగంగఁ గాంచి త్వరితంబుగ నిల్చొని యానతాస్యయై
ఘనకుచయుగ్మ మించుక [2] ముఖంబునకుం గదలంగ నమ్రయై
వినయముతోడ మ్రొక్కె నరవిందకరద్వయి నల్ల మోడ్చుచున్. 150

ఉ. ఆచెలి నమ్రయైన తరి నగ్రముఖంబయి తోఁచు సొంపులన్
జూచుచు నేకచిత్తమున [3] సూనశరాస్త్రవినిఘ్నవర్తుఁడై
వాచవులైన పల్కులను వాకొనెఁ బార్థివుఁ డిట్లు, 'మల్లికా!
చూచెదవేల త్రస్తవగుచు, న్నిఁకఁ గూర్చొను మాసనంబునన్. 151

కం. క్రీడాపురమున ని న్నే
నాఁడీక్షించితినో కాని నాటంగొలెన్
పీడదు నను మన్మథరుజ
పీడుపఁగా దీనిఁ దగిన వెజ్జువు నీవే!' 152

కం. అని మల్లికఁ గూర్చొనగం
బనిచియుఁ, దా నభిముఖముగ భద్రాసనమం
దున నాసీనుండయ్యును,
జననాయకుఁ డిట్లు పల్కెఁ [4] జకితేక్షణతోన్. 153

1. క్షపాచరనాథుఁడు = రాత్రించరనాథుడైన రావణుడు; 2. ముఖంబునకున్ = ముందరికి; 3. సూనశరాస్త్ర వినిఘ్నవర్తుడై = మన్మథుని బాణముల కఠినమైన నడవడిక గలవాడై; 4. చకితేక్షణ = భయముతో గూడిన చూపులు గలది ( ఇది సాభిప్రాయ పదము)

ఉ. 'రాచటికంబు గల్గినను, రాజనిభాస్యలు వేయుఁ గల్గినన్,
వాచవియైన భోజ్యములు ప్రాప్తములైన నహర్నిశంబులున్,
పూచినతీవ నాట్యములఁ బొల్పెసలారు వనంబు లుండినన్,
నీచెలి మేది యీ భవము నీరజనేత్రిరో, శూన్యమయ్యెనే! 154

ఉ. నీరుచిరాంగకాంతిఝరి నిచ్చలు మున్గఁదలంచు గాత్రమున్
నీరుచిరోక్తిమాధురికి నిచ్చలుఁ జొక్కఁదలంచు శ్రోత్రమున్
నీరుచిరాధరామృతము నిచ్చలుఁ గ్రోలఁదలంచు నోష్ఠమున్
నేరగలేను నాపఁగను, నృత్యకళానిధి! నన్నుఁ బ్రోవవే! 155

ఉ. నీ పరిరంభకుంభమున నిస్రుతమైన సుఖంబుఁ గ్రోలఁగన్,
నీ పదనూపురోదితసునిస్వనిగీతుల నాలకింపఁగన్,
నీ పరిణద్ధబర్హమున నిల్చిన మల్లెలతావి నానఁగన్,
నీపలతాకృశాంగి! మది నిచ్చలు నువ్విళులూరుచుంటినే! 156

ఉ. ఓమదహంసయాన! మును పూర్వశికౌఁగిలిలోఁ బురూరవుం
డామరసౌఖ్యముం గనినయట్లును, జొక్కుచు రంభకౌఁగిటం
గామరసాబ్ధిపారమును గాంచినయట్లుఁ గుబేరసూనుఁడున్
గామమహత్త్వసారమును గాంచఁగనిమ్మిక నీదుకౌఁగిటన్.' 157

కం. అని మదనార్తుం డగుచున్
వినీతుఁ డగుచుం బలికెడు పృథ్వీపతికిం
గొనకొని ధైర్యంబూనుచు
ననియెను మల్లిక యిటు నిశితాలాపములన్. 158

ఉ. 'కంచెయె చేను మేసెనను కైవడి మీరె యధర్మవర్తులై
వంచనసేయఁగాఁ దగవె పార్థివపుంగవ! రాణి నన్నిటం
గాంచఁగ నెంచెనంచు మృష కల్పనసేసి, నిశీథమందు రా
వించి నితాంతమోహభరవిహ్వలితాత్మఁ బలాత్కరింతురే! 159

కం. పరదారను, గుర్విణి నని
కరుణం బాలింపఁగఁ దగు క్ష్మాపతు లిటులం
మరుబారికి గురియయి ధ
ర్మరహితపథమునఁ దగులుట మాన్యంబగునే! 160

ఉ. పూటకుఁ దిండిలేక, మెయిఁ బూనఁగఁ బుట్టములేక, యెంద ఱీ
నాటను పాటులంబడరు? నాపయిఁ గల్గిన కామమెల్ల నీ
కూటికిలేనివారి వెతఁ గొంతగనైనను దీర్పఁజాలు తో
డ్పాటుగ, జాలిగా, దయగ, పార్థివపుంగవ! మార్చుకోఁగదే! 161

కం. పరదారాగమనముచే
నరవర! లాభించు నెద్ది నరకము దక్కన్,
సరసీరుహదళసంస్థిత
తరళపృషంతులె యగుఁగద తరుణీసుఖముల్!' 162

మ. అనుచుం బల్కఁగ గూళిదేవనృపుఁ డయ్యంభోజపత్రాక్షినిం
గనుగొంచుం గడకంటఁ, బల్కెను, 'త్వదుక్తంబైన కారుణ్యమున్
ఘనమౌ ప్రేమను జేర్చి యొక్కటను నిన్ గావంగ నేనెంచి సౌ
మనసప్రాభవ మొప్పు మత్పురికి రమ్మంటింగదా యీనిశిన్!. 163

తే.గీ. అతులకోమలమంజులంబైన యట్టి
విభవముం గన్న యెలగులాబీకి నిలను
శాతకర్కశకంటకశాఖ ఊత
యైన విధమును దలపింతు వతివ నీవు! 164

తరలము. అల శిరీషపేశలమైన దేహపు టందచందములం గనన్
శిలలు దొల్చెడు కాసెవానికిఁ జిత్తమెట్లు చిగిర్చెడిన్?
కళలనేలెడు మమ్ముఁ గాదని కాయకష్టముసేయు నా
యలతివానికి దక్కె యేసుఖ మందనెంచితొ మల్లికా! 165

ఉ. కావున నోలతాంగి! నయగారము, గారవమున్ రహింప నిం
కేవిధి చింతసేయక యహీనవిభూతియుతున్, రసజ్ఞు, కాం
తావరణీయు, నన్ను, విబుధాధిపవైభవుఁ, గూడి మవ్వపుం
బూవులపాన్పులన్ వలచుపూఁబొదలన్ గనుమింక సౌఖ్యముల్.' 166

మ. అని యుచ్ఛృంఖలమైన మోహమున నాస్యశ్రోత్రనేత్రంబులున్
హనుయుగ్మంబును గంద, సాఁచి కరిహస్తాయామదోర్యుగ్మమున్
వనితారత్నము లేవనెత్తుచు, నయఃపట్టంబునుంబోలు స్వీ
యనతోరఃస్థలియందుఁ జేర్చికొనె గోత్రాధీశుఁ డుద్రేకియై. 167

కం. మదకరిహస్తహృతంబయి
యదవదఁజెందెడు లలితలతాంగనఁబోలెన్
హృదయంబునఁ బ్రసభంబున
నదిమికొనన్ నృపుఁడు గుందె నామెయు మిగులన్. 168

చం. అతిరయవాతధూతమృదులాల్పసరోజినివైఖరి న్మహీ
పతి బలవత్తరంబుగను వక్షమునందునఁ జేర్చికోఁగ నా
యతివయుఁ గుందు చానృపుని యక్కునుండి తొలంగు చల్లనన్
జతురవచోమరందములు సల్లుచుఁ బల్కెను నిట్లు రాజుతోన్. 169

ఉ. 'భూవర! మీదువైభవము, భూతియు, రూపముఁ, గన్నయంతనే
యేవిరిబోణి బాధకుసుమేషుశరానలదగ్ధచేతయై
మీవశవర్తియై చనదు? మేకొని నామన మట్లుగాక యెం
తోవడి తామసించుటకుఁ దోఁచుచునుండెను హేతు వొక్కటే. 170

కం. వసుధాధిప! యిలఁ గల్గిన
రసికాగ్రేసరుల కెల్ల రాజగు మీకున్
రసికతఁ గలుపఁగ నాకున్
వశమౌనే? ఐన నొక్క వాక్కును వినుఁడీ! 171

తే.గీ. పసరుమొగ్గయై ప్రభవించి, పైని దోర
మొగ్గయై పొల్చి, యాపైని నగ్గలముగ
విరియు పుష్పము తెఱఁగున విరియవలెను
క్రమముగాఁ గాంతునందునఁ గాంతవలపు! 172

తే.గీ. నామనం బిట్టి దౌటచే భూమినాథ!
ఇపుడు పసరుమొగ్గగ జనియించియున్న
వలపు నిండార విరిసెడు వ్యవధి నిండు;
మీ ప్రణయరాజ్ఞినై కూర్తు మేలు నెపుడు. 173

చం. ప్రతిదినమందు 'నన్ బిలువఁబంచెను రాణి' యటంచు మామకుం
బతికినిఁ బ్రత్యయంబొదవఁ బల్కి యవశ్యము మిమ్ముఁ గూడుచున్
రతిపతిసేవసేయఁగ ధరాధిప! వత్తును; దీన లోకు ల
న్యతరుణిఁ గూడుచుండె నృపుఁడంచుఁ దలంపమి మీకు మేలగున్. 174

చం. క్రమముగఁ బ్రాకు తీవవలె రాగము పెంపువహింప నీగతిన్
సుమమృదుతల్పసీమలను, సుందరపద్మసరోవరంబులన్,
ప్రమదవనంబులందునను, పాండురపార్వణరాత్రులందునన్
సుమశరు నర్చసేతము రసోద్ధురవృత్తిని భూమివల్లభా! 175

కం. ఐనం గలదొక విన్నప
మో నరనాయక! దయాపయోనిధులని పే
రూనిన మీకిది భారము
గానేరదనుచు వచింతుఁ గారవ మెసఁగన్. 176

ఉ. దీను, ననన్యబాంధవుని, డెబ్బదియేండ్ల ప్రవృద్ధునిన్, పరా
ధీనుని, నంధు, నాప్తుని, మదీయధవుం గనినట్టివాని, నే
నీనిశి నొంటిగా విడిచి యిచ్చటికిం జనుదెంచితిన్, క్షుధా
ధీనుఁడు, నార్తుఁడై యతఁడు డెప్పిటికంబును బొందుచుండెడిన్. 177

తే.గీ. ఆర్తుఁడై యున్న శ్వశురుని నాదుకొనఁగ
సత్వరమె యేఁగవలె నేను క్ష్మాతలేంద్ర!
ఆర్తరక్షణంబునకంటె నన్యమైన
ధర్మ మేదియు లేదుగా ధరణిలోన! 178

కం. రతిపతిపై, ఋతుపతిపైఁ
బ్రతినంగావించి నిజము వల్కుచునుంటిన్,
గుతుకంబున ఱేపటినిశిఁ
గుతలాధిప! వత్తు మగుడఁ గూడఁగ మిమ్మున్.' 179

కం. అనుచున్ నృపు నొడఁబఱచియు,
వనజాక్షీమణి ఝటితిగ పార్థివభవనం
బును గడచియు, నిజసదనం
బునకుం జని, బాష్పసిక్తముఖసారసయై. 180

ఉ. ధరణిపు తీరు మామకు యథాస్థితిగన్ వివరించి, యెంచి మున్
జరుగఁగలట్టి కీడును, కుశాగ్రమతిన్ వెస రాత్రియందె యా
పురముఁ దొరంగి యేఁగుట విభూతికరంబగునంచు నెంచి, యా
తరళమృగాక్షి మల్లనయుతంబుగ సత్వరమే ప్రయాణమై. 181

కం. ప్రత్యయితుండును, హితుఁడగు
భృత్యుం డొకరుఁడు మహోక్షభృతమై తగు నా
దిత్యరథోర్జస్వలమగు
నత్యుజ్జ్వలశకటము నపు డటకుం గొనిరాన్. 182

తే.గీ. వేషమును మార్చి, త్యజియించి భూషణాళి,
మల్లికాసతి శకటంబు మామతోడఁ
దా నధివసించెనో లేదొ, తత్క్షణంబె
తేలిపోయెను వృషభముల్ గాలిలోన. 183

ఆశ్వాసాంతము

భుజంగ ప్రయాతము: త్రిలోకాధినాథా! శ్రితార్థప్రదాతా!
జలేజాతనేత్రా! సదోఘాప్తమిత్రా!
కలాపాభగాత్రా! కనత్పీతవస్త్రా!
నిలింపాధినేతా! నృకైవల్యదాతా! 184

స్రగ్విణి. శ్రీసతీనాయకా! చేతనోద్ధారకా!
భూషణోద్భాసితా! పుణ్యలోకార్చితా!
నాశితేంద్రాహితా! నారసింహాచ్యుతా!
కేశవా! శ్రీకరా! కృష్ణ! దామోదరా! 185

ప్రభావతి. గోపికానాయకా! గోవర్ధనోద్ధారకా!
పాపసంహారకా! భక్తౌఘసంరక్షకా!
తాపసామోదకా! దైతేయలోకాంతకా!
ఆపదోన్మూలకా! ఆనద్ధపింఛాలకా! 186

కం. భాసురముగ నాల్గవ యు
ల్లాసం బగుచుం దగు నిది రసరమ్యముగన్
దేశికుఁ డను కవిచంద్రుఁడు
వ్రాసిన 'జక్కనచరిత్ర' వరకావ్యమునన్. 187






ఉ. శ్రీరమణీస్వరూపిణిని సీతను గానక దండకాటవిన్
పారములేని శోకమున వందురుచుండి, మరుత్తనూజు మై
త్రీరసలబ్ధిచే మఱలఁ దేజము, ధైర్యము నొంది, లంకకున్
జేరి, దశాస్యునిం దునిమి, సీతను బొందిన రాముఁ గొల్చెదన్. 1

## మల్లిక జక్కనను జేరఁబోవుట

మ. బలవత్సింహయుగంబుఁబోలు తదనడ్వాహద్వయం బవ్విధిన్
బొలముల్ పుంతలు వాకలుం గడచి విస్ఫూర్జద్రయోపేతమై,
లలనాలోలుఁడు గూళిదేవుఁ డధికారంబందు వర్ధిల్లు భూ
తలముం దాటి చనెం బ్రభాతరవి పాదంబూను లోఁగా నిలన్. 2

ఉ. అంతటఁ బ్రాగ్దిశాస్యమున నంచితమయ్యె నుషోఽరుణప్రభల్,
ప్రాంతతరుస్థితంబులయి పక్షులు వాడెఁ బ్రభాతగీతికల్,
పొంతల దూడ లాల పొదువుల్ వడిఁ గ్రుమ్ముచుఁ ద్రావె క్షీరముల్,
ప్రాంతపు నేలలం గృషికవర్గము చేలకుఁ గట్టె నీరముల్. 3

ఉ. తూరుపుగొండపై నిలిచెఁ దోయజబాంధవుఁ డంతఁ బాటలో
దారమనోజ్ఞమూర్తియయి, తచ్ఛవిలోన మునింగి హాటకో
దారమహాంశుకావలితదైవతనాథుని భంగిఁ గన్పడెన్
దూరమునందు నొక్కఁ పురదుర్గ ముదగ్రము నౌచు వారికిన్. 4

తే.గీ. ఆపురంబున నిల్చి, కాల్యములఁ దీర్చి,
శిల్పిపురమున కేఁగఁ, దచ్ఛిల్పివరులు
మల్లనం గుఱుతించి, సన్మాన మెసఁగ
నాతిథేయంబు సల్పిరి యందఱికిని. 5

ఉ. అచ్చటి శిల్పులం దొకరుఁ డప్పుడె దూరపుగొండనుండి తాఁ
దెచ్చిన ఱాలఁ జూపి, 'యివి తెచ్చితి జక్కన యున్నచోటనే,
అచ్చటి శిల్పయోగ్యమగు నశ్మవరంబుల బండ్ల కెత్తి, తా
వచ్చుట కౌను నింక నిరువారము లంచు వచించె నాతఁడున్. 6

తే.గీ. ఆతఁ డున్నాడు కావేరి కవలి వైపు
దవ్వులందున్న యొక మహీధ్రంబునందు;
అచటికేఁగంగఁ బట్టు నాల్గైన దినము'
లనుచు నాశిల్పి దెల్పిన నాలకించి. 7

ఉ. మల్లిక పల్కె నీ పగిది, 'మాన్యుఁడ వౌదువు శిల్పివర్య! యీ
చల్లనివార్తఁ దెల్పి కడు సౌఖ్యము గూర్చితివయ్య మాకు, మ
ద్వల్లభు నెట్లు శీఘ్రముగ దాయఁగ నౌనొ తదీయమార్గముం
దెల్లముసేసి మమ్ముఁ గరుణింపఁగదయ్య సువాగ్విభూషణా!' 8

కం. అన నా శిల్పియుఁ బల్కెను
'వనితారత్నమ! అది యొక భాగ్యమె? వివరిం
తును నేదిష్ఠంబగు తెర
వును జక్కనశిల్పిఁ జేరఁబోవం ద్వరగన్. 9

తే.గీ. శింశుపానది కావేరిఁ జేరు చోటు
నేత్రపర్వమై పొలుపారు ధాత్రియందు;
ఐదు యోజనంబుల దూర మరుగవలయు
దానిఁ జేరంగ నిటనుండి దక్షిణముగ. 10

తే.గీ. అచటఁ గావేరినిం దాటి యవలివైపు
కొంతదూర మేఁగిన నొక కొండ గలదు;
శిల్పులందఱు నందున శిలలఁ దీయ
'శిల్పమల' యని యదియుఁ బ్రసిద్ధమయ్యె. 11

తే.గీ. జక్కనాచార్యుఁ డా మల ప్రక్కనున్న
యొక కుటీరంబునందున నున్నవాఁడు;
అతని జేరంగఁ గావేరి నంబుతరణి
యందునం దాఁటి పోవలె నవలి దరికి. 12

తే.గీ. అధ్వమెల్లయు దుర్గమ మగుటవలన
మధ్యమధ్యన నాగుచు మఱల సాగి
పోవలయు నుపాయంబునఁ బూన్కిమీర,
భద్రముగ నగుఁగాత మీ పయనమింక!' 13

తే.గీ. అనుచుఁ బల్కిన శిల్పిని నా లతాంగి
సంస్తుతించి, మల్లనతోడ శకటమెక్కి
దక్షిణముఖంబుగా సాగెఁ దత్క్షణంబ,
కర్మఠులు విడంబన మోర్వఁగలరె యెందు? 14

కం. ఈవిధమున ముప్రొద్దులు
దైవముపయి భారము నిడి దబ్బున వారా
త్రోవను గమించి చేరిరి
కావేరియు, శింశుపయును గలిసెడి చోటున్. 15

కం. కావేరినిఁ బూర్వాబ్ధికి
దేవేరినిఁ, బశ్చిమజగతీధరునకు మో
దావహమైన కుమారిని,
నావీక్షించిరి వెఱఁగున నచ్చట వారల్. 16

సీ. కూర్మినెచ్చెలితోడఁ గూడంగ వచ్చిన
శృంగారనాయికాభంగి నూని,
పూర్వాబ్ధిపతిఁ గూడఁబోవుచో నొదవు హ
ర్షానురూపంబులౌ నలల నూని,
లోకాఘపంకంబు లోఁగొన్న కతననో
బభ్రువై పొల్చెడు వారి నూని,
నీరాడి ముక్తులౌ నిఖిలజను లొసంగు
పూలఁబోలిన ఫేనజాల మూని,

తే.గీ. పరమరంగనాథాంఘ్రులఁ బాద్య మిడఁగ
ధారుణీసతి పట్టిన ధారఁ బోలి,
రెండుకూలము లొరయుచు నిండి పాఱె
దక్షిణపుగంగ కావేరి అక్షయముగ. 17

తే.గీ. నిండు చూలాలుఁ బోలుచు నిండియున్న
ప్రోదినిం దాఁటి బండిలో నవలి దరికిఁ
జేరుకొనరామి వార లా తీరమందె
శకటరాజంబుఁ ద్యజియించి సంభ్రమమున. 18

తే.గీ. వాహినిం దాఁటఁగా నొక్క వారితరణి
యందు నుపవిష్టులై సాగి రల్లనల్ల;
గగనమందునఁ దేలు మేఘంబువోలె
నదియుఁ జేరెను క్రమముగా నవలి దరికి. 19

కం. కూలముఁ జేరిన నావను
వైళమ వీడంగఁబోయి శ్వశురుం డట జం
బాలంబునఁ గాల్జారఁగఁ
గీలాలంబుల మునుంగు కీడేర్పడినన్. 20

తే.గీ. పుట్టిలోపల నిలుచుండి గట్టు పైకి
నెట్టి మల్లిక యాతని దిట్టముగను;
కాని యంతలోఁ జయ్యన ద్రోణి యొరగి
తానె పడిపోయె నీటిలోఁ దత్క్షణంబ! 21

తే.గీ. నాట్యరంగము వీడిన నటి విధంబు
నాట్యరంగముఁ బోలిన నావనుండి
నీటిలోఁ బడిపోయె నా నృత్యరాణి,
కష్టదంబులు గద! దైవచేష్టితములు! 22

తే.గీ. నావనడపరి యపుడామెఁ గావనెంచి
నీట దుమికెను శీఘ్రంబ యోటలేక,
కాని యాలోన నీటివేగంబుచేత
నతని కందక దిగజారె నతివమిన్న. 23

మ. అతులోత్తుంగతరంగహస్తములచే నయ్యింతి నారీతి నా
ద్రుతవారాశివధూటి లోఁగొనుచుఁ దోడ్తోడం జనంగన్ బ్రవి
స్మితుఁడై చూచెను చేష్టఁదక్కి యతఁడున్, జేకూరునే మానవుల్
క్షితిలో నెన్ని యొనర్చినన్ విధినిఁ దక్కింపంగఁ బూర్ణంబుగన్! 24

ఉ. ఈ విషయంబు మల్లనకు నెంతయొ విహ్వలితాంతరంగుఁడై
తా వినిపించె నాతఁడును, తద్విషయంబును విన్నయంతనే
'హా విధి!' యంచు మల్లన మహాశనిసంహతశైలమట్లు, ఝం
ఝావిహతద్రుమంబటులు చయ్యన నేలకుఁ గూలె నెల్గుతోన్. 25

తే.గీ. కూలిపడి యిట్లు మల్లన కొంతవడికిఁ
దెలివినిం జెంది, వధువుకుం గలిగియున్న
యాపదను, తద్విఘాతంబు నోపలేని
పుత్త్రుదుస్థితిం దలచి వాపోయె నిట్లు. 26

## మల్లన పరితాపము

ఉ. `నీదుమనంబు నవ్యనవనీతసమానము, నీదు వాక్కు చై
త్రోదితచూతకౌసుమరసోత్కరరమ్యము, నీదు వర్తనం
బాదరణీయపార్వణనిశాంచితచంద్రకళానవద్య మో
గాదిలికోడలా! విధివిఘాతముచే నిటు దూరమైతివే! 27

ఉ. కాలముసెల్లి చాచుకొని కాటికిఁ గాళులు వేచియున్న న
న్నో లలితాంగి సొంతముగ నొప్పరికించుచు, మృత్యుదంష్ట్రికా
వ్యాళము నిన్ను, గర్భిణిని, భాసురయౌవనినిం గ్రసించునే?
కాలునకైనఁ బ్రీతి యువకాంతలయందునెపో వసుంధరన్! 28

ఉ. కన్నులులేని యంధుఁడను గావున నో నటనాసరస్వతీ!
చెన్నగు నీదునందియలఁ జెందిన శబ్దము మాత్రమే మదిన్
మన్ననసేసి, నీ నటనమంజిమ నెన్నఁడు నాకు నిప్పు డే
తెన్నునఁ జూచినన్ వినపడెం దటినీచటులోగ్రఘోషలే. 29

ఉ. ఏమని పల్కుదుం దనయుఁ డిచ్చటికిం జనుదెంచి, `తండ్రి! నీ
సేమముగోరు మల్లికకు సేమమె? కానఁగరాదిదేమి యా
కోమలి, సాధ్వి, నావలపుకూడలి? మబ్బుపిఱుంద బ్రుంగు సౌ
దామనివోలె నామె వ్యవధానముఁజెందెనె?` యంచుఁ బల్కఁగన్. 30

చం. అతులితహావభావకలితాద్భుతలాస్యవిలాసలీలలన్
సతతము నీవు మత్సుతుఁడు చక్కగఁ జెక్కెడునట్టి శిల్పసం
హతులకుఁ బ్రాణదాత్రిపయి మన్ననఁగాంతువు; నీవు లేక యే
వితమున వాని శిల్పములు వెల్గెడు నింక సజీవమూర్తులై? 31

తే.గీ. నీవె ప్రాణంబు జక్కన కో వరాంగి!
నీవు ప్రాణంబుఁ బాసితి నీరమందు
ననెడి వార్తను విన్న యా క్షణమునందె
నీఱుగాడొకొ యాతండు నిశ్చయముగ. 32

తే.గీ. నీదు ప్రతిమను ఱాతను నిల్పియున్న,
నీవు నాట్యంబుచే నందు జీవశక్తిఁ
బోసియుండిన, జీవింపఁబోలు నతఁడు;
నిరత మద్దానిఁ గాంచుచు నెమ్మిమీర. 33

కం. అంతియె కానీ యాతం
డింతయు నిన్నుం దొఱంగి యిలలో మనునే?
ఎంతటి వసంతమందును
వృంతంబును బాసి సుమము వేఱుగ మనునే?' 34

ఉ. ఈవిధిఁ గుందు మల్లన నహీనదయామతిఁ గాంచి యంత నా
నావికుఁ డూరడించి వలనైన విధంబునఁ, బల్కె 'నార్య! సం
ధ్యావృతమయ్యెఁ బశ్చిమము, ధ్వాంతము భూమినిఁ గ్రమ్మనుండెఁ బే
రావును మ్రింగు శ్వాపదకులాధిపుచందము దుర్దమంబుగన్. 35

తే.గీ. చేరఁగాఁబోవ జక్కనశిల్పి నిపుడు
మీకు దుస్సాధ్యమగుఁ గాన మా కుటీర
మందు నీ రేయి యుండి కల్యంబునందుఁ
బోవఁగాఁ దగునయ్య! మీ పుత్త్రుకొఱకు. 36

కం. గోదావరితీరంబున
నా దశరథసుతు కుటీరమట్టుల నిందున్
నాదు కుటీరం బలరును
మీదు పదస్పర్శ నదియు మేధ్యం బగుతన్. 37

కం. నా తనయుని వఱువాతను
మీ తోడుగఁ బంపువాఁడ, మేలగు మార్గం
బాతఁడు సూపెడు; నెమ్మిన్
మీ తనయుని గూడ నట్లు మేలగు నేఁగన్. 38

తే.గీ. అనుచుఁ దోడ్కొని మల్లన నాతఁ డరిగె
తన కుటీరంబునకు నమితాదరమున;
అంతలో ధ్వాంత మంతంత కగ్గమగుచు
భూనభోఽంతరంబుల నెల్లఁ బొదువసాగె. 39

తామసీవర్ణనము

సీ. కాలోరగోరుఫూత్కారసంద్రావిత
వ్యాళోత్కరప్రవాహంబొ యనఁగ,
దిక్ఘనాఘనకరోత్క్షిప్తాతిదారుణ
శ్యామలజంబాలచయమొ యనఁగ,
అస్తంగమద్రవిహయఖురోత్థితసాంద్ర
చరమాద్రిజాతభృశంబొ యనఁగ,
గగనాటవీజాతఘనతమాలాగమో
త్థితపత్రసంచయద్యుతియొ యనఁగ,

తే.గీ. సమయకైవర్తుఁ డాకాశజలధియందుఁ
బరఁగు తారకాఝుషములఁ బట్టుకొనఁగఁ
బరచియుంచిన నల్లని వలయొ యనఁగ
ధ్వాంత మంతట దెసలందు వ్యాప్తమయ్యె. 40

తే.గీ. ఉచ్చనీచంబులను నెల్ల నొకటి సేసి
సుమృదుకర్కశప్రకృతుల సమము సేసి,
వర్ణసంకరం బొనరించి వ్యాప్తిఁజెందె,
కుమతిరాజ్యపాలన మట్లు తమము దెసల. 41

చం. ముదమునఁ బాడ ఘూకములు, పొందును బాసి రుదింపఁ గోకముల్,
ముదమును జెందఁ జోరులును, మోదమువాయఁగఁ బాంధవర్గముల్,
ముదమువహింప జారిణులు, పోడిమిమాఁడి కృశింపఁ బద్మినుల్,
ముదిరిన పాపమట్లు దమ ముద్ధృతమయ్యెను నంతకంతకున్. 42

తే.గీ. అపుడు చుక్కలు గననయ్యె నభ్రమందు
శాదమున గూరుకొన్న వజ్రంబులట్లు,
వరిపొలంబున రాలిన వడ్లయట్లు,
నల్లజల్లెడలోని రంధ్రంబులట్లు. 43

జక్కన స్వప్నమును గనుట

తరలము. పవలు సొంతము పర్వతంబునఁ బ్రస్తరంబులఁ దీయుటన్
మివుల డస్సిన జక్కనాఖ్యుఁడు మేనువాల్చెను తన్నిశిన్
తవిలి రెండవయామ మింకను ధాత్రిఁ దోఁపక పూర్వమే
భువనముల్ సృజియించి డస్సిన పుష్కరాసనుఁ బోలుచున్. 44

తే.గీ. అటుల నిద్రావశుండైన యతని కొదవె
స్వప్న మొక్కటి యత్యంతభయద మగుచుఁ,
బంచవట్యాశ్రమముఁ బోలె స్వాలయంబు,
అందు మల్లిక జానకియట్లు మిగిలె. 45

ఖండగతి. ఆ యాశ్రమద్వారమం దొక్కతరువుండె,
ఆయాస మనఁబోక యమ్మహీజంబునకు
తోయంబు శ్రద్ధతో దోయిలిం ఘటియించి
ఆయింతి యొంటిగాఁ బోయుచుం గనిపించె. 46

ఖండగతి. అంతలో గూళిదేవావనీనాథుండు
దానవాకృతిఁ దాల్చి తత్కాంత హరియింపఁ
బెనుపాములంబోలు దన కరంబులు సాఁచె,
నాయింతి భీతయై యతిజవంబునఁ బర్వె. 47

ఉ. కుండ నదాటుగా నసురు క్రూరముఖంబునఁ ద్రిప్పికొట్టి యా
తండు రయోద్ధతిం దరుమఁ దానును నాతనికన్న మిన్నయౌ
చండతరస్వితం బఱచె సత్వర మాతరళాక్షి, క్రూరవే
దండరిపుప్రధర్షితము, త్రస్తమునౌ హరిణంబుపోలికన్. 48

కం. ఈరీతిం దరుమంబడి
యా రామామణియు స్త్రైణమౌ గౌరవమున్
దా రక్షించుకొనన్ మఱి
యేరీతిం గనక సాహసించుచుఁ జెంతన్. 49

కం.తు. పారావారముపగిదిం
బాఱెడు గోదావరినదిఁ బడిపోయె న్వడి భూ
ర్యారవ మెసఁగన్ నిందా
పూరితమగు జన్మకంటెఁ బొలియుటె మేలనుచున్. 50

మ. అతిఘోరంబగు స్వప్న మీగతిని నత్యాభీలవజ్రాభమై
యతనిన్ మేల్కొలుపంగ నాతఁడును నర్ధాంగీమణిం దండ్రినిన్
మతిలో నెంచుచు, వారి క్షేమమును బల్మారుల్ వితర్కించుచున్
ప్రతిరుద్ధాంతరశాంతుఁడై నిలిచి కర్తవ్యంబు నూహించుచున్. 51

ఉ. శాంతయు, నిస్సహాయయును, సద్గుణసన్నుతయున్, గృశాంగియున్
[1] గాంతయు నైన మత్ప్రియ నొకర్తుకఁజేసి కృపావిహీనమౌ
స్వాంతముతోడ నిచ్చటికి వచ్చితి; నన్నెడఁబాసి యామె యే
వంతలఁ జిక్కెనో, [2] శఠుఁడు [3] పార్థివుఁ డాయమ నేమి చేసెనో? 52

చం. కపటి, [4] నృశంసుఁడున్, నిరతకామవశుండును, స్త్రీవిలోలుఁడున్,
[5] గృపణుఁడు గూళిదేవధరణీశ్వరుఁ డౌగద! వాని చిత్తమం
దెపు డెది పుట్టునో? యెవని యింతి నతండు బలాత్కరించునో?
చపలుని చిత్తముం దెలియ సాధ్యమె యా పరమేష్ఠి కేనియున్? 53

1. కాంతా – 'కామ్యత ఇతి కాంతా' అనివ్యుత్పత్తి – మిక్కిలి శృంగారముగా నుండుటవలన బురుషులచే గోరబడునది అని అర్థము; 2. శఠుఁడు – 'శఠతీతి శఠః' అని వ్యుత్పత్తి – 'గూఢవిప్రియకృచ్ఛఠః' అని యలంకారశాస్త్రము – చాటుగా నపకారమును జేయువాఁడు; 3. పార్థివుఁడు = రాజు; 4. నృశంసుఁడు – 'నౄన్ శసతి నృశంసః' అని వ్యుత్పత్తి – నరులను హింసించువాఁడు; 5. కృపణుఁడు – 'కుటుంబపీడనేనాపి సమర్థో భవతీతి కృపణః' అని వ్యుత్పత్తి – కుటుంబమును బీడించియైనను స్వార్థమును నెరవేర్చుకొను వాఁడు.

ఉ. ఈ కల గల్గఁబోదు కతమేమియు లేక, తుఫానుముందటన్
బ్రాకెడు వాత్యవోలె, దవవహ్నికి ముందుఁ జెలంగు ధూమరే
ఖాకుటిలప్రనర్తనము కైవడి, నియ్యది పట్టియిచ్చు రం
భాకమనీయవిగ్రహకు మత్ప్రియకుం బొడసూపు నాపదన్. 54

ఉ. కావున నీ శిలానయనకార్యము నాపి లతాంగి సేమమున్
వావిరి నారయం జనఁగ వాసియగుంగద! వేగ మేఁగినం
ద్రోవనె నిర్గతించును చతుర్దివసంబులు, దాన నిప్పుడే
త్రోవనుబట్టఁగాఁ దగును; తొయ్యలిచేటును నెట్టఁగాఁ దగున్.' 55

మ. అని నిర్ధారణసేసి యాతఁ డపుడే యధ్వంబునుం బట్టి, ప్రా
గ్వనజాక్షీమణి ఫాలమందున లసత్కాశ్మీరజన్మాంకమై
వనజాప్తుం డుదయించు నప్పటికిఁ దా వైళంబ కావేరి యం
దున శింషానది చేరు ప్రాంతమునకుం దోతెంచె శ్రాంతాంగుఁడై. 56

జక్కన మల్లనను చూచుట

ఆ.వె. అట్టు లేఁగుదెంచి యాతఁ డయ్యాపగన్
దాఁటఁగాను నంబుతరణిఁ గట్టు
కర్ణధారుకొఱకుఁ గడనున్న యొక కుటీ
రంబుఁ జొచ్చి తత్తరంబుతోడ. 57

తరలము. కనియె నక్కడ నక్కజమ్ముగఁ గన్న తండ్రిని మల్లనన్,
వినతశీర్షుని, స్విన్నదేహుని, వీతకాంతియుతాస్యునిన్,
ఘనతరంబగు శోక మొక్కెడ గడ్డకట్టిన మూర్తియో
యనఁగ నొప్పెడువాని, నంధుని, నాపదాహతచిత్తునిన్. 58

సీ. పరివేషవృతుఁడైన హరిణాంకునిం బోలె
శోకావృతాస్యంబు శోభఁ దక్క,
కర్ణికారహితమౌ కల్పపూవులఁ బోలె
క్షతకనీనికలైన కన్ను లొదవ,
దంతావళంబుచే ధ్వస్తంబులై వ్రాలు
వ్రతతులం బోలె దోర్లతలు వ్రాల,
తొలివానచిన్కులే తొనకంగ గ్రీష్మోర్వి
నొదవు నూష్మము వోలె నూర్పు లెసఁగ,

తే.గీ. గొంతుకాళ్లను గూర్చుండి వంతతోడ,
శిరము మోకాళ్లపై నుంచి చింతసేయు
చుండె నెద్దియొ యాతండు, శూన్యదృష్టి
జాలముల్ మ్రోలఁగల నేలఁ గీలుకొలిపి. 59

కం. పితరుని గాంచిన వెంటనె
కుతుకాద్భుతభయవిచారగుంఠితమతియై
యతనిం గరముల నెత్తుచు
నతులాదృతిఁ గౌఁగిలించు చనె జక్కనయున్. 60

ఉ. 'ఎక్కడ గూళిదేవపుర మెక్కడ నీ విపినంబు, తండ్రి! నీ
విక్కడి కొంటిమై నిటుల నెందులకుం జనుదెంచి తయ్య! నే
నొక్కఁడ నిక్కడుంటి నని యుల్లము దల్లడమంది వచ్చితో!
అక్కఱ వేఱు గల్గిన మదర్థము మార్గణసేయ వచ్చితో! 61

శా. నాన్నా! క్షేమమె నీకు? నిత్యమును నిన్మన్నించునే, కొల్చునే,
మన్నారీమణి మల్లికాఖ్య యతులంబైనట్టి ప్రేమంబునన్?
నిన్నొక్కండను జేసి వచ్చితినె నేనిచ్చోటికిన్ నిర్దయన్?
మన్నింపం గదె! మాదు తప్పిదము లేమైనన్ బ్రవర్తిల్లినన్. 62

చం. ఉదయరవింబలె న్మను మహోమహితంబగు నీదుమోమునం
దుదితములయ్యె నేలొకొ మహోగ్రవిషాదవినీలరేఖలే?
చెదరినయట్టి కేశములు, స్విన్న శరీరము, సిక్తనేత్రముల్,
ప్రిదిలిన బాహులూని యిటు లేటికి నుంటివి శోకమూర్తివై? 63

శా. మాయాశీలుఁడు, చంచలాత్ముఁడు, సదాత్మార్థైకసంలక్ష్యుఁ, డ
న్యాయప్రేరితచిత్తవృత్తికలితుం డాగూళిదేవేంద్రుఁ డ
న్యాయం బేమయినం బొనర్చె నొకొ నాన్నా! నీకొ, లేకున్న మ
జ్జాయారత్నము మల్లికాసతికొ? నిశ్శంకన్ వచింపం గదే! 64

మ. అని యోదార్పఁగఁ జూచు జక్కనకు నాయంధుం డెదో చెప్పఁగాఁ
దన యోష్ఠంబును విప్పఁ, గాని యపుడే తన్నేత్రపాథోధులం
దున వెల్లింగొను నశ్రుజాలములయందుం దోఁగు నాయోష్ఠ, మి
ట్లెని సార్లైనను జిందు నశ్రువులె కానీ మాట రాదొక్కటేన్. 65

ఉ. ఈ దయనీయమైన స్థితి నీక్షణసేసి యుపాంతనావికుం
డూదెను జక్కన శ్రవణయుగ్మమునందున మెల్లమెల్లగన్,
మేదురకాలకూటవిషమిశ్రము నైన విషాదవార్తనున్
హ్రాదినిలోన మల్లిక మహోపద నందినయట్టి తీరునున్. 66

మత్తకోకిల. అంతలోపల మల్లనాఖ్యుఁడు నాత్మయందున స్థైర్యమున్
గొంతగాఁ గలిగించుకొంచును గూళిదేవుఁడు మల్లికన్
జెంతకుం బిలిపించి చేసిన చెయ్ద, మద్ది కతంబుగాఁ
గాంత తోడుతఁ దాను జక్కన గాంచవచ్చిన వైనమున్, 67

ఉ. తెల్లముసేయ జక్కనయుఁ దీవ్రతరాగ్రహశోకవహ్నిచే
నుల్లము ప్రజ్వరిల్ల వెస నుర్వికి వ్రాలి, యచేతనత్వపున్
వెల్లువలోనఁ దోఁగ నిజవిగ్రహమెల్ల, నవాచకత్వపున్
రల్లకరుద్ధవక్త్రుఁడయి మ్రాన్పడియుండి, యనంతరంబునన్. 68

తే.గీ. తేరుకొని యాతఁ డశ్రులు ధారగట్ట,
తనదు సగపాలుఁ, బ్రియురాలిఁ, బ్రణయరాణి,
మల్లికాసతి మది నెంచి మఱలమఱల
నిట్లు పరిదేవనం బొనరింపఁదొడఁగె. 69

జక్కన విలాపము

ఉ. వెన్నెలవోలె నన్నెపుడు వీడక నాదగు మన్గడన్ సదా
పున్నమిసేసినట్టి పరిపూర్ణవిభాకృతి! యిప్పు డీగతిన్
నన్నెడఁజేసి యేఁగితివె? నవ్యకరాళతమోఽబ్ధివీచికా
భ్యున్నతకృష్ణపక్షమున కొప్పరగించితె మద్భవేందునిన్? 70

చం. పొలుపగు తీవవై పొనరి, పూర్ణలతాంతసుయౌవనప్రభం
జెలువువహించి, పైనిఁ బ్రవిశిష్టఫలోన్ముఖవర్తివైన నీ
కలిమిని, నిన్ను, సొంతముగఁ గాలనురాచెనె దైవ, మాతనిం
బలుకరుణాళుఁ డంచనెడు వాక్యము లెల్లను డొల్లలే సుమీ! 71

ఉ. ఏ నెటులూరడింతు నిఁక నిందునిభాస్య! త్వదాస్యచంద్రికం
బానముసేయఁగాఁ దివురు మామకవీక్షణకోకలోకమున్?
నేనెటు బుజ్జగింతు నిఁక నీరజనేత్ర! త్వదంబకాశ్రయం
బే నిరతంబుఁ గోరి చరియించు మదీక్షణభృంగసంఘమున్? 72

ఉ. మానిని! తావకీనపరమాద్భుతనర్తనకౌశలామృతం
బానుచుఁ జేతనత్వమహిమాఢ్యములయ్యెడు నాదుశిల్పముల్
ప్రాణము లెట్టులూను నిఁక? ప్రాణమువోసెడి నీవె ప్రాణముల్
కానుకసేసి ప్రొదినికిఁ గాలమహాంబుధి లీనమై చనన్! 73

తే.గీ. ప్రమదబాష్పపూర్ణాబ్ధులై పరఁగె నాదు
నేత్రములు నీదు సంయోగనియతిచేత;
కాని యవి నేఁడు భయదశోకాశ్రుజలధు
లగుచు నిర్మగ్నమొనరించె జగతి నెల్ల. 74

సీ. నీ ముఖచంద్రచంద్రికల నెప్పుడు గ్రోలఁ
గా నెంచు మన్నేత్రకైరవములు,
నీ శిరీషోపమపేశలాంగము నంటఁ
గా నెంచు మత్కరకమలములును,
నీ గంధిలోచ్ఛ్వాసనిశ్శ్రేణికలఁ బ్రాకఁ
గా నెంచు నా యూర్పుగాలిపొరలు,
నీ మోవిమంకెనతో మైత్రిఁ బచరింపఁ
గా నెంచు నా యోష్ఠకమ్రకిసల,

తే.గీ. మాశ్రయంబును దొఱఁగి నే డశ్రులందు
మునుఁగు మైతోడఁ దామును మునుఁగుచుండె;
పడవతోఁగూడ నందలి వస్తుచయము
జలములందున మునిఁగెడి చందముగను. 75

ఉ. సుందరి! నీదునందియల సుందర[1] శింజితగీతికారస
స్పందితమానసుండ నయి శయ్యను వీడెడు నాకు నిప్పు[2] డ
హ్నాంధకరాళనాదములె య్యెనె[3] ఘాంటికగీతరావముల్?
గందపుమ్రాఁకు లుల్లసిలు కానను మొల్చెనె నేడు[4] ధూర్తముల్! 76

ఉ. కోకిలకంఠ మూని నను గోముగఁ బిల్తు రెవాఱు? పిల్చి యా
కేకరదృష్టులందుఁ ద్రప గీల్కొనఁ జూతు రెవాఱు? చూచి వ
ల్ల్యాకృతులైన బాహువుల యందునఁ జేర్తు రెవాఱు? చేర్చి రా
గైకరసాంబుధిం దనుపఁగల్గుదు రింక నెవాఱు ప్రేయసీ! 77

1. శింజితము = భూషణముల ధ్వని (మర్మరః స్వనితే వస్త్రపర్ణానాం, భూషణానాం తు శింజితమ్ - అని అమరము); 2. అహ్నాంధము = దివాంధము = గుడ్లగూబ (దివాంధః కౌశికో ఘూకో దివాభీతో నిశాటనః - అని అమరము); 2. ఘాంటికుఁడు = వైతాళికుఁడు (వైతాళికా బోధకరా శ్చాక్రికా ఘాంటికా స్సమాః - అని అమరము) భూషణాదుల అవ్యక్తధ్వనివలె గాక, కర్కశములైన గంటలు వాయించి లేపువాఁడని ఇచట విశేషార్థము. 4. ధూర్తము = ఉమ్మెత్తచెట్టు (ఉన్మత్తః కితవో ధూర్తః - అని అమరము; ధూర్వతి ఉన్మాదేన హినస్తీతి ధూర్తః - ఉన్మాదము గొల్పుటచేత హింసించునది - అని వ్యుత్పత్తి. ఈపద మిచట సాభిప్రాయముగా వాడబడినది.

ఉ. నీ కురులందు జిహ్మతను, నీ యవలగ్నమునందు నజ్ఞతన్,
నీ కనులందుఁ జంచలత, నీ యధరచ్ఛవియందు నుగ్రతన్,
నీ కటియందు వక్రతను, నే మును దాచితిఁగాని ప్రేయసీ!
ఆ కుగుణంబు లన్నియును నంటఁగసాగెను నన్నుఁ గ్రమ్మరన్. 78

ఉ. నా సుఖజీవితాఖ్యమగు నౌకకు దారినిఁ జూపు తారవై,
నా సరసంపు శిల్పముల నర్తనమాడు కళాస్వరూపివై,
నా సతివై, నిరంతరము నాకనులందున వెల్గు జ్యోతివై,
ఓసఖి! నన్నువంతలకు నొక్కరునిన్ మిగిలించి యేఁగితే! 79

ఉ. ఏటికి సుత్తె? యింకఁ బనియేమిటి యీ యులితోడ? ప్రాణముల్
నాటఁగ నీవులేనికళ నాకళ యేటికి? నిన్నుఁ గూడ నీ
యేటనె వాటినిన్‌సయిత మిప్పుడె నేఁ బడవైచి యీ మహో
గ్రాటవియందె గ్రుమ్మరుదు నాయువు దీఱెడుదాక వెఱ్ఱినై. 80

జక్కన ఉలిని కావేరిలోఁ బడవైచి శిల్పసన్న్యాసము చేయుట

మ. అనుచుం జక్కన తండ్రితోడ రభసంబారంగ సహ్యాత్మజా
ధునితీరంబును డాసి, సుత్తెను, నులిం దోయంబులం జయ్యనన్
మునుఁగం ద్రోసి, మరుద్ధుతక్షితిజముంబోలెం బ్రకంపించుచున్,
జనకుం గట్టిగఁ గౌఁగిలించుకొనుచున్ సంతప్తుఁడై యేడ్వఁగన్. 81

సిద్ధాచార్యుఁడను వైష్ణవయోగి జక్కన నోదార్చి
భగవద్రామానుజులకడకు గొనిపోవుట

చం. అతని భుజంబునందుఁ జెయి నల్లనఁ దట్టెను వైష్ణవుం డొకం
డతులితయోగసంద్యుతిత్మైన లలాటముపాఁడు, శ్మశ్రుసం
స్మితరుచి నొప్పువాఁడు, తులసీదళదామకశోభితాంగమం
దతిధవళోర్ధ్వపుండ్రములయందము లొప్పెడువాఁ, డదాటునన్. 82

ఉ. ఈగతిఁ దట్టి పల్కెను యతీంద్రుఁడు, ` ఓ యువకాగ్రగణ్య! నీ
కాగతమయ్యె నే విపద? ఆగతి నీపనిముట్లనెల్లఁ బా
థోగతమేల చేసితివి? తోరముగా విలపింతువేల? మి
థ్యాగతిమాని యున్న విషయంబును నాకెఱిఁగింపుమా కృపన్. 83

ఉ. దీనజనప్రసేవకుఁడ, దీనజనావనుఁడైన విష్ణునిం
ధ్యానముసేయువాఁడ నిరతంబును, విష్ణుపదారవిందసం
ధ్యానమె సర్వశోకపరిహారకమార్గమటంచుఁ దెల్పు రా
మానుజభాష్యకారులకు మానగు శిష్యుఁడ, సిద్ధయాఖ్యుఁడన్. 84

కం.తు. చూచితి దారిం బోవుచు
నీ చరితంబును గుమార! నీ వెతఁ దొలఁగింపన్
నా చేకొలదిం జేతును,
నీ చిత్తముఁ దెల్పుమింక నిర్భయముగ నాకున్.' 85

తే.గీ. అనుచు నాకస్మికంబుగ నచట నిల్చి
పలుకు సన్న్యాసి విస్మయభరముతోడఁ
గాంచి ప్రణమిల్లి జక్కన కష్టహేతు
వెల్ల వినిపింప నతఁడును దల్లడిల్లి. 86

చం. పలికెను కొంతసేపటికి, `బాలక! యీదృశదుఃఖముల్ పురా
కలితవిధీప్సితంబులయి కల్గుచునుండును ప్రాణికోటికిన్,
కలఁగక భక్తవత్సలుఁడు, గాఢదయార్ణవుఁ డైన చక్రిపై
నిలిపి మనంబు నిట్టియెడ నిస్తరియింపఁగఁ బోలు వానినిన్. 87

ఉ. [1] `ఏని ననుగ్రహింప మది నెంతునొ, వాని విభూతి, నాప్తులం
బూని హరింతు, నష్ట భయపూర్ణవిశోకితుఁ డయ్యు నన్ను నే
మానవుఁ డుజ్జగింపడొ యమర్త్యులునుం గననట్టి నాదు స
న్మానముచేత వాని ననుమానములేక తరింపఁజేసెదన్.'

తే.గీ. [2] 'సర్వధర్మముల్ వీడి నన్ శరణుగొనుము
నిర్భయంబుగ, నాయందు నెలవుగొన్న
వారి యఘములఁ దీర్తు నవశ్యముగను!'
అన్న గీతోక్తు లాలింపు మయ్య! సుంత. 88

చం. పరమదయాళుఁ, డాశ్రితులపాలిటి కల్పతరుండు, విష్ణుప
న్నిరతరతుండు, వైష్ణవమునీశ్వరముఖ్యుఁడు, ఛాత్రసంఘసం
పరివృతుఁ, డుండె మద్గురుఁడు ప్రాంతయదూర్విధరాశ్రమంబునన్
సరసిజయోని సప్తఋషిసంఘముతోఁ గొలువున్న యట్లుగన్. 89

కం. ఆ రామానుజగురునిన్
వేఱెంచక యాశ్రయింపు, ప్రీతి నతండున్
దూరించును నీ వంతను
శౌరిసమాశ్రయణమార్గసంసూచకుఁడై. 90

కం. అనుచున్ సిద్ధాచార్యుఁడు
దన వెనుకం గొనుచు నేఁగెఁ, దచ్ఛిల్పినిఁ, ద
జ్జనకయుతంబుగ, మేల్కో
టను గల రామానుజుల మఠంబును జేరన్. 91

ఉ. తిన్నగ వార లీగతిని దీవ్రతరాటవులున్, మహీధ్రముల్,
క్రొన్ననజొంపముల్ గలుగు కోనలు, తెన్నులు దాటి, కాంచి ర
భ్యున్నతభూధరంబు పయి నుజ్జ్వలరత్నమువోలె నున్న యా
పన్నశరణ్యుఁడైన మురవైరి గుడిన్ గల మేలుకోటనున్. 92

---

1.'యస్యానుగ్రహ మిచ్ఛామి తస్య విత్తం హరా మ్యహమ్। బాంధవైశ్చ, వియోగేన భృశం భవతి దుంఖితః,
తేన దుఃఖేన సంతప్తో యది మాం న పరిత్యజేత్। తం ప్రసాదం కరిష్యామి య స్సురైరపి దుర్లభమ్॥'
2. 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేక శరణం వ్రజ। త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః।'

అను శ్లోకముల ప్రకారము. ఈ రెండవశ్లోకమునకు చరమశ్లోక మని పేరు. భగవద్రామానుజ ప్రోక్తమైన విశిష్టాద్వైతసంప్రదాయానుయాయులు దీనిని సర్వగీతాసారముగా గ్రహింతురు.

శా. శ్రీరామానుజనిర్మితం బయిన లక్ష్మీశాలయం బద్దియే,
ఆ రమ్యాలయసన్నికర్షమున నయ్యాహార్యవర్యంబునన్
[1] గౌరీమాలతిపారిజాతకదళీకామేష్టముఖ్యద్రుమ
ప్రారూఢంబయియున్న యాశ్రమమె శ్రీరామానుజాగారమౌ. 93

తే.గీ. వింధ్యపర్వతమందున వెలసియున్న
కుంభజాశ్రమ మట్టులఁ గొమరుమిగులు
నయ్యతీంద్రుని యాశ్రమమందుఁ గలుగు
పక్షులును శ్రుతిసూక్తులే పలుకుచుండు. 94

కం. నారాయణపదసేవకు
గౌరీదళములఁ, బ్రసూనగణములఁ బుటిలో
శ్రీరామానుజగురువులు
గూరుచుకొనుచుండి రపుడు [2] కుటపమునందున్. 95

సీ.తు. ఫాలాంచితబ్రహ్మవర్చస్సునకు నైన
పెట్టివలె నామంపుపట్టె లమర,
బ్రహ్మసూత్రములందుఁ బరఁగు ముడు లిట్టివని
కట్టిన తులసిదామకంబు తనర,
హరిసేవకులు వొందు నపవర్గమార్గ మి
ట్లన్న యటు దీర్ఘసంవ్యాన మొనర,
జీవుఁ డొక్కఁడె, కాయమే వివిధ మనురీతిఁ
బలురీతుల మడచిన పంచె యొనర,

తే.గీ. శాంతుఁడున్, విశిష్టాద్వైతసంయమీంద్రుఁ
డతులకారుణ్యరసపూర్ణమతియు నైన
భాష్యకారుండు విష్ణుసేవార్థ మపుడు,
సుమములం గోయుచుండె నాశ్రమము చెంత. 96

1. గౌరీ = తులసీ, మాలతి = జాజి, పారిజాత, కదళీ = అరఁటి, కామేష్ట = రాచమామిడి, ముఖ్య = ప్రధానముగాఁగల, ద్రుమ = చెట్లచేత, ప్రారూఢంబయి = పొందఁబడినదై; 2. కుటపము = ఇంటితోట.

శా. సిద్ధాచార్యపురస్కృతుం డగుచు నా శేషావతారాశ్రమం
బిద్ధాసక్తినిఁ దాతయుక్తుఁడయి శిల్పీంద్రుండు తాఁ జొచ్చి సం
శ్రద్ధాభక్తులు మీరఁగా గురువరున్ సాష్టాంగదండంబులన్
సిద్ధానందునిఁ జేయఁగా గురుఁడు తచ్ఛ్రీయోఽభిలాషాత్ముఁడై. 97

తే.గీ. అమితశోకభరంబున హిమవిఘాత
పాటితంబైన సరసిజభాతి నొనరు
నతని ముఖమును బరికించి యతివరుండు
నెనరు మీరంగ మృదుభాష ననియె నిట్లు. 98

ఉ. 'ఎచ్చటి వాఁడవయ్య! వదనేందునియందున మచ్చవోలె గుం
దెచ్చుగఁ దోఁచుచుండుటకు నెయ్యది హేతువు? నీకు నెందునే
న్మచ్చికగల్గువారివలనం బరితాపము గల్గెనో? నినున్
నచ్చనివార లెవ్వరయినం దురితంబుల పాలు సేసిరో? 99

ఉ. ఉన్న విధంబు నాకు మది నోట యొకింతయు లేక తెల్పుమో
యన్న! కుటుంబధారుల వ్యథాదిక మారయకున్నవాఁడ నం
చెన్నికసేసి నన్ను మది నింతయు జంకకు మన్న! నీ వెతన్
సన్నము సేయ నెంతు నెద శక్తికి వంచన లేక క్రన్ననన్.' 100

మ. అనుచుం బల్కెడి భాష్యకారుల యతుల్యాపారకారుణ్యవా
ర్ధినిమగ్నుండయి శిల్పిసత్తముఁడు మూర్తీభూతదైన్యాకృతిన్
వినతుండై నిలుచుండఁ బల్కకయె, తద్వృత్తిన్ విలోకించి, యా
తని వృత్తాంతము సర్వముం దెలిపె సిద్ధాచార్యుఁ డయ్యోగికిన్. 101

శా. ఆ వృత్తాంతము నాలకించి గురుఁ డత్యంతంబు చింతిల్లి, చిం
తావిష్టుండగు శిల్పివర్యునకుఁ జేతశ్శాంతిఁ జేకూర్చు పం
థావిష్కార మొనర్చి, యుండుమనియెం దచ్ఛిల్పినిం దండ్రితో
నావీథ్రాత్మకుటీరమందుఁ గొనినా శ్లావేదనోన్ముక్తుఁడై. 102

ఉ. సాదరరీతిఁ గొన్ని దివసంబులు జక్కన నాయతీంద్రు ల
య్యాదవభూధరాంచితనిజాశ్రమమందు వసింపఁజేసి, త
ద్బాధను బాపి యాతనిని వెండి ప్రయోజకుఁ జేయనెంచి, త
న్మేధకు నెక్కునట్లు గడుమెత్తని వాక్కులఁ బల్కి రిట్లుగన్. 103

భగవద్రామానుజులు జక్కనకుఁ గర్తవ్యోపదేశ మొనరించుట

తే.గీ. 'సర్వసృష్టికారుండును, సర్వసృష్టి
పాలకుండును, సర్వజీవంబులందు
సర్వజడపదార్థములందుఁ బర్వియుండు
వాఁడొకండె, బ్రహ్మ మనఁగఁ బరఁగువాఁడు. 104

తే.గీ. పరఁగు నారాయణుండును, వాసుదేవుఁ
డనఁగ నాతండె, యాతని యంశతోడఁ
బరఁగియుండియు, జడజీవవస్తువితతు
లతనికంటె భిన్నంబులై యలరుచుండు. 105

తే.గీ. ఇట్టి ప్రాణులు దేహజన్యేచ్ఛ లుడిగి,
[1] స్వస్వరూపంబు లెరిఁగి, [2] ప్రపన్నులగుచు
[3] భాగవతనిత్యకైంకర్యపరతు లగుచు,
[4] బ్రహ్మసాయుజ్య మొందుటే పరమ మగును. 106

1. స్వస్వరూపంబు లెఱుగుట = జీవుడు తాను తనువుకంటె భిన్నుడనని, బ్రహ్మాంశసంభూతుడనని తెలిసికొనుట; 2. ప్రపన్నుడు = భగవంతునికి పరిపూర్ణముగా వశుడై తత్కళ్యాణగుణసమేతుడై అతనిని సేవించువాడు. `అహింసా ప్రథమం పుష్పం, పుష్పం ఇంద్రియనిగ్రహః, సర్వభూతదయా పుష్పం, క్షమా పుష్పం విశేషతః, శాన్తి పుష్పం, తపః పుష్పం, జ్ఞాన పుష్పం, తథైవచ సత్యం, అష్టవిధం పుష్పం విష్ణోః ప్రీతికరం భవేత్' – అని వైష్ణవగ్రంథమైన ప్రపన్నామృతంలో చెప్పినవిధంగా మహనీయగుణపుష్పములతో భగవంతుని సేవించుచు, అతనికి పరిపూర్ణముగా వశమైనవాడు ప్రపన్నుడు; 3. భాగవతకైంకర్యపరతుడు = భగవద్జ్ఞానపరిపూర్ణులైన మహనీయుల సేవయం దాసక్తుడు. `నిత్యకైంకర్య ప్రాప్తిరేవ మోక్షః' అను సూక్తి ప్రకారము రామానుజమతంలో భగవంతునియొక్కయు భాగవతులయొక్కయు నిత్యసేవాప్రాప్తియే మోక్షతుల్యము. 4. ఇట్లు ప్రపన్నులును, నిత్యభాగవతకైంకర్యపరతులును నైనవారు (బ్రతికియుండగనే) బ్రహ్మవలోకనానందము ననుభవింతురని భగవద్రామానుజుల శక్తిసంప్రదాయము.

ఉ. ఈతఁడు తండ్రి, వీఁడు సుతుఁ డీయమ భార్య యటంచు నిచ్చలున్
భౌతికమైన బంధముల వాగురలందునఁ జిక్కికొంచు, వా
రీ [1] తనువస్త్రము ల్విడిచి యేఁగినతోడనె కుందుచుండుఁ, దా
మే తనులం [2] చహంకృతిని నీశ్వరునిం గననట్టి జీవముల్. 107

ఉ. సంపద లేదినన్, సుతులు, సన్నిహితుల్ విగతాసులైన శో
కింపక సర్వ మా వరదకేశవువాంఛయె యంచు నెంచి, ల
జ్జింపక సర్వ మా విభుని చేతులలోననె యుంచినం, గృపా
సంపరిపుష్టదృష్టులను సర్వులఁ గాచును నాతఁడిమ్ముగన్! 108

తే.గీ. కాన మల్లికాంకితమైన మానసంబు
శ్రీనివాసాంకితంబుగాఁ జేయుమయ్య!
'అన్యథా శరణం నాస్తి' యనుచు నతని
సేవయందె నీభవము వెచ్చింపుమయ్య! 109

ఉ. లక్షకు నొక్కరుం డగు కళాసృజనాత్మకశీలి, వారిలో
లక్షకు నొక్కరుం డగు విలక్షణశిల్పకళాపితామహుం,
డక్షయరీతి నీవగుదు వట్టి కళాపరమేష్ఠి వంచు ని
న్నీక్షణసేసినట్టి బుధు లెప్పుడు సెప్పఁగ విందు జక్కనా! 110

చం. అనుపమమైన నీదు కళయన్ దపమందు నిరంతరంబుగా
ఘనమగు నిష్ఠతో నఁరి కల్పనసేయుము సర్వదుఃఖతా
రణుఁడగు వాసుదేవుని, పరాత్పరునిన్ శిలలందు మిన్నగా,
వినతజనావనుం డతఁడు వే దయసేయును నీకు శాంతినిన్. 111

1. 'వాసాంసి జీర్ణాని యథా విహాయ, నవాని గృహ్ణాతి నరోఽపరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణాని, అన్యాని సంయాతి నవాని దేహీ.'
అని భగవద్గీతలో చెప్పిన విధంగా, జీవులు తనువనే వస్త్రములను విడుచునని చెప్పబడినది.
2. జీవుడు తాను భగవదంశకలితుడనన్న విషయము మరచిపోయి తానే శరీరమని తలచి శారీరక సౌఖ్యములకై ప్రాకులాడుటయే అహంకారము.

సీ. [1] సర్వశోభనగుణుం డుర్వరాధీశుండు
ప్రణవైకరూపుండు పావనుండు,
సౌగంధ్యసౌందర్యసౌకుమార్యౌజ్జ్వల్య
లావణ్యయౌవనలాంఛితుండు,
సౌశీల్యవాత్సల్యసౌహార్దకారుణ్య
మాధుర్యమార్దవమండితుండు,
ఐశ్వర్యవీర్యసామ్యౌదార్యగాంభీర్య
విజ్ఞానబలశక్తివిలసితుండు,

తే.గీ. శౌర్యధైర్యపరాక్రమసంయుతుండు,
సత్యసంకల్పుఁడును సదాసత్యకాముఁ
డైన శ్రీమహావిష్ణుఁ డవ్యాజకృపను
మంచు ని న్నిట్లు నీవు సేవించితేని! 112

తే.గీ. త్రికరణంబులచేత నా దేవదేవు
శరణుఁజొచ్చితి వేని నా సర్వశరణు
డవనమొనరించు నిన్నెప్పు డార్తినుండి
[2] తర్ణకంబును గాపాడు తల్లివోలె. 113

ఉ. అంచితభక్తి హొయ్సళనరాధిపచంద్రుఁడు విష్ణువర్ధనుం
డెంచెను వాసుదేవున కహీనకళారమణీయమైన భూ
మ్యంచితదివ్యలోకనిభమైన మహోజ్జ్వలమందిరంబు ని
ర్మించఁగ నిప్పు, డందుకయి మేలగు శిల్పులఁ జూచుచుండెడిన్. 114

1. ఈ పద్యమునకు భగవద్రామానుజుల శరణాగతిగద్యలోని ఈక్రింది వాక్యములు మూలములు. `అఖిల హేయప్రత్యనీక కల్యాణైకతాన స్వేతరసమస్తవస్తు విలక్ష ణానంత జ్ఞానానందైక స్వరూప! స్వాభిమతానురూపైక రూపాచిన్త్య దివ్యాద్భుత నిత్య నిరవద్య నిరతిశ యౌజ్జ్వల్య సౌందర్య సౌగంధ్య సౌకుమార్య లావణ్య యౌవనాద్యనంత గుణనిధిదివ్యరూప! స్వాభావి కానవధి కాతిశయ జ్ఞాన బలైశ్వర్య వీర్య శక్తితేజ స్సౌశీల్య వాత్సల్య మార్దవార్జవ సౌహార్ద సామ్య కారుణ్య మాధుర్య గాంభీర్యౌదార్య స్థైర్య ధైర్య శౌర్య పరాక్రమ సత్యకామ సత్యసంకల్ప కృతిత్వ కృతజ్ఞతా ద్యసంఖ్యేయ కల్యాణగుణగుణౌఘ మహార్ణవ!` – ఈవాక్యముల పరమార్థమును శ్రీమద్వేదాంతదేశికుల గద్యభాష్యముద్వారా గ్రహించునది;

2. తర్ణకము = అప్పుడే పుట్టిన లేగదూడ.

చం. హితుఁడును, నాకు శిష్యుఁడును, హేయగుణాహితుఁ డైన యమ్మహీ
పతి సముఖమ్ము నీకు సులభమ్మగు నట్లొక కమ్మ వ్రాసెదన్,
అతులితభక్తి దానిఁ గొని నాతనిఁ జూచిన నిన్నతండు శ్రీ
పతినిలయంబుఁ గట్టఁగ ధ్రువంబుగఁ గట్టడిసేయుఁ గ్రక్కునన్. 115

తే.గీ. అనుచు నత్యంతవాత్సల్య మచ్చుపడఁగ
విష్ణువర్ధననృపతికి వివరముగను
భాష్యకారులు లేఖను వ్రాసియివ్వ
వినతుఁడై దానిఁ గైకొని వేడ్కమీర. 116

ఉ. ఆ యతిరాజమౌళికి మహాదరమేర్పడఁ జాఁగి మ్రొక్కి, నా
రాయణపాదపంకజసమాశ్రయణంబుననే నిజార్తినిం
బాయఁగ నెంచి జక్కనయుఁ బైనముగట్టెను తండ్రితోడ, భూ
నాయకు నోలగంబును గనంగఁ జనంగను సంభ్రమంబునన్. 117

## వేలాపురీవర్ణనము

ఉ. చట్టులు, పుట్టలున్, సరసిజాకరముల్ గలయట్టి తోఁటలున్,
మిట్టలుపల్లముల్ గలుగు మేదినులుం, గలయట్టి త్రోవ లె
ట్టెట్టొ గమించి చేరుకొనియెం దుది జక్కన దానవారిరాట్
పట్టణసన్నిభం బయిన పట్టణరాజము నొక్కదానినిన్. 118

కం. వేలాపురి యను పేరున
భూలోకమునందు సవతుపొందని దగుచున్
శ్రీలున్ సుకళాంచితలగు
స్త్రీలున్ బొలుపొంద నాపురీంద్రం బమరున్. 119

ఉ. అది యగు రాజధాని సుగుణాఢ్యుఁడు, హొయ్సళరాజవంశవా
ర్నిధివిధుఁ, డచ్యుతాంఘ్రియుగనీరజభృంగుఁడు, నృత్యగానకో
విద యగు శాంతలావిభుఁడు, వీరవతంసుఁడు, విష్ణువర్ధనా
భిధుఁ డగు ఱేనికిన్, నగవిభేదికి నయ్యమరావతిం బలెన్. 120

సీ. కడియంబు చందానఁ గందుకం బింపొందఁ,
గౌశేయరీతి దుర్గంబు గ్రాల,
మృదువాక్కులంబోలె బుధవాక్కు లింపొంద,
మూర్ధంబురీతి గోపురము లొప్ప,
హృదయంబు చందాన నృపవేశ్మ మింపొంద,
చరణంబులంబోలె సరణు లొప్ప,
వదనానిలం బట్లు వనవాత మింపొందఁ,
బ్రాణముంబోలె వైభవము గ్రాల,

తే.గీ. వరగుణంబులఁబోలె నావాసిజనుల
వరగుణంబులు వరలంగ వరలుచుండు
నప్పురీలక్ష్మి లోకత్రయంబునందు
దీటు లేనిదై కర్ణాటదేశమందు. 121

తే.గీ. సర్వవస్తుమహితమైన జగతి యిట్టు
లుండవలె నంచుఁ బరమేష్ఠి యొక్క ప్రతిమఁ
గల్పనముసేసె నను రీతిఁ గ్రాలుచుండు
నఖిలవస్తునిధానమై యప్పురంబు. 122

తే.గీ. అఖిలశాస్త్రనిష్ణాతులై యలరు నచటి
వేదవిప్రవర్యులతోడ వాదుసేయ
'మొగము చాలమిఁ' గాఁబోలు మూడుమొగము
లదనముగ నూని విధి చతురాస్యుఁ డయ్యె. 123

తే.గీ. అచటి రాజులఁ బోలంగ నబ్జవైరి
నిండునిండుగఁ బెరుగంగ నేర్చెఁ గాని,
సహజమై పొల్చు కందువ సైత మటులె
యెదిగి తను గప్పునని సుంత యెఱుఁగఁడయ్యె. 123

తే.గీ. అభ్రములఁ దేలియాడెడు హర్మ్యతలము
లందు నర్తించు నవ్వీటి యాటబోంట్ల
యన్నువును గన్నులార్పక యరసి యరసి
అమరు లనిమేషులై పొల్తు రవిరతంబు. 125

ఉ. చక్కని వృక్షజాలముల చాలులఁ జెన్నగు రాజవీథు, లా
చక్కని రాజమార్గముల చాయలఁ జెన్నగు సౌధవర్గ, మా
చక్కని సౌధవర్గముల సన్నిధిఁ జెన్నగు పూవుదోఁట, లా
చక్కని తోఁటలందుఁ గల శాఖలఁ జెన్నగుచుండుఁ బక్షు, లా
చక్కని పక్షులం గనుచు జాయలతో విహరించుచుందు, రా
చక్కని వీటఁ బౌరులు, నిశాంతములందుఁ, బ్రదోషమందునన్. 126

సీ. పరమమహావీరు ప్రతిమలం జెన్నారు
వరజైనమందిరప్రతతు లొకట,
స్ఫటికంపు లింగముల్ ప్రభలు చిల్కుచునున్న
శైవాలయంబుల చాలు లొకట,
బోధివృక్షాకృతిం బొల్పారఁ గట్టిన
శాక్యసింహుని దివ్యసద్మ మొకట,
అపరవైకుంఠంబులట్లు నిర్మితమైన
శ్రీవైష్ణవాలయశ్రేణు లొకట,

తే.గీ. చంద్రనిప్పుల గుండముల్ సరసఁ గల్గు
వివిధశక్త్యాలయంబుల విసర మొకటఁ,
దనరుచుండఁగ నవ్వీడు దనరుచుండు
సర్వదైవతకేళికాస్థాన మటుల. 127

సీ. గంధంపువిపణుల చందానఁ దనరారు
నవ్వీటి సురభిళోద్యానవనులు,
అనిమేషశిల్పి కర్మాగారములఁ బోలు
నవ్వీటి శిల్పికర్మాలయములు,
వ్యాసాశ్రమంబుల వైఖరిం దనరారు
నవ్వీటి వివిధవిద్యాలయములు,
అశ్వినీసుతుల వైద్యాలయంబులఁ బోలు
నవ్వీటి బహుళవైద్యాలయములు,

తే.గీ. అప్సరోఽంగనా దివ్యాలయంబు లట్లు
బరఁగు నవ్వీటి గణికల భవనగణము,
లమరుఁ గౌబేరభవనంబు లట్టు లచటి
వైశ్యవర్యుల యున్నతవాస్తుతతులు. 128

చం. సుమముల నమ్మువా రొకట, సొమ్ములు, గంధిలవస్తుసంతతుల్
గ్రమముగ నమ్మువా రొకటఁ, గాయలు, బండ్లును బండ్ల నింపి, 'తీ
పి, మధుర' మంచు వెంటఁబడి విల్చెడివా రొకటన్, బ్రదోషపున్
సమయములందుఁ దత్పురిని సంకులమున్ బొనరింత్రు వింతగన్.129

ఉ. అత్తరు గల్పినట్టి జలమందున దోఁగి, జిలుంగుపంచెలం
బెత్తెడు చుంగువోసి తొడి, వెంద్రుక లింపుగ దువ్వి, చిత్రకం
బత్తి లలాటభాగమున, నందపుబావలఁ దొడ్గి, చేరఁగా
వత్తురు వేశ్యవాటికలఁ బల్లవు లప్పురి సంజవేళలన్. 130

ఉ. ఆ సమయంబునందె వివిధాలయసంజనితోరుఘంటికా
ఘోషల నాలకించి వడిఁ గూడుదు రచ్చటఁ బూజకై సద
భ్యాసపరీతచిత్తులగు భక్తులు గొందఱు, వార్షుకాభ్ర ని
ర్ఘోషము విన్నయంత దరిఁ గూడెడి చాతకపక్షులం బలెన్. 131

ఉ. వింతలువింతలై పరఁగు వీథులయందలి దృశ్యసంతతుల్
సంతసమారఁగాఁ గనుచు జక్కన యాపురిఁ జొచ్చువేళ క
హ్నాంతము గాఁగ, నా నిశిని నచ్చటి సత్రమునందుఁ బుచ్చి, భూ
కాంతుని జూడఁగాఁ జనెను కల్యమునందలి కొల్వునందునన్. 132

చం. ఉదయముఁదొట్టి మూఁడవ ముహూర్తమునందున విష్ణువర్ధనుం
డుదయదినేశువోలెఁ గొలువుండి, దిదృక్షను వచ్చుపౌరులన్
బుధులను, నన్యదేశ్యులను, భూరికృపామతి నాదరించి, త
న్ముదకరమైన యర్థము లనూనముగా దయసేయు నిత్యమున్. 133

తే.గీ. అట్టి రాజేంద్రసందర్శనార్థి యగుచు
భాష్యకారుల లేఖను పాణిఁ బూని
త్వరగనే యేఁగె జక్కన పార్థివేంద్రు
నోలగంబును జేరంగ నుదయమందు. 134

విష్ణువర్ధనమహారాజ సభావర్ణనము

చం. అటు సని కాంచె శిల్పివరుఁ డద్భుతశిల్పకళాభిరమ్యమై,
ఘటితసువర్ణకుంభమయి, కాంచనరమ్యకవాటయుక్తమై,
చటులవితానరమ్యమయి, చంచలకేతననర్తనాఢ్యమై,
స్ఫటికగిరీంద్రతుల్యమయి, భాసిలు రాజసభానికేతమున్. 135

తే.గీ. అమరనాథుని సభచంద మందమైన
ఆ సభాగ్రమునందున నందమయ్యె,
రత్నసింహాసనం బొండు రమ్యహార
మందు నందమౌ తరళంబు చందముగను. 136

తే.గీ. అంబుజాంతరస్థిత వరాటంబు రీతి
నున్నతంబగు వేదిపై నుండె నదియు;
వేది వెన్క ద్వార మొకటి వెలసియుండె
హాటకకవాటములు దాని కమరియుండె. 137

తే.గీ. వేదికిన్ నిమ్నతలమందు వెలసియుండె
రెండువైపుల నాసనశ్రేణు లచట;
వానిపైఁ గూరుచుండెను ప్రభుత నడపు
వాహినీపతి, సచివాది వర్గ మెల్ల. 138

తే.గీ. వారి తరువాత నుండిరి భరత, వాస్తు,
వేద, సంగీత, సారస్వతాది వివిధ
శాస్త్రవిజ్ఞానఖనులును, జైనమునులు,
ఫణిఫణంబున భాసిల్లు మణుల కరణి. 139

తే.గీ. ఆ సభాంగణాంతమునందు నలరునట్టి
భూరిమండపమందున భూమినాథుఁ
జూడవచ్చిన వారలు గూడియుండ్రి;
రాజుకై కాచుకొను చకోరంబు లట్లు. 140

తే.గీ. అంతలో విననయ్యె ఘంటారవంబు,
పిదప మ్రోగెను బూరెలు, భేరితతులు;
పైని సుషిరమర్దలములు ప్రక్కఁ బాడఁ
బాడఁ దొడగిరి మగధులు పాట నిట్లు. 141

చతురస్రగతి. జయ ఎరయంగక్ష్మాపతిపుత్రా!
జయవినయాదిత్యరసాధిపపౌత్రా!
జయ హొయ్సళలక్ష్మ్యాలింగితగాత్రా!
జయజయ విష్ణుమహీభృత! సాధుచరిత్రా!

జయ కేరళనృప, చోళాధిప, పాండ్యేశ్వర దర్పాపహ!
జయ యాంధ్రాధిపగజకేసరి! జయ లాటేశ్వరజంఝానిల!
జయ యదుకులవర్ధనకర! జయ శాంతలామనోహర!
జయజయ గుణరత్నాకర! జయ విష్ణువర్ధనేశ్వర! 142

శ్లో. [1] జయతు ధరణి లోకోత్తంసికాత్మీయపాదః,
చతుర విబుధగోష్ఠీ ప్రౌఢవాణీవినోదః,
సకల భరతవిద్యాహృద్యగంభీరభావః,
విపుల విజయలక్ష్మీవల్లభో విష్ణుదేవః॥ 143

తే.గీ. అంతలోఁ దెఱచికొనె సింహాసనంబు
గలుగు వేదికి వెన్కను గలుగు తలుపు,
లల ప్రభాతమందు వివృతంబులయినట్టి
అంబుజాతపత్త్రంబుల డంబు నలరి. 144

సీ.తు. సద్గుణంబులయందు, సౌందర్యమునయందు,
రామునికిఁ, గామునికిఁ బ్రతియైనవాని,
ధైర్యంబునందునన్, దాతృత్వమందునన్,
సురగిరికి, సురగవికి సరియైనవాని,
శౌర్యంబునందునన్, సౌభాగ్యమందునన్,
త్ర్యక్షునకు, యక్షునకుఁ బ్రతియైనవాని,
దుష్టశిక్షణయందు, శిష్టరక్షణయందు,
జమునికిన్, శౌరికిన్ సరియైనవాని,

తే.గీ. మాన్యుఁ డగువాని, మణిరాజిమహితమకుట
రాజితుండగువాని, ద్వారంబు చెంత
విష్ణువర్ధనదేవుని వీక్షసేసి
సాదరంబుగ నిల్చిరి సభ్యు లంత. 145

1. బేలూరు శాసనములు 51,71 (క్రీ.శ. 1117)

తే.గీ. శేషతల్పమునందు నాసీనుఁడైన
శ్రీమహావిష్ణువుంబోలి, సింహపీఠి
విష్ణువర్ధనుఁ డంత నివిష్టుఁడయ్యె,
పాలసంద్రముఁబోలు సభాగ్రమందు. 146

తే.గీ. అంత సభ్యులు నమ్రులై యాసనముల
నధివసించిరి; యాపైని నధిపుఁ జూడ
నరుగుదెంచిన ప్రజలను వరుసమీరఁ
జీరఁగాసాగె రాజాధికారి యొకఁడు. 147

జక్కన విష్ణువర్ధనమహారాజును సేవించుట

ఉ. చక్కఁగ నిట్లు బిల్వఁబడి జక్కన ముందుకు సాగి నమ్రుఁడై
మ్రొక్కి నృపాలచంద్రునకు, మోదభయంబులు పెన్గొనంగఁ దా
జక్కఁగఁ దాచికొన్న యతిచంద్రునికమ్మను ఠేనిదోసిటన్
మక్కువమీర నుంచిన క్షమాధవుఁ డద్ది గ్రహించి నెమ్మిమైన్. 148

కం. రామానుజగురువర్యులు
ప్రేమంబున వ్రాసినట్టి వృత్తాంతముగా
నామోదించుచుఁ దల్లే
ఖామయసారాంశము, మహికాంతుం డటుపై. 149

తే.గీ. గారవంబొప్ప నా లేఖఁ గన్నుఁగవకు
నద్దికొని, తనమ్రోల బద్ధాంజలుఁడయి
నిల్చియున్నట్టి యువశిల్పి నిబిడతరకృ
పావిలోకనంబులఁ గాంచి పలికె నిట్లు. 150

శా. కర్ణాకర్ణిగ జక్కనాఖ్య! మును పాకర్ణించియుంటిం గదా!
`వర్ణింపంగ నశక్యమైన రుచిరత్వం బూని, సప్రాణమై,
పూర్ణానందదమౌచు డెందమునకుం బొల్పారు సచ్ఛిల్పవి
ద్యార్ణోరాశి కగస్త్యమూర్తి `వని నిన్నగ్గింతురంచున్ బుధుల్. 151

ఉ. దానికిఁ దోడు నిప్పుడు మదన్వయతారకులైనవారు రా
మానుజదేశికేంద్రులు త్వదర్థము వ్రాసిన లేఖయందునన్
నీ నిపుణత్వమున్, వినయనిర్భరతన్, దయనీయదుస్థితిన్,
మానుగఁ జెప్పియుండి, రిఁక మాకగు వారలవాక్కు వేదమే! 152

తే.గీ. తలచినది దైవకార్యము, దానిఁ దీర్ప
నార్యుఁడగు గురువర్యుఁడే యంపె నిన్నుఁ;
ఇట్టు లన్నియు సమకూడు టీశ్వరేచ్ఛ
దక్క నన్యంబు గాదంచుఁ దలఁతు నేను. 153

ఉ. కావున శిల్పకారకులకంధిశశాంక! ప్రధానశిల్పివై
శ్రీ విభులీల లెల్ల వివరించు ప్రబంధము నాఁగ నొప్పు ల
క్ష్మీ విభు దేవళంబును విచిత్రవిధిన్ విరచింపుమయ్య! మ
ద్దైవతభక్తి కయ్యది పతాకముగా వెలుగొందు నట్లుగన్. 154

కం.తు. తన వైకుంఠము కన్నను
ఘనగరిమాఢ్యం బగునటు గట్టిన యేతద్దే
వనివేశనమందుననే
గొనకొని కొల్వుండుఁగాత గోవిందుం డెపుడున్. 155

ఉ. ఇంకను శిల్పిచంద్రమ! యహీనతరాద్భుత* లాస్యనైపుణిన్
శంకరురాణి మించునది, శాంతల, పట్టపురాణి, మన్మనః
పంకజమోదకారిణి, ప్రభాతమునందున, సంధ్యవేళలన్,
శంకరుఁ గొల్చుచుండును నిజాద్భుతలాస్యనివేదనంబునన్. 156

ఉ. ఆ నటనాసరస్వతి నవాద్భుతభంగిమ లేర్చికూర్చి వి
న్నాణముతోడ రమ్యనటనంపునిఘంటువుగా రచింపు మో
యీ! నవమోహనంబయిన యింటిని మాయిలువేలుపైన ల
క్ష్మీనయనారవిందహరికిన్, హరికిన్, దురితాపహారికిన్. 157

* పార్వతి చేయు లలితనృత్యమునకు లాస్యమనియు, శివుని ఉద్ధతనృత్యమునకు తాండవమనియు పేర్లు.

ఉ. అంతియకాక జక్కన! మహాదురితాత్ముఁడు, వంచకుండు, న
శ్రాంతపరాంగనారతుఁడు, స్వార్థపరుండగు గూళిదేవునిన్
పంతముఁ బట్టి తెచ్చి పడవైతును నీ చరణాల చెంగటన్,
అంతముసేతు వాని మద మందఱు నందమునంద నిద్ధరన్. 158

మ. అను చత్యంతకృపాళుఁడై పలికి యా జ్యానాథుఁ డాశిల్పినిన్
ఘనజాంబూనదవస్త్రదక్షిణలచే గావించి సంతృప్తునిన్,
సునిషేవ్యంబగు నొక్కరాడ్భవనమున్ సూచింప వాసార్థమై,
ప్రణతుండై విభు మ్రొక్కి, వీడె నతఁ డాప్రాసాదమున్ జేరఁగన్. 159

జక్కనకు మల్లికావృత్తాంతము కలలో స్ఫురించుట

చం. నృపతి ప్రసన్నుఁడైన గతి నెమ్మనిఁ దండ్రికిఁ దెల్పి, తన్నరా
ధిపవరదత్తమైన వసతిం బితతోడుతఁ జొచ్చి, కొంతగా
నుపశమియింపఁగా వనట యూరటనొంది మనంబునందు, నా
స్థపతికులేంద్రుఁ డా నిశినిఁ దంద్రితుఁడై నిదురించె వైళమే. 160

కం. ఈలీలను బెల్లుగ ని
ద్రాళుండగు నా స్థపతిహృదర్ణవమందున్
వేలాకృతి నొక స్వప్నము
గ్రాలుకొనెఁ జతుర్థయామకాలమునందున్. 161

కం. భావుకమును, నిజజాయా
కావేరీపతనవిషయగర్భితమును నై
భావంబున నా స్వప్నం
బీ విధమునఁ దోఁచెను స్థపతీంద్రునకు నిశిన్. 162

చం. శ్వశురుని గావఁగాఁ దొడరి శైవలినిం బడినట్టి మల్లికా
శశిముఖి తీవ్రమౌ నలల సంహతిచే స్పృహదప్పి పోవుచున్,
వెసవెస నా ప్రవాహగతవేగముచే బహుదూర మేఁగి, యె
ట్లొ సలిలమధ్యవర్ధితతరూత్కరకుంజములోఁ దగుల్కొనన్. 163

ఉ. ఆమెను జూచి బేచనసమాఖ్యను నీరెడు ధీవరుం డొకం
'డేమి విచిత్రమో యిది, ధునీస్థితకుంజ మదేడ? దానిలో
నీమెయిఁ గాంత చిక్కుకొను టేడ?' యటంచు వెఱంగు నించి, తా
నామెను గావఁ దత్క్షణమె యాపగయందున దూఁకి తేకువన్. 164

చం. కరి కరమందు దూసికొను కంజలతంబలె నాలతాంగినిం
గరముల నెత్తి పట్టుకొని కాళులు గొట్టుచు నీది యల్లనన్,
దరి కలనల్లఁ జేరిచి తదంగన, నాతఁడు ప్రాథమికోపచారముల్
దరమిడి సల్పఁగాఁ దుదకుఁ దత్తరుణీమణి పొందెఁ దెల్వినిన్. 165

తే.గీ. తెలివినొందియు దౌర్బల్యకలిత గాన
నడువఁజాలకయున్న నా పడఁతి నతఁడు
బుజముపై నిడికొని తెచ్చి నిజకుటీర
మందు నాశ్రయంబు నొసంగి మందు లొసఁగ. 166

మత్తకోకిల. ఎట్టకేలకు నా సతీమణి యింత సత్త్వము నూనుచున్
దొట్టువాఱు కృతజ్ఞతం గయిదోయి మోడ్చుచు వానికిన్,
బుట్టలోఁగల పాము బైటికిఁ బుచ్చినట్టుగ సర్వమున్
నిట్టలంబుగఁ జెప్ప నాతఁడు నివ్వటిల్లెడు కూర్మితోన్. 167

ఉ. 'అమ్మరొ! మల్లికాసతిరొ! ఆత్మగృహం బని యెంచి నాదు స
ద్మమ్మున నెన్ని నాళ్లయిన మానితరీతి వసింపుమమ్మ! నే
నెమ్మెయినేని నీదుపతి నిచ్చటికిన్ వెదకించి తెచ్చెదన్,
నమ్ముము నాదుమాట, నిఁక న న్ననుజన్మునిగాఁ దలంపుమా!' 168

కం. అని యతఁ డాశ్రయ మొసఁగన్
వనితారత్నం బెటులనొ వంత న్మదిలో
ననె మ్రింగికొనుచు నచ్చో
టుననే యుండం గ్రమముగ దొరలెం దినముల్. 169

తే.గీ. ఇట్టు లుండఁగ నా యింతి యేటఁ గ్రుంకు
నాటికే గర్భవతిగ నున్నందువలన
మాసములు నిండి యొక శుభవాసరమున
నిండునెలఁబోలు నొక మగనిసుఁగుఁ గనియె. 170

ఉ. నిండు గులాబిచెండువలె, నీరజముంబలె, నిగ్గులీను నా
కొండికవాని కా పడఁతి కూరిచి డంకననామధేయమున్,
పాండురపక్షచంద్రువలె బాలుఁడు నిత్యవివర్ధమానుఁడై
యుండఁగఁ గాంచుచుం బతివియోగము నెట్లొ సహించియుండఁగన్. 171

చం. అడుగులువేయఁగాఁ దొడఁగినప్పటినుండియె బాలకుండు దా
నెడఁగల దారుఖండముల నింపుగఁ బేర్చి గృహంబుఁ గూర్చు, నిం
పడరఁగఁ బల్కపైఁ బువుల నద్రులఁ బక్షుల వృక్షజాతులన్
వడివడిగం దనంతటనె వ్రాయుఁ, బరీక్షగఁజూచు నశ్మముల్. 172

తే.గీ. సరసఁ గల్గిన బహువస్తుచయముయొక్క
రంగులను రూపురేఖల న్వింగడించు;
హర్షభయశోకరోషాదులైన భావ
ములను జూపు చిత్రంబులఁ జెలఁగి వ్రాయు. 173

సీ. పులు దెచ్చి గూండ్లను వలభిలో నిర్మించు
కలవింకముల వింతకరణి వ్రాయు,
పులుమేయు నావుల పొదుగులం బాల్ద్రావు
తర్ణకంబులసౌరుఁ దరిచి వ్రాయు,
అఱుతం గఱచుకొని చిఱుతలం గొనిపోవు
పిల్లి మాతృత్వంపువిధము వ్రాయు,
చుఱుకుగా నురుకుచుం దరుకాండములఁ బ్రాకు
నుడుతపిల్లలతీరుఁ దొడరి వ్రాయు,

తే.గీ. లేటిపరుగులయందలి నీటుదనము,
చేపయీతలయందలి చిలిపితనము,
అన్నియును దాను గన్నవి గన్నయట్లు
చిత్రములుగ వ్రాయు నతండు చిత్రముగను. 174

తే.గీ. ఆఱు వర్షాలవాఁడైన యపుడె యతఁడు
మట్టిబొమ్మల నిర్మించు మంజులముగ;
లేగదూడలు, పిల్లులు, లేటిగములు,
వాటిలోన జీవంబుతో వఱలుచుండు. 175

తే.గీ. ఏడువర్షాలు నిండిననాఁడు మొదలు
°బహువిధంబులఁ జెలువారు బండఱాలఁ
జిఱుతఱాలను గొట్టుచుఁ జెవినియొగ్గి
వినును వివిధాశ్మజారవవిధము లతఁడు. 176

మ. ఒకనాఁ డాతఁడు తోడిబాలకులతో నుత్సాహసంస్ఫూర్తిమై
నొక యాటాడచునుండి గెల్వ, నతిగర్వోద్వృత్తులై వార లొ
ప్పక యాబాలునిఁ గొట్టి, 'చూతము మమున్ వారింప నీతండ్రియో
యిఁక నీతల్లియొ వచ్చువా' రనుచు నెంతేనిం బ్రలాపించినన్. 177

చం. అవమతిచేతఁ గ్రుంగి, యతఁ 'డన్యులకుంబలె నన్నుఁ గావఁగా
సవితృఁడు చెంత లే' డనుచుఁ జాల విచారము నొంది, తల్లితో
సవితృని గాంచి తెత్తునని సంద్రుఢచిత్తముతోడఁ బల్క నా
నవజలజాక్షి వానిఁ గరుణాయతదృష్టులఁ గాంచి యిట్లనెన్. 178

తరలము. 'అరయ శక్యమె నీకుఁ దండ్రిని? ఆస లేటికి రిత్తగన్?
అరయఁగా మును బేచనాయకుఁ డంపియుండిన యోధులే
గరిమ ధాత్రిని జుట్టి త్వత్పితఁ గానకుండఁగ వచ్చి, రే
కరణి నాతని జూతు వర్భక! కట్టిపెట్టుము బీరముల్. 179

ఉ. చెక్కులు గిల్లఁగా నొలుకు చిక్కని పాలును, దేనెవాకలున్,
పొక్కను నీదుపాదములు పూవులదారులవెంటఁ బోయినన్,
తక్కక కందు నీ ముఖము తాఁకిన లేఁత దివాకరాంశులున్,
ఎక్కడి కేఁగెదోయి? బలహీనుఁడ వజ్ఞుఁడ వర్భకుండవున్!' 180

కం. అని వారించెడి మాతం
గని బాలుఁడు పట్టువిడక కయ్యము సేయన్
విని బేచన వారిం గని
యనె ని ట్లతిహర్షకౌతుకాంచితమతియై. 181

చం. వినుడిది సావధానముగఁ, బ్రీతికరంబగు వార్త వింటి, 'స
ద్వినుతయశస్కుఁడైన పృథివీతలనాథుఁడు విష్ణువర్ధనుం
డొనరఁగ జక్కనార్యువలె నున్న యొకానొక శిల్పివర్యునిం
ఘనముగఁ గేశవాలయముఁ గట్టఁగఁ బంచె' నటన్నదానినిన్. 182

కం. భూలోకవికుంఠమువలె
బేలూరునఁ గట్టుమనియె విష్ణ్వాలయమున్
క్ష్మాలోలుం డా శిల్పికు
లాలంకారు నను వార్త యాశ్రుతమయ్యెన్. 183

ఉ. కాన లతాంతతన్వి! కడుకష్టము, దూర, మసాధ్యమం చెదన్
బూనక సంశయంబు నిఁకఁ బోదము నీవును, నీకుమారుఁడున్,
నేనును, బోయి విష్ణుధరణీశుని గొల్చుచునున్న శిల్పినిన్
మానుగఁ జూచివత్త, మనుమాననివృత్తిని జేసికొందమున్. 184

తే.గీ. అనెడు బేచనవాక్కుల నాలకించి,
మల్లికాడంకనల్ మది వెల్లివిరియు
హర్షరసమునఁ బైరైన యంకురములఁ
బోలు పుల్కలఁ దనువులఁ బూని రపుడు. 185

ఉ. కనుమఱుఁగైన మల్లికను గన్నులముందర నిల్పుచున్న యా
యనుపమమైన స్వప్నము యథార్థమటంచుఁ దలంచి లేచి, జ
క్కన యెలుగెత్తి పల్కె, 'ప్రియకామిని మల్లిక! పుత్ర డంకనా!
ననుఁ గన వచ్చినారె? యినినాళ్లెట మీరలు డాగియుంటిరే? 186

ఉ. కన్నుల వత్తి వైచికొని కాంచితిఁ దెన్నులు మీకునై సదా,
మున్ను సుఖప్రదంబులగు భోగములెల్లఁ బరిత్యజించితిన్,
ఎన్నడు వత్తురో యని గణించితి ఘస్రము లేండ్లుగా మదిన్,
దిన్నగఁ జేర వచ్చితిరె, తీర్పఁగ నావెత నెట్టకేలకున్?' 187

తే.గీ. అనుచుఁ బల్కుచు నున్నంత నల్లనల్ల
మత్తు జారిపోయెను శిల్పిసత్తమునకు,
తాను గన్నది కలయన్న జ్ఞాన మొదవి
గుప్పునం దల్పమందునఁ గూలె నతఁడు. 188

ఆశ్వాసాంతము

కం. వారిధిభంజన! సన్ముని
వారమనోరంజన! సురవైరిధ్వజినీ
ధారాధరప్రభంజన!
స్ఫారాఘద్విజగరుద్విభంజన! శౌరీ! 189

తరలము. గరుడవాహన! ఆశ్రితావన! కౌస్తుభాదివిభూషణా!
సురుచిరానన! సృష్టికారణ! సూర్యచంద్రవిలోచనా!
దురితవారణ! మోక్షకారణ! దుఃఖితార్తినివారణా!
పరమపావన! సర్వకారణ!వంశికారవమోహనా! 190

తే.గీ. విమలసత్యతపోధ్యానవిదితరూప!
సాధుహృత్కుండసంస్ఫురద్జ్ఞానరూప!
వేదశాస్త్రపురాణసంవేద్యరూప!
భక్తివిత్తైకవిక్రేయభవ్యరూప! 191

కం. వాసిగ నిది మైదవ యు
ల్లాసంబై తనరును రసలలితంబుగ శ్రీ
దేశికుఁడను కవిచంద్రుఁడు
వ్రాసిన 'జక్కనచరిత్ర' వరకావ్యమునన్. 192






కం. శ్రీ రూపిణి ధరణిజతో,
మారుతి, భరతాదిబంధుమండలి, ప్రజలుం
జేరి భజింప, నయోధ్యం
జేరి సదభిషిక్తుఁడైన శ్రీపతిఁ గొలుతున్. 1

## విష్ణువర్ధనుని రాణులు

తే.గీ. విష్ణువర్ధననృపతికి వెలయుచుండ్రు
శాంతలా, లక్ష్మ లిర్వురు జాయ లగుచు,
హరికి శ్రీదేవి, భూదేవు లైనయట్లు,
హరునకుం బార్వతీ, గంగ లైనయట్లు. 2

తే.గీ. విష్ణువర్ధనభూపతి పితరుఁడైన
వీర ఎరయంగభూపతి గారవమున
తనదు నాస్థానమునకు మండనము గాఁగ
తెచ్చికొన్నట్టి వైష్ణవతిలకుఁ డైన
పెరుమలైపండితుని కూర్మిబిడ్డ లక్ష్మ
అవనిపతి కిష్ట [1] వావాత యగుచునుండె. 3

---

1. వావాత = రాజుయొక్క రెండవ భార్య.

సీ. సంగీతసాహిత్యసర్వజ్ఞుఁడగు ప్రభా
చంద్రున కేయింతి ఛాత్రి యయ్యె,
గిరిరాజనందనాచరణాబ్జభృంగియై
ధన్యత్వ మేయింతి తాల్చియుండె,
భరతనాట్యాగమప్రాసాదనిహితప్ర
దీపమై యేయింతి తేజరిల్లె,
లావణ్యసింధువేలాయమానంబైన
తనుకాంతి నేయింతి తనరుచుండె,

తే.గీ. మంత్రి యగు మారసింగయ్య, మాచకబ్బె
తాతమాతలై తనర నే నాతి బ్రాతి
కెక్కె, నామె శాంతల, ఈని కిష్టసతియుఁ
బట్టమహిషియు నగుచు నింపారుచుండె. 4

తే.గీ. తోడు విడకుండ బాల్యంబుదొట్టి యున్న
వారి నిర్వుర వేఱ్వరుపంగ లేక
పరిణయంబాడె నిర్వురం ధరణివిభుఁడు;
సఖ్యముగ నుందు రందుచే సవతు లెపుడు. 5

ఉ. అంచితరీతి శాంతల మహాశివు మ్రోలఁ బ్రభాతవేళలన్,
కాంచనమూర్తియై యినుఁడు కంధిని గ్రుంకెడు వేళలందుఁ, గా
వించుచునుండు నాట్యమును, వీణను మీటుచు లక్ష్మి యత్తరిన్
బంచన నుండి శ్రావ్యముగఁ బాడును తన్నటనోచితంబుగన్. 6

## వైతాళికగీతులు

ఖండగతి. ఆనాటి ఉదయాన ఆకర్ణితము లయ్యె
పూని నిద్రాలోకమున నింక విహరించు
రాణినిన్ శాంతలన్ బ్రాభాతగీతికల
జానుగా మేల్కొల్పు చాక్రికుల నాదముల్. 7

అర్ణవంబను దండకము.

జయము! జయము! శాంతలా! శ్రీ ప్రభాచంద్ర మౌనీంద్ర కా
రుణ్య సంపాది తాశేష నృత్యాది విద్యానిధీ!
యదుకులమణి విష్ణుభూపాల చేతోనురాగాబ్ధి సం
వర్ధ కోదారరాకేందులేఖా మనోజ్ఞాకృతీ!
నవరస రచితోరు చిత్రాయమానాస్యవిన్యాస, ర
మ్యాంగ విక్షేపసంయుక్త లాస్యామరీజిత్వరీ!
అగణితగుణనీరధీ! భారతీ భార్గవీ పార్వతీ
పార్శ్వనాథాంఘ్రిరాజీవ లీలాభ్రమత్ షట్పదీ! 8

కం. అమ్మా! ప్రభాత మయ్యెను
లెమ్మా! శాంతల! సునాట్యలీలల శివునిం
సమ్మోదితుఁ జేసెడు తరు
ణమ్మిదె యేతెంచెనమ్మ! నాట్యబ్రాహ్మీ! 9

చం. అపరిమితోచ్ఛ్రితంబులగు నాగమకూటము లెక్కి చూచుచుం
జపలవిలోచనా! కనుము, సద్ద్విజవర్గము సందడించెడిన్
'అపరదిశాబ్ధిలోఁ బడిన యబ్జహితుం డిదె వచ్చుచుండెఁ దా
నపగతశోకుఁడై' యనుచు నబ్జినికిం దెలుపంగనో యనన్. 10

చం. కొలఁకులఁ బద్మినీకులము కోరిన భర్త లభింపనుండె, మా
కలఘురసాంచితంబులగు నామెత లబ్బగనుండె నింక నం
చలికులముల్ ప్రమోదమున నల్లదె చేరెఁ దటాకతీర మో
చలదళివేణి! యా యళులచందమునుం దరిసింప లెమ్మికన్. 11

చం. గుమగుమవాసనల్ దెసల గుప్పునఁ జిమ్మెడి పారిజాతపున్
సుమముల రాల్చి, నేల నవి సోఁకక ముందె నిజోర్మిహస్తచం
క్రమణగృహీతతత్కుసుమకాండయుతుండయి పైకి లేచుచున్
సుమసమగాత్రి! వాయు విదె సూర్యుని నర్చయొనర్పఁ బోయెడిన్. 12

* సీ. పూర్వాద్రికూటముల్ పుష్కరకూటముల్
ప్రాప్తసౌరభములై పరిఢవించె,
కుక్కుటనదములుం, గోకనదంబులున్
విద్యోతితములయ్యె విరివిగాను,
చక్రానురాగముల్ చాక్రికరాగముల్
సంవర్ధితములయ్యె సరసముగను,
తారాగణంబులు, దారాగణంబులు
విరమితశుచివృత్తి వెలయుచుండె,

తే.గీ. ప్రగ్రహచ్యుతానడ్వాహపథము, లుడుప
థంబు,విగ్రహగతులతోఁ దనరుచుండె,
శాంతలాదేవి! సమ్రాజ్ఞి! శయన ముడిగి
కనఁగరావమ్మ! ఈదృశ్యగణము నింక.' 13

మల్లిక మహేశ్వరుని మ్రోల నాట్యమాడఁ బోవుట

కం. ఈదృశ వైతాళిక వద
నోదిత మృదుగీతరుతుల నుత్థితయగుచున్
మోదంబున శాంతల సూ
ర్యోదయకాల్యంబుల వడి నొనరిచి యటుపై. 14

*పూర్వాద్రికూటముల్ = తూర్పుకొండ శిఖరములు, పుష్కరకూటముల్ = పద్మముల సమూహములు, ప్రాప్తసౌరభములై = పొందబడిన సూర్యకాంతి (సౌర+భములు + ఐ) గలవై, సువాసనగలవై ; పరిఢవించె = అతిశయించెను; కుక్కుటనదములున్ = కోడికూతలును, కోకనదంబులున్ = ఎఱ్ఱతామరలును, విద్యోతితములయ్యె(న్) = ప్రకటమయ్యెను, ప్రకాశించెను, విరివిగాను; చక్రానురాగముల్ = చక్రవాకపక్షుల యొక్క అనురాగములు, చాక్రికరాగముల్ = వైతాళికగీతులయందలి రాగములు, సరసముగను = శృంగారరసయుక్తముగ, శ్రావ్యముగ, సంవర్ధితములయ్యె = వృద్ధినందెను; తారాగణంబులు = చుక్కల సమూహములు; దారాగణంబులు = భార్యల (ప్రియురాండ్ర) సమూహములు, విరమిత = ఎడలింపఁబడిన, శుచివృత్తి (న్) = కాంతితోఁ గూడిన వర్తనముచేతను, శృంగారరసమునందలి వర్తనముచేతను (అనగా పగ లగుటవలన భార్యలు పతులతో గూడి రమింపకుండిరని భావము), వెలయుచుండె; ప్రగ్రహచ్యుత + అనడ్వాహపథములు = పగ్గములవలన విడువఁబడిన ఎద్దులదారులు (అనగా ఉదయమునఁ గట్టుకొయ్యల నుండి విడువఁబడిన ఎద్దులుగల దారులు), ఉడుపథంబు= నక్షత్రమార్గము (ఆకాశము), విగ్రహ గతులతో= పోట్లాటలయందలి నడవడికలతో (అనగా విడువఁబడిన యెద్దులు దారులందు పరస్పరము కుమ్ములాడు కొనుచుండెనని భావము), గ్రహగతిశూన్యమై (పగ లగుటవలన ఆకసమున గ్రహములు కనబడకుండెనని భావము), తనరుచుండె = ఒప్పుచుండెను.

చం. జలకములాడి, ఫాలమునఁ జక్కనిబొట్టును దీర్చి, మేనిపై
వలిపెపుఁజీరఁ దాల్చి, పయి పట్టుకుసుంభపురంగు శైకనుం
బొలుపుగఁ బూన్చి, కింకిణులఁ బొల్పగు నూపురయుగ్మ మంఘ్రులం
జెలువుగ నూన్చి, భూతలముఁజేరిన యచ్చరలేమఁ బోలుచున్. 15

ఉ. చేరఁగరాగఁ దోడుగను చేటులు గొందఱు శాంతలామనో
హారిణి కోటయందలి మహాశివుమందిరమున్ ద్రుతంబుగం
జేరఁగ నేఁగె, లక్ష్మియును జెల్వుగ వీణను మీట నా శివా
గారముఁ జేరె నప్పటికె కాంతలు గొందఱు తన్నుఁ గొల్వఁగన్. 16

తే.గీ. అంతలోఁ బ్రాతరర్చన మంతమయ్యె,
అపుడు రుద్రసూక్తముతోడ నర్చకులును
రాజచూడున కిడిరి నీరాజనంబు
రాజపత్నుల కిడిరి తీర్థాదికంబు. 17

ఉ. రాతిరి స్వప్నలోకమున రాజనిభాస్యను మల్లికాసతిన్,
జేతముఁ దన్పుచున్న తనచిన్నికుమారుని డంకనాఖ్యునిన్,
బ్రీతిగఁ గాంచి, వారలు లభింపమిఁ గ్రమ్మిన వంతనుండి యా
కూతము నెట్లొ త్రిప్పికొనఁగోరుచు జక్కన యాయుషస్సునన్. 18

తే.గీ. కాల్యములఁ దీర్చి, స్నాతుఁడై, గారవమున
విష్ణువర్ధనుండు తనకు విడిదిసేయ
నొసఁగియుండిన భవనంబునొద్ద నున్న
ఆ మహేశాలయంబున కరిగి త్వరగ. 19

తే.గీ. కవులు, శిల్పులు, నాలేఖ్యకారవరులు,
అవనిసురులును సభ నుండి యరయుచుండ
శంభుమ్రోలను నవరంగశాలలోన
నాట్యమాడెడి శాంతల నతఁడు గనెను. 20

శాంతలానాట్యము

ఉ. మేలుగ లక్ష్మి వల్లకిని మీటుచుఁ బాడుచునుండ, వంశి నిం
కోలలితాంగి యూదఁగ, మఱొక్కతె మద్దెలఁ గొట్టుచుండఁగన్,
శైలజ శీతలాద్రిపయి శంభునిఁ గొల్చెడు దృశ్యమున్ కళా
శ్రీలలితంబుగ న్నటనసేయుచునుండెను రాణి యచ్చటన్. 21

* పల్లవి: సంసేవనార్థాయ లలాటనేత్రం
శైలేంద్రపుత్రీ ప్రవివేశ తత్ర ...

చరణం: అశోక నిర్భర్త్సిత పద్మరాగమ్
ఆకృష్ట హేమద్యుతి కర్ణికారమ్
ముక్తాకలాపీకృత సిందువారం
వసంతపుష్పాభరణం వహంతీ ... ‖ పల్లవి ‖

ఆవర్జితా కించిదివ స్తనాభ్యాం
వాసో వసానా తరుణార్కరాగమ్
పర్యాప్త పుష్పస్తబకావనమ్రా
సంచారిణీ పల్లవినీ లతేవ ... ‖ పల్లవి ‖

స్రస్తాం నితంబా దవలంబమానా
పునఃపునః కేసరదామ కాంచీమ్
న్యాసీకృతాం స్థానవిదా స్మరేణ
మౌర్వీం ద్వితీయా మివ కార్ముకస్య ... ‖ పల్లవి ‖

సుగంధి నిశ్శ్వాస వివృద్ధ తృష్ణం
బింబాధరాసన్న చరం ద్విరేఫమ్
ప్రతిక్షణం సంభ్రమలోల దృష్టిః
లీలారవిందేన నివారయంతీ ... ‖ పల్లవి ‖ 22

* పల్లవి స్వకల్పితము. చరణము లన్నియు కాళిదాసకుమారసంభవములోని తృతీయసర్గమునందలి శ్లోకములు. ఈ శ్లోకముల యర్థము 24 నుండి 27 వఱకు గల పద్యములలో సంగ్రహింపఁబడినది.

తరలము. అనుచుఁ గోకిలరావ మూనుచు నాలపింపఁగ లక్ష్మి, తా
ననుపమంబగు నృత్యభంగిమ లా రవానుగుణంబుగా
నననిమేషము సృష్టిఁజేయుచు నాడె శాంతల యంతటన్
ఘనవిరావమువెంట నర్తిలు కాలకంఠము పోలికన్. 23

ఉ. ఇంపగు పద్మరాగములనే నిరసించు నశోకసూనముల్,
సొంపగు జాళువామిసిమి సోనలువాఱెడి కర్ణికారముల్,
మంపువహించి ముత్తెములమాడ్కి వెలింగెడి సిందువారముల్,
పొంపగు నన్యపుష్పములప్రోవులునుం దొడి వచ్చు పార్వతిన్ ...24

చం. తరుణదివాకరచ్ఛవివిధారుణవస్త్రపరీతగాత్రయై,
గురుకుచకుంభదంభమునఁ గొంచెము వంగిన యంగమూనుచున్,
వరసుమగుచ్ఛభారమున వంగి చలించెడు నవ్యపల్లవో
త్కరరుచిరప్రతానిని విధంబునఁ బొల్చు నగేంద్రపుత్రికన్ ... 25

తే.గీ. స్థానవిదుఁడైన మదనుండు దాచికొన్న
రెండవదియైన జ్యావోలె వ్రేలుచున్న
వకుళసుమకాంచికన్ నితంబంబునుండి
జారనీయక గ్రహియించు శైలసుతను ... 26

తే.గీ. సురభిళోచ్ఛ్వాసములఁజేసి విరివియైన
తృష్ణతోడ బింబాధరాంతికమునందు
వ్రాలు తేఁటుల సంభ్రమలోలదృష్టి
జాలములఁ జూచి, కేళికాసరసిజాత
చాలనంబున వారించు శంభుసతిని ... 27

తే.గీ. కనుల యెదుటను నిల్పుచు ఘనతరాంగ
హారములు, దృష్టులున్, పాదచారణములు,
వివిధహస్తాభినయనంపు విధులు వొల్చు
చారునాట్యంబు సల్పెను శాన్తలాఖ్య. 28

ఉ. పూవులవింటిజేనివిలు భూమికి జీవముఁదాల్చి వచ్చెనో
యీవిధి నంచుఁ జూపఱు లహీనతరాద్భుతభావబంధుర
శ్రీవివశాత్ములై కనఁగ, శిల్పములెల్ల సజీవమూర్తులై
దేవళమందుఁ గన్గొనఁగ, దీప్తిలె శాంతల నాట్యకేళిలోన్. 29

చం. కరణములెల్ల నాట్యమునఁ గ్రాలెడు చారులు, భంగిమంబులున్,
గరణములున్ గ్రహించుటకె కైవసముం బొనరించి, శాంతలా
తరుణికి మాఱు మల్లికను దత్తనువందున నిల్పికొంచుఁ, దాఁ
బరిమితిలేని మోదరసవార్ధినిఁ దేలెను జక్కనాఖ్యుఁడున్. 30

జక్కన మందిరనిర్మాణపరతుఁ డగుట

ఉ. అంచితరీతి గాంగసలిలాంతరగాహముచేత మున్నుగన్
సంచితమైన పాపములు క్షాళితమై చనినట్లు శాంతలా
భ్యంచితనాట్యగాహమున నాత్మఁ గలంచెడి వంతలున్ బటా
పంచలునైన జక్కన నవంబగు స్ఫూర్తినిఁ దాల్చి యాత్మలోన్. 31

ఉ. ఉర్వికి డిగ్గినట్టి వనజోద్భవురాణినిఁబోలు శాంతలా
పూర్వమనోజ్ఞభంగిమలఁ బొల్పగు పొందితియే నిజార్తినిం
బర్విడఁజేయు నౌషధముభంగి వహింపఁగ, నుద్యమించెఁ దా
నుర్వరలో నపూర్వమగు నోకముఁ గట్టఁగఁ గంసవైరికిన్. 32

తే.గీ. పాంచరాత్రాగమములోనఁ బండితుండు,
భాష్యకారుల శిష్యుండు, వైష్ణవుండు,
లక్ష్మికిం దండ్రి, శ్వశురుండు రాజునకును,
పెరుమలైనామకుండగు విప్రవరుఁడు. 33

శా. ఏచందంబున నెప్పుడెప్పుడెవి గావింపంగ యుక్తంబొ దా
నాచందంబునఁ బాంచరాత్రవిహితంబైనట్టి కర్మాదికం
బాచార్యుండయి నిర్వహించుచును శాస్త్రార్థంబు బోధింపఁగన్,
ప్రాచార్యుండయి జక్కనాఖ్యుఁడును ప్రారంభించె నిర్మింపఁగన్. 34

[1] శ్లో. 'ఐరావతసమారూఢం, నానామణివిభూషితమ్।
చతుష్షష్టికలావిద్యానిపుణం, వదనోజ్జ్వలమ్॥
పీతవస్త్రపరీధానం, కేయూరహారమండితమ్।
చతుర్భుజధరం దేవం ప్రశాంతవదనం మహత్॥
భుజద్వయే సుగర్భాం చాపరే మానధారణమ్।
వందే విష్ణుం మహాతేజో విశ్వకర్మన్ నమోఽస్తు తే॥ 35

శ్లో. యన్త్రమూర్తి ర్మహాకాళీ సర్వవిద్యాస్వరూపిణీ।
సర్వశిల్పమయీ నిత్యా సర్వానందప్రదాయినీ।
సర్వవిఘ్నహరీం దేవీం నమామి యన్త్రకాళికామ్॥' 36

తే.గీ. అనుచు విశ్వకర్మను, మహాయంత్రకాళిఁ
బూజ యొనరించి, యాపైని భూమి దున్ని,
బీజముల నాటి, సస్యంబుఁ బెరుగనిచ్చి,
ఫలితసస్యంబు గోవృషంబులకు మేపి,
భూమివాస్తుల నర్చించి, హోమ మమరఁ
జేసి, పూర్ణకుంభ, మణివిన్యాసవిధుల
శాస్త్రరీతిగ నొనరించి, చక్రి మంది
రార్హభూమి నీరీతి నాయత్తపఱచి. 37

కం. ఆలయనిర్మితి కనువగు
ఱాలను గ్రహియింప నితరరథకారులతో,
భూలోకసుపర్వులతో
వేలాపురి చేరువఁగల [2] విరిమల కెలమిన్. 38

1. ఈ శ్లోకములు ఉద్గాత రామచంద్రకొలచారకృతమైన 'శిల్పప్రకాశ' మను గ్రంథమునుండి గ్రహింపబడినవి.
2. బేలూరుసమీపమందలి పుష్పగిరి (=విరిమల) నుండే శిలలు గ్రహింపబడినవని చరిత్రకారులు చెప్పుదురు.

ఉ. మంగళతూర్యరావములు, మంత్రరవంబులు నిండ దిక్కులన్
మంగళపూర్ణిమాదివసమందున జక్కన యేఁగి యందుఁ బూ
ర్వాంగహవిఃప్రదానమునకై తగు మండప మేర్పఱిచి, యా
యంగములెల్ల శాస్త్రవిహితాకృతిఁ బూర్ణములైన పిమ్మటన్. 39

తే.గీ. విశ్వకర్మను, బ్రాహ్మని, విధిని, మదిని
ధ్యానమొనరించుచుం దీసెఁ దన్నగాన
ప్రథమపాషాణముం, దూర్యరావములును
విహితమంత్రారవంబులున్ వెలయుచుండ. 40

తే.గీ. ఆ నిమేషమునుండి రమానివాసు
మందిరము రూపుగొనసాగె మంజులముగ,
శిలలలో జీవముంబోసి శిల్పివిధులు
కల్పనముసేయసాగిరి శిల్పజగతి. 41

తే.గీ. ఐదువందల శిల్పీంద్రు లహరహంబు
ఆలయస్థలి సృజనైకశీలు లైరి;
వారికందఱికిని నాధిపత్యమూని
పరమశిల్పియై జక్కన పరఁగుచుండె. 42

తే.గీ. తారకాకృతిఁ బరిధి యొప్పారుచుండ,
మూడుమూరల యెత్తైన గోడతోడఁ
బొనరు వేదిపైఁ బ్రాఙ్ముఖంబుగను గట్టె
మందిరము నాతఁ డత్యంతసుందరముగ. 43

తే.గీ. గర్భగృహమును దారకాకార మూని
పొనరు నందున, దానికి ముందుఁ దనరు
మండలాకారతాండవమండపంబు;
దాని కుత్తరదక్షిణస్థానములను
దనరుఁ బార్శ్వమండపములు, ద్వారములును. 44

ఉ. ఆ రమణీయమండపములం దలరారు నపూర్వశిల్పసు
శ్రీ రుచిరంబులైన,[1] యితరేతరసామ్యవితథ్యరమ్యశై
లీరచితంబులైన, లవలీదళరీతిఁ, బ్రతీపదర్శినీ
చారుకపోలపాళికలచందము నిద్దములైన కంబముల్. 45

చం. అనుపమమైన స్వీయసృజనైకవిలాసముఁ గాంచి యీర్ష్యకుం
బనుపడి విశ్వకర్మ పలుమారులు తన్నెదిరింప నాతనిం
గొనకొని గెల్చి చిహ్నముగఁ గూర్చెనొ మానగు గెల్పుకంబముల్
ఘనుఁడగు జక్కనాఖ్యుఁ డనఁ గన్నులవిందొనరించుఁ గంబముల్.46

చం. అనుదినమందుఁ బ్రత్యుషసియందున నాట్యముసేయు శాంతలన్
గనుగొనఁబోవు నాస్థపతికౌలసుధాంబుధిచంద్రుఁ, డట్టు లా
వనిత యొనర్చు నాట్యగతభంగిమలెల్లఁ దదేకచిత్తుఁడై
మననముసేయుఁ, జేసి ప్రతిమాకృతులం ఘటియించు వానికిన్. 47

ఉ. ఆతఁడు దన్నుఁ దా మఱచి యారయుచుండఁగ నామెనాట్యమున్
జేతములోఁ గ్రమంబుగఁ దదాకృతి తోఁచును మల్లికా నవా
బ్జాతముఖీనిభం బగుచుఁ, బ్రాప్తిల నిట్లు నిజప్రియా పున
ర్ద్యోతన మాతఁ డాప్లవమునొందుచు నూతనకౌతుకాంబుధిన్. 48

తే.గీ. మల్లికాకృతి మీరంగ మలఁచివైచు
రమ్యతరనాట్యవిగ్రహప్రతతి నతఁడు;
రమ్యతరనిలింపాంగనాప్రతతి నెల్ల
సృష్టిఁజేసెడు పరమేష్ఠి చెలువు నలరి. 49

1. ఇతరేతర సామ్య వితథ్య రమ్య శైలీ రచితంబు లైన = ఒకదానితో నొకటి పోలియుండుట యనునది తథ్యము గానటువంటి అందమైన శైలితోడ నిర్మింపబడిన (అనగా, ప్రతిస్తంభము నొక ప్రత్యేకమైన శైలితో నిర్మించె ననుట);

ఉ. అట్టులఁ జెక్కనట్టి ప్రతిమావళిఁ గంబపుటగ్రసీమలం
దుట్టిపడంగ వైభవసమున్నతి నిల్పె నతండు, తీవెకుం
దుట్టతుదన్ సుమించిన మృదుప్రసవంబులయట్లు, స్వీయమౌ
దిట్టతనంబు నెల్లరకుఁ దెల్లముసేయు[1] పదంబులట్టులన్. 50

చం. భువనమునందు నెందునను పోలికలేని సుమంజిమంబుతో,
కవిత కచుంబితంబయిన క్రమరసోద్ధురభావదీప్తితో,
దివిజలతాంగులేనిఁ బ్రకటింపని నూతనభంగిమాళితో,
నవకముమీఱఁగా మలఁచె నాతఁడు దత్ప్రతిమావితానమున్. 51

ఉ. అందున నొక్కకంబమున నల్లదె మోహిని కన్నుదోయికిన్
విందును గూర్చుచున్నయది; పీనకటిస్థలి రమ్యకాంచికా
సుందరమై వెలుంగ, కడు స్రుక్కఁగ మధ్యము భూర్యురోజసం
బంధము నోర్వలేక, శిరమందుఁ గిరీటము తళ్కులొల్కఁగన్. 52

సీ.తు. ఒకముగ్ధ ముకురాన నొయ్యారముగఁ జూచి
తనచెల్వునకుఁ దానె తన్మయమునొందు,
ఒకనారి కీరంబు నొయ్యనొయ్యనఁ బల్కి
వల్లభున కెదొవార్తఁ బనుపంగఁ జూచు,
ఒకచెల్వ వల్వలోనున్న తేలును జూచి
వెఱఁగునం జెఱఁగునున్ విదిలింపఁ జూచు,
ఒకప్రోఢ డాకేల నొఱపువీణియ నూని
రాగము ల్పలికించు ఱాతియెదలోన,

తే.గీ. నాట్యవేదపారీణయౌ నాతి యొకతె
తాండవాలోలయౌఁ దన్నుఁ దానె మఱచి,
వాద్యసంగీతనిపుణయౌ వనిత యొకతె
మర్దలంబులఁ బలికించు మంజుఫణితి. 53

1 పదము = (అడుగు) జాడ, చిహ్నము - అనగా ఆశిల్పములు జక్కనశిల్పపాండితికి జాడలవంటివి మాత్రమే యనియు, ఆజాడల ననుసరించి అతని పరిపూర్ణపాండిత్యము నింకను ఆవిష్కరింపవలెనని ధ్వని.

ఉ. ఆలయకుడ్యభాగములయందున నొప్పు నపూర్వశిల్పశై
లీలలితంబులైన కమలేక్షణ, శంభు, రమా, సరస్వతీ,
శైలసుతా, రతీమనసిజాద్యఖిలామరమూర్తు, లుర్విలో
నోలగముండిరో దివిజు లూర్ధ్వజగంబును వీడి యన్నటుల్. 54

సీ. గోరక్షణార్థంబు గోవర్ధనాద్రినిం
గేల నెత్తిన గోపబాలు నొకట,
రెండడుగులతోడ నిండారి జగమెల్ల
బలిమీదఁ గాల్మోపు వటువు నొకట,
కాళియుఫణమందుఁ గాలూని నటియించు
బాలకృష్ణుని నాట్యకేళి నొకట,
వీరనృసింహావతారంబు ధరియించి
హేమకశిపుఁ జీల్చు స్వామి నొకట,

తే.గీ. మోహినీరూపమును బూని మురువుమీర
నాట్యమాడుచు భస్మదానవుని రూపు
మాపిన మురారి మోహనరూప మొకట,
నలువుగా మలచెను జక్కనార్యుఁ డచట. 55

ఉ. నల్లనిసామితోడ రమ నవ్వులుజిల్కుచుఁ గొల్వుఁదీఱెడిన్,
వల్లభుతోడ నందిపయిఁ బార్వతి లోకములేలఁ బోయెడిన్,
బల్లిదుఁడైన రక్కసుని భైరవి కాలను రాచుచుండెడిన్,
అల్లదె నాట్యలోలయయి యందములొల్కుచునుండె వాణియున్.56

ఉ. బారకు నెక్కుడైన యసిపత్త్రశరాసన మూని లోకముల్
ఘోరనఁ గెల్వఁగా నసమపుష్పశరుం డదె సందడించె, నం
భోరుహనేత్ర యోర్తు ధ్వజముం గొనుచుం దనవెంటరాగ, నెం
తో రహిమీరఁగా రతియుఁ దోడగుచుం దను వెంబడింపఁగన్. 57

చం. అతులితసుందరంబులగు నాప్రతిమావళిచే సజీవమై
శతమఖలోకరీతిగ నెసంగెడి యాలయకుడ్యనిమ్నపా
ర్శ్వతలములందునం దొలిచె జక్కన యైహికదృశ్యరాజముల్,
ప్రతిదినలోకవృత్తముకురాయితమై గుడి వొల్చునట్లుగన్. 58

చం. అనుదినదృశ్యమాన వివిధాండజ, వృక్ష, లతాప్రతానినీ,
వనరుహ, వన్యజంతు, ఫణి, పంకరుహానన, దాసదాసికా
జనపరిసేవితాఢ్యజనసంఘము లాదిగఁ గల్గుదృశ్యముల్
తనదగు శిల్పపాండిమపతాకములై తగఁ జెక్కె నచ్చటన్. 59

ఉ. సన్నినిమధ్యమున్, వలుదచన్నులు, తోరపు శ్రోణియుం దగన్,
సొన్నపుఁగంటెయున్, వరకుచోపరిహారము, లొడ్డణంబులున్
సన్నినివల్వయుం దొడిగి, సస్మితయై యొకచెల్వ వీడ్యమున్
చెన్నుగ నందియిచ్చెనదె, చేరెడు కన్నుల వల్పులొల్కఁగన్. 60

ఉ. [1] అల్లదె పండు గోయుటకునై యరుదెంచిన దొక్కబాల, యా
పల్లవపాణి కోయుటకు వంచిన పండున వ్రాలె నయ్యయో
నల్లని యీగ, యామెపయినం దయచేతనొ, పర్వుపర్వునన్
బల్లియొకండు వచ్చెనదె పారణసేయఁగ మక్షికాధమున్. 61

చం. కుసుమమిషన్ హసించినవి కోమలవల్లరు, లాలతాళిలో
నసదృశనృత్యభంగిమయుతాంగముతోడ వసంతకన్య తా
నెసఁగుచునున్న దల్లదిగొ, యిక్షుసురాంచితపానపాత్రతో
మిసిమివయారి యొర్తు రహిమీరఁగఁ గొల్వఁగఁ దన్నుఁజెంగటన్. 62

ఉ. [2] వామకరంబునందుఁ గొని వల్వచెఱంగును, దక్షిణంబునన్
గోముగ నొక్క వానరము కోకను చేఁగొని యీడ్చుచుండఁగా,
రామ యొకర్తు కోపపరిరంజితవక్త్రముఁ దాల్చి నిల్చెఁ, దా
నేమి యొనర్చెనోగద హృదీశుఁడు కోమలి యిట్లు గందఁగన్? 63

1. బాల, పల్లవపాణి యను పదములు సాభిప్రాయములు; 2. రామ, కోమలి యను పదములుసార్థకములు.

చం. ముకురము చేతఁ బట్టుకొని, పూవులతీవియపైని వాల్చి మే
నొక సుకుమారి యంగుళుల నొయ్యన దూరిచి ఉంగరంబులై
చకచకలాడు కేశములఁ జక్కఁగఁ దీర్చుచునుండె నల్లదే!,
ప్రకటముగాఁగఁ బద్మముకుళంబులఁ బోలు చురోజకుంభముల్. 64

చం. మును మకరేంద్రునుండి పరిపూర్ణదయారసవృష్టిఁ గాచెఁబో
మన కరిరాజుఁ గేశవుఁడు, మాన్యుడతండు నటంచు నెంచి యా
ఘనరుచిరాంగు సంతతముగాఁ గడనుండి భజించుచుండెనో
యన ద్విపసంతతుల్ వెలసె నాలయభిత్తికలందు నందమై. 65

* ఉ. ఎంతటి పక్షపాతమొ రమేశ్వరుఁ డల్పపు పంకజంబులన్
సంతత మూను బొడ్డునను, చక్కనిహస్తములన్, శిరంబునం,
దింతకు మేముఁ జాలమొకొ? యీశ్వరు నడ్గుద మంచు వచ్చెనో
పంతముఁ బూని నా వెలసె భాసురకుడ్యములందు నెల్లెడన్
వింతలువింతలౌ లతలు, విచ్చినపూవులుఁ, గోరకంబులున్. 66

సీ. ఒకచెంత శ్రీ భారతోదంతముల్ దెల్పు
శిల్పసంతతు లెన్నొ చెన్నుమీర,
ఒకపొంత రామాయణోత్కృష్టగాథలన్
వివరించు ప్రతిమాళి వేడ్కఁగొల్ప,
ఒకచాయ యక్షిణీసుకుమారలీలలన్
వర్ణించు శిల్పముల్ పరిఢవిల్ల,
ఒకపాయ గ్రామీణయువతీయువకవృత్త
లలితంబులౌ మూర్తు లలరుచుండ,

తే.గీ. ఒక్కయెడ తురంగారూఢయోధగణము,
లొక్కకడ హంసహంసికాయూథములును,
గొమరుమీరంగ మందిరకుడ్య మలరు
నఖిలసృష్టికిఁ బట్టిన యద్ద మటుల. 67

* ఈ పద్యములో రమేశ్వరుఁడు, పంకజము (బురదలోఁ బట్టినది) అను పదములు సాభిప్రాయములు.

శాంతల జక్కనను కొనియాడుట

చం. ప్రతిదినమందు నాస్థపతివర్యుఁడు చెక్కెడు విగ్రహంబులం
గుతుకము మీరఁ గాంచగను గోమలి శాంతల వచ్చు భర్తృసం
యుతముగ, వచ్చి యం దొనరు నూర్జితతాండవభంగిమల్ నిజా
ద్భుతనటనంపు భంగులకుఁ బూనిన యద్దములట్టు లుండినన్ ... 68

ఉ. అందము తాండవింప మది నాయమ మెచ్చుచు శిల్పిచంద్రునిన్
మందతరస్మితప్రయుతమంజులవీక్షణవృష్టిధారచే
నందితుఁ జేయుఁగాని యొకనాఁడును మన్ననసేయకుండు, రా
జేందుడు మాత్రమాతనిపయిం గురిపించుచునుండు మన్ననల్. 69

మ. ఒకనాఁ డాతఁడు మున్ను నెన్నఁడును నేయోషాలలామంబుచేఁ
బ్రకటింపంబడనట్టి భంగిమను, భవ్యంబౌ[1] త్రిభంగ్యాఖ్యమున్,
సుకుమారంబుగఁజూపు నర్తకిని[2] విస్ఫూర్జత్కళాభిజ్ఞతా
ప్రకటాభిజ్ఞగఁ జెక్క దానిఁ గని యబ్రంబందుచున్ రాణియున్. 70

ఉ. ఉక్కిరిబిక్కిరై హృదయ మూరక పర్వులువెట్టుచుండఁగన్
నిక్కువమైన యాధృతిని నీరజలోచన పల్కె, 'జక్కనా!
చక్కని నాదునాట్యగతశైలిని ఊలను శాశ్వతంబుగాఁ
జెక్కుచు నుంటి వింతెయని చేసితిఁ జుల్కన నిన్నుఁ గొంతగన్. 71

ఉ. ఎవ్వరు నెన్నఁడేని నటియింపఁగలేని త్రిభంగిరూపు నీ
వెవ్విధిఁ జూచియుంటివొ హృదీక్షణమందునఁ, జూచితేనియుం
గ్రొవ్విరివింటివానిసతి రూపునఁ జూపటులం దటాలునన్
నివ్వెఱఁగందఁజేయు నటు నీటుగ నీవెటు చెక్కితో యిటుల్! 72

1. త్రిభంగ్యాఖ్యమున్ = త్రిభంగి యను భంగిమను (కటినుండి పాదములవఱ కొకవిధముగాను, ఉరఃకటి పర్యంతము మఱొక విధముగాను, ఉరశ్శీర్షపర్యంత మింకొక విధముగాను త్రివిధముగా శరీరమును వంచి కూర్చిన భంగిమ. ఇది నత్యంతసుందరమును, క్లిష్టమును నైన భంగిమ యని లాక్షణికుల యభిప్రాయము.)
2. విస్ఫూర్జత్కళాభిజ్ఞతాప్రకటాభిజ్ఞగ = ప్రకాశమానమగు (నాట్య)కళాపాండితిని ప్రకటించు గుర్తుగా.

చం. శిలలను గావ్యమల్లు వరశిల్పికులాంబుధిపూర్ణచంద్ర! నీ
వలరెదు ధాత్రిలో జననమందిన బ్రహ్మవె యౌచు, లేనిచోఁ
బలుకునె? నాట్యమాడునె? నవంబగు రాగము లాలపించునే?
కులుకునె? వెల్వరించునె ముఖోద్గతభావము లిట్టు లశ్మముల్? 73

చం. పలుకులు నేర్పవచ్చు శుకబాలిక కింతగ యత్నమూనినన్,
కులుకుచు నాట్యమాడఁగను గొంతగ నేర్పఁగవచ్చు నెమ్మికిన్,
కలికికి నేర్పవచ్చు నిలఁ గానముసేయఁగఁ గాని యేగతిన్
శిలలకు మాటలాడఁగను, జెల్వుగ నాడను, బాడ నేర్పితో! 74

చం. పొనరఁగ నింద్రచాపమునఁ బూచిన వర్ణములట్లు కొంతగన్,
వనమున విచ్చికొన్న నవవారిజసౌరభమట్లు కొంతగన్,
క్షణికసుఖప్రదంబగుఁ బ్రజాళికి మన్నటనంబు; కాని యే
యనువున నద్ది నీదుకళయట్లు సదాప్రముదప్రదం బగున్? 75

ఉ. నీ మదిలోనఁ బెల్లెగయు నిస్తులభావరసామృతోర్మికల్
నీ మృదుబాహునాళముల నిస్రుతమౌచుఁ, గరాంత టంకధా
రాముఖనిర్గతంబులయి ప్రస్తరభూములఁ బైరుసేసెఁబో,
శ్రీమహితంబులైన వరశిల్పసుమంబుల శిల్పిచంద్రమా! 76

చం. వనములఁ గందమూలముల భక్షణసేయుచు మౌనదీక్షులై
మనియెడి తాపసోత్తములు మాన్యులె యౌదురుగాక, వారిచే
మనుజుల కేమి గల్గెనని మంజులశిల్పకళాతపస్వివై
జనములకెల్ల శిల్పివర![1] చాక్షుషసౌఖ్యపుబ్రహ్మఁ జూపెదో! 77

ఉ. 'సర్వసమర్థుఁ డంద్రు నిను సారససంభవ! యేలఁ జేతువో
ఖర్వులఁ, గుంటులన్, వికృతకాయులఁ గొందఱఁ, జేయు మిట్టు లీ
యుర్వర నెల్లవారల ననూనవరాంగుల' నంచుఁ దెల్పనో
సర్వవరాంగయుక్తముగఁ జక్కగఁ జెక్కితి వెల్ల మూర్తులన్. 78

1. చాక్షుషసౌఖ్యపుబ్రహ్మ = కనులకు సంబంధించిన ఆనందమనెడు పరమాత్మ - 'ఆనందో బ్రహ్మ' - అని వేదవాక్యముగదా! తన తపఃఫలముగా సామాన్యులకు పరమాత్మసందర్శనమును గల్గించు చున్నాడనుట.

ఉ. ఎవ్వరు జూచినారలు రమేశునిమందిర మా వికుంఠమం
దెవ్విధి నుండెనో? తలఁప నియ్యది మాత్రము తథ్యమౌ, నిటం
గ్రొవ్విరివింటితేనిజనకుండు ప్రతిష్ఠితుఁడయ్యెనా యిఁకన్
నవ్వులకైన నాతఁడు సనందు వసింప వికుంఠమందునన్. 79

ఉ. సంశయ మింత లేదు జలజాసనసన్నిభశిల్పకార! నీ
యంశను రూపుఁగొన్న నిలయంబిది వెల్గును శాశ్వతంబుగాఁ
గంసవిరోధిసద్మమయి, కాశ్యపికైశికపద్మరాగమై,
భ్రంశములేని హొయ్సళధరాధిపవంశయశఃపతాకమై.' 80

కం. అని పల్కు విష్ణువర్ధన
జననాథుని పట్టపుదొరసానిని వినయం
బనువంద వందనంబులఁ
దనుపుచు ననె నీవిధమున స్థపతీంద్రుండున్. 81

ఉ. 'అంతయు నా యుపేంద్రుదయ యమ్మరో! దానికి మీర లింతగన్
సంతసమంది నామదిని సాంద్రదయామృతవృష్టిచేత నా
స్వాంతము దన్పఁ దాల్చె నది శ్రావణమేఘపృషద్విశేషసం
క్రాంతసుపల్లవం బయిన కమ్రకదంబమహీజభంగిమన్. 82

ఉ. మీరు నటించు భంగిమల మించినవేడ్కను గాంచి, వానినిం
దోరముగా మదిం దలఁచి తొల్చితి నీ ప్రతిమాళి, వీనికిన్
మీరలె మాతృతుల్యులరు, మీ నయనాంతమనోజ్ఞవీక్షణ
స్ఫారరసాభిషేచనవశంబునఁ గా నవి ప్రాణమూనెడిన్. 83

ఉ. నాదగు శిల్పవిద్యకు, ఘనంబగు మీదగు నాట్యవిద్యకున్,
శ్రీ దయితుండు కేశవుఁడె సేవ్యుఁడు; కావున నాసమస్త లో
కాధిపు సేవనార్థమయి అంకితముం బొనరించి యీకళల్
మోదముఁ గాంత మింక, భవమోక్షణకై యతనింత మమ్మరో!' 84

కం. అని పల్కెడి శిల్పీంద్రుని
వినయోక్తుల కెంతొ మెచ్చి వే మణులం దా
పిన హార మతని కొసఁగెన్
జనపతిరాణియు నపూర్వసౌహృదమెసఁగన్. 85

భగవద్రామానుజులు ఆలయప్రతిష్ఠకై యరుదెంచుట

తే.గీ. ఐదువందల శిల్పు లిట్లహరహంబు
ఱాతినే నవనీతంబు భాతిఁ దొలువ
అష్టవర్షంబులకు సిద్ధమయ్యె నతుల
సుందరంబైన కేశవమందిరంబు. 86

తే.గీ. సర్వశోభనలక్షణ సంయుతంబు,
లతులితాపూర్వశిల్పకళాంచితంబు,
లైన మందిరప్రతిమల నరసి జనులు
వెఱఁగునం దారె ప్రతిమలై వెలయుచుండ్రి. 87

ఉ. ఆమహనీయమందిరమునందున నాగమశాస్త్ర వైఖరిన్
శ్రీ మహిళామనోహరునిఁ బ్రీతిఁ బ్రతిష్ఠితుఁజేయ 'నన్యులౌ
స్వాములఁ గోర నేల, కలుషాపహు లార్యులు భాష్యకారులే
యీమహిఁ బావనంబు నొనరించుచు నుండఁగ మేలుకోటలోన్?88

తే.గీ. అనుచు విష్ణువర్ధనవసుధాధిపుండు
పెరుమలైపండితునితోడఁ బ్రియముమీర
మంత్రమొనరించి పూజ్యరామానుజులను
శిష్యయుతముగ బేలూరుఁ జేరఁ బిల్చె. 89

తే.గీ. రాజలాంఛనంబులతోడ రాజచంద్రుఁ
డంపియున్నట్టి శకటంబులందు నపుడు
ఛాత్రసంవృతుఁ డౌచు వైష్ణవగురుండు
తరలివచ్చెను బేలూరుపురముఁ జేర. 90

సీ. ధాత్రికిం దిగినట్టి ధాతలో యన మీరు
శ్రుతిశాస్త్రవిదులైన శ్రోత్రియులును,
అల పతంజలికణాదాక్షపాదాది వి
విధ వాద విదులైన బుధవరులును,
వ్యాసమార్కండేయవాల్మీకివాక్సుమ
భ్రమరులై పొల్చు పౌరాణికులును,
భాసకాళీదాసభవభూతిబాణాది
బహుకావ్యవిదులైన పండితులును,

తే.గీ. వ్యాకరణనిరుక్తాదిషడంగవిదులు,
ద్రమిడకర్ణాటభాషావిదాంవరులును,
ఓలిఁ గట్టుచుఁ దను గొల్వ హొయసలేశు
రాజధానిఁ జేరెను యతిరాజమౌళి. 91

ఉ. వచ్చిన భాష్యకారపరివారము నంతట విష్ణువర్ధనుం
డెచ్చిన భక్తితోడ నెదురేఁగి సమాదరణంబుసేసి తో
డ్తెచ్చెను వీటికిం, బ్ర[illegible]లు, ధీసచివుల్, దళనాయకాగ్రణుల్,
మచ్చికఁ గూడి రాగ, శుభమంజులతూర్యవిరావ మెచ్చఁగన్. 92

కం. ఈవిధిఁ దోడ్కొని తెచ్చిన
శ్రీ వైష్ణవగురువరుని వసింపఁగఁజేసెన్,
భూవిభుఁడు దాను గట్టిడి
శ్రీవిభునిగుడి కడ నొనరు చెన్నగు మేడన్. 93

ఉ. ఆ తరువాతి నాఁడు వసుధాధిపుఁ డా యతిరాజమౌళినిన్
బ్రాతిగ బంధుమిత్ర పరివారయుతుండయి చూచి, మౌని కే
రీతిగ నెందునేఁ గొదువలేనటు కట్టడిఁ జేసి, భక్తియుం
[illegible] 94

కం. 'సురమునిసన్నిభ! మాపైఁ
గరుణంగద! మాపిలుపును గాదన కిట మీ
రరుదెంచుట, మీ రాకం
బెరిగెన్ మత్పురము పౌర్ణమీవార్ధివలెన్. 95

మ. భవదాశీర్వచనప్రభావమునఁ గా భవ్యాత్మ! నిష్ఠాత్ములై
సవనంబు ల్పొనరించు యజ్వలును, శశ్వత్ ధ్యానరూఢాత్ములై
ప్రవిదూరాటవులం దపించు మునులున్ భావింపఁగాలేని మా
ధవురూపమ్ము మదాత్మదర్పణమునన్ దర్శింతు నశ్రాంతమున్. 96

తే.గీ. మీదయాప్రేరితంబైన నాదు భక్తి
కల్పచిహ్నంబుగా శేషతల్పశాయి
కేను నిర్మించు మందిర మింకఁ గఁనగ
రండటంచు నాచార్య! ప్రార్థనము సేతు.' 97

*భగవద్రామానుజులు జక్కననిర్మిత*
*మందిరమును చూచి యాతనిని కొనియాడుట*

మ. అని యర్థింపఁగ భాష్యకారులును, శిల్పామ్నాయపారీణులౌ
ఘనవిద్వాంసులు, నన్యశిష్యులును, వేడ్క న్వెంట నేతేరఁగన్,
చని భూపాలుని వెంటఁ, గాంచి రచటన్ సాక్షాద్వికుంఠంబునే
కనుముం దుంచిన యట్టులున్న గుడినిన్, కైవల్యసంధానినిన్. 98

ఉ. వచ్చిన తాపసేంద్రునకు వంగి నమస్కృతిఁ జేసి, యాదరం
బచ్చువడంగ జక్కనయు నాలయమంతయుఁ జూపెఁ, జూపఁగా
నచ్చెరువంది మందిరపు టన్నునకున్ యతిరాజమౌళియున్
మచ్చికమీరఁ బల్కె నిటు మానసమందున నున్నదానినిన్. 99

ఉ. 'ఓ వరశిల్పివంశకలశోదధిపూర్ణశశాంక! జక్కనా!
ఏవిధిఁ గట్టితయ్య యిటు లీశునిమందిర, మిందు నా మహేం
ద్రావరజుం బ్రతిష్ఠితు నొనర్చితిమేనిఁ దొలంగు ధాత్రిలో
దేవుఁ డగమ్యుఁ డంచనెడి తీరని యప్రథ యా[1] యధోక్షజున్. 100

ఉ. ఎందఱు శిల్పివర్యు లిల నెన్నిగుడుల్ రచియింపలేదు? వా
రందఱి శిల్పకావ్యములయందున భక్తిరసంబు, నందముల్
చిందునె నీదుశిల్పమునఁ జిందువిధంబునఁ, జూపితయ్య! మా
యందఱి కందనట్టి హరియందము లిందుఁ[2] గళాతపస్విపై. 101

శా. ఏమీ! వీరలు మూలమూర్తులొకొ శిల్పీంద్రా! ప్రసన్నాక్షులై,
కాము న్మీరిన సుందరాంగులయి, శంఖాబ్జాతకౌమోదకీ
భామంతక్షుతచక్రధారులయి, విభ్రాజత్కిరీటాఢ్యులై,
సోమాంచత్కరసన్నిభస్మితులునై సొంపారువా రీయెడన్. 102

ఉ. వీరి మనోజ్ఞరూపమును వీక్షణసేసినఁ జాలుఁ బాపముల్
దూరములౌ నఘాత్ములకు, దోయిలిఁ జెంగట సంఘటించినం
గూరును సద్గుణంబు, లెలుగూని ప్రశంసయొనర్చినం దపో
భారకృశాంగులైన మునివర్యుల కందని మోక్ష మందెడిన్. 103

ఉ. ఏమి విచిత్రమయ్య! రచియించితి మూలవిరాట్టు వెన్క శో
భామయతోరణంబున నవంబగుభంగి దశావతారముల్,
'క్షామముఁజెంద ధర్మములు సంప్రభవింతురు వీరు ధర్మముల్
స్థేమముమీర నిల్ప' నని తెల్పుటకో నతభక్తకోటికిన్! 104

1. అధోక్షజున్ = ఇంద్రియజ్ఞానము నధఃకరించిన, అనగా ధీనేత్రాదీంద్రియముల కగమ్యుడైన (చిక్కకున్న) వానిని – అధఃకృతం అక్షజం ఇంద్రియజన్యజ్ఞానం యేనే త్యధోక్షజః – అని వ్యుత్పత్తి. ఈపద మిక్కడ సాభిప్రాయముగా వాడఁబడినది; 2. కళాతపస్విపై – సాభిప్రాయవిశేషణము. యోగవేదాంతాదుల నెరిగి తపస్వులైన వారికి అగోచరమైన భగవత్స్వరూపవిశేషములను కళాతపస్వియైన జక్కన చెక్కెనని భావము. అందును శ్రీమద్రామానుజులు సగుణబ్రహ్మవాదులై భగవంతుని కనంతకల్యాణగుణములను సత్స్వరూపము ను ప్రతిపాదించినవారు. కాని వారికిని వ్యక్తముకాని విశేషగుణములను జక్కన చూపెనని విశేషార్థము.

ఉ. ఇంత వినమ్రభావమును నెట్టుల కల్పనచేసితోయి, ప
క్షాంతము లిర్గడన్ విరియ, నంజలిబద్ధకరాబ్జుఁడౌచుఁ, బ
ష్మాంతవికీర్యమాణదరహాససమంచితనేత్రపద్మఁడై,
ప్రాంతమునందు నిల్చిన సుపర్ణుని స్మేరముఖాబ్జమందునన్.' 105

మ. అను చాశ్చర్యము మీరఁగా బలుకు నయ్యాచార్యవర్యున్ మహా
వినయంబారఁగఁ జూచి జక్కనయు సంప్రీతాత్ముఁడై పల్కె 'నో
యనఘాత్మా! ఇది మీదు భిక్షయె సుమా! ఆంధ్యాహతంబైన నా
మనమం దీరలె విష్ణుభక్తియను ధామంబున్ బ్రసాదింపరే! 106

ఉ. ఆదినమందు నాశ్రమమునందున నాహృదయంబునందు మీ
రూదిన భక్తిభావమె క్రమోద్ధృతమై గురువర్య! స్థావరా
శ్మోదితమూర్తులందు నిపు డూదుచునుండెను ప్రాణవాయువున్,
లేదొకయింత యిందున నళీకము! సర్వము మీదుచల్వయే!' 107

తరలము. అనుచుఁ బల్కెడి శిల్పిచంద్రుని నాత్మ నెంతయు మెచ్చుచున్
ఘనదయారసపూర్ణదృష్టులఁ గారవించుచు నాతనిన్,
పెనుజడింబలె దీవెనల్ గురిపించి, యచ్చోటుఁ బాయుచుం
జనిరి వైష్ణవమౌనిచంద్రులు స్వాలయంబును జేరఁగన్. 108

ఉ. ఇంటికిఁ జేరి వైష్ణవమునీంద్రుఁడు రాజును జూచి పల్కె, 'ని
ష్కంటకమైన కర్తృశుభకారకమైన ముహూర్త మున్న, దీ
వెంటనె వచ్చు చైత్రమున వెన్నెలపక్షములోని పంచమిన్
గంటిరె! నాఁడె కేశవుని గర్భగృహస్థితుఁ జేయఁగావలెన్'. 109

తే.గీ. అందు కొక నెలనాళ్లె యున్నందువలన
సాయమొనరింపఁ దొడఁగిరి సర్వజనులు;
నిష్ఠతో శిల్పివరులు ప్రతిష్ఠకొఱకు
భవ్యమండపనిర్మాణపరతు లైరి. 110

మల్లికాడంకనలు బేచనాయకునితో బేలూరునకు వచ్చుట

సీ. నవవర్షముల నాఁడు నవముగా బేలూరు
నగరికిం దావచ్చినట్టి రాత్రి
జక్కనాచార్యుండు స్వప్నమందునఁ గన్న
మల్లికావృత్తాంతమెల్ల నిపుడు
కల్లగా కొకయింత కనుముందుఁ గన్పట్టె
నున్నదున్నట్లుగా నూర్జితముగ
బేచన్న మల్లికం గాచియుంటయు, మల్లి
కాసతి డంకనం గాంచుటయును

తే.గీ. సత్యమే యయ్యెఁ; భర్తఁ గాంచంగఁ దివురు
భామినిం గూడి, తండ్రికై పరితపించు
తనయునిం గూడి, తత్పురంబునకు వచ్చె
బేచనాయకుఁ డొకనాఁడు ప్రీతితోడ. 111

తే.గీ. దుర్గమంబైన మార్గంబు నిర్గమించి,
కష్టముల కోర్చి పయనించి కట్టకడకు
ఒక నిశాముఖవేళను నుస్సురనుచు
చేరుకొని రెట్లొ వారు బేలూరుపురికి. 112

తే.గీ. అరుగుదెంచు సరికి చీక టగుటవలన
వార లారేయి నొక్క ప్రవాసిగృహము
నందు వసియించి, రదియు నింపొందుచుండెఁ
గేశవాలయనికటప్రదేశమందు. 113

తే.గీ. డస్సియుండుటఁ ద్వరగనే డంకనయును,
బేచనాయకుండును స్వప్నవివశు లైరి;
కాని మల్లికాసతికి నొక్కంతయైన
కునుకు జనియింపదయ్యె నా క్షణదయందు. 114

తే.గీ. గూండ్లకుం జేర నింగిలోఁ గూడి తిరుగు
పక్షులంబోలె, [1] వేగపరీక్ష కైత
వ ద్రవద్రథవ్రాతంబు పగిది నపుడు
ఆమెలోఁ బరువెత్తె నూహాశతంబు. 115

ఉ. 'ఉండెనొ ప్రాణనాథుఁ డిట, నుండిన నాకయి వేచియుండెనో?
[2] చండరయభ్రమత్కుటిలశైవలినీభ్రమమగ్నుయయ్యెఁ దా
నుండున నింకఁ బ్రాణముల నూనియు మల్లిక యంచు నెంచి వే
ఱొండు లతాంగికిం దనదునుల్లము నిల్లడవెట్టియుండెనో ? 116

చం. అతివల హావభావకలితాద్భుతరీతుల కోడి దాసుఁడౌ
యతివరుఁడైన నాఁగ, నిఁక నన్యుల నేమనవచ్చు, నందులో
సతి నెడఁబాసి కుందు [3] పురుషాళుల [4] కన్యవిలాసినీస్మిత
ప్రతతిమరందమాధురు లవశ్యసుపేయములౌనుగా ధరన్! 117

మ. అయయో! యెంతటి పాపచింతనకు లోనై యిట్లు మన్నాథు న
ప్రియముల్ వల్కుచునుంటి, నెన్నఁడును దత్ప్రేమామృతాసారమం
దు యథేచ్ఛాప్లవ మొందన, ట్లతని చేతోవృత్తివైశద్య మిం
తయు నాత్మేక్షికఁ గాంచనట్లు, వృథగన్ దన్మాన్యు శంకించితిన్.118

ఉ. వల్లరికిన్ రసాలమటు, పద్మినికిన్ భ్రమరంబురీతిగన్,
చల్లని వెండివెన్నెలకుఁ జంద్రునిచందము, చక్రవాకికిన్
వల్లభులీల, నెల్లపుడు వాయక నాదగుచాయ, నన్నుఁ దా
నుల్లములోన దేవతగ నుంచి భజించెనుగాదె కాంతుఁడున్! 119

1. వేగపరీక్ష = వేగపరీక్ష (Racing competition) యొక్క, కైతవ = వ్యాజముచేత, ద్రవత్= పరుగిడుచున్న, రథవ్రాతంబు = రథముల సమూహము; 'ద్రవద్రథవ్రాతంబు' యనుదాని నుచ్చరించినపుడు రథ చక్రములు దొరలునప్పు డొనర్చు శబ్దము స్ఫురించి పరుగెత్తు రథచక్రములు దృశ్యమానములగుట గమనించునది; 2. చండ రయ భ్రమత్ కుటిల శైవలినీ భ్రమ మగ్న = అధికవేగముతో తిరుగుచున్న వంకరలైన నదియొక్క సుళ్లలో మునిగిపోయినది; 3. పురుషాళులకు = పురుషసమూహములకు, పురుషులను తుమ్మెదలకు; 4. అన్య విలాసినీ స్మిత ప్రతతి మరంద మాధురులు = పరస్త్రీల చిరునగవుగములయందలి పూదేనియల యొక్క మాధుర్యములు - ఇందు విలాసినీపదసార్థక్యమును గమనించునది.

తే.గీ. అట్టి యనురాగబంధంబు బెట్టిదంపు
గూళిదేవ[1] ప్రభంజను పాలఁ జిక్కి
త్రెంపఁబడెఁ గాని, విభుఁడు మన్నింపకున్నె
కంటఁబడినంతనే నన్ను గారవమున. 120

ఉ. వచ్చిననన్నుఁ జూచి కరపద్మము లల్లన సాఁచి మూర్ధమున్
జెచ్చెర దువ్వి కౌఁగిటను జేర్పకయుండునె భర్త, చేర్చి గో
ర్వెచ్చని హర్షబాష్పములు వేణులుగట్టి స్రవింప మూఁపుపై
మచ్చికమీర మో మునిచి మాటలకందని కూర్మిసూపఁడే! 121

ఉ. ఆ శుభవేళ తేపె యగునా? ఇనినాళ్లును మాదుజీవితా
కాశములందుఁ గ్రమ్మిన ప్రగాఢతమఃపటలంబునెల్ల ను
ద్వాసనసేయఁజాలిన శుభాహసముద్భవమౌన తేపె యా
కేశవు మ్రోల? నూసరపుక్షేత్రములం దిఁక పంటపండునా?` 122

తే.గీ. అనుచు నానావిధంబుల మనమునందు
చాలకాలము చింతను సల్పుచుండి,
క్రమముగా నామె యర్ధరాత్రంబు చనిన
వెనుకఁ దేలెను నిద్రాబ్ధివీచికలను. 123

*డంకన తండ్రిని జూడఁబోవుట*

ఉ. బాలుఁడు గాన డంకన గభాలునఁ దూలుచు రాత్రి నిద్రలో
దేలెను గాని, వేకువనె దిగ్గున లేచెను వాఁడు తల్లియున్
జాలరి బేచనాఖ్యుడును స్వప్నము వీడకమున్నె, లేచి మా
ర్జాలమువోలెఁ గాల్యములు సవ్వడిసేయక తీర్చి యాపయిన్. 124

1. ఈ పద్యములో ప్రభంజనశబ్దస్వారస్యమును గమనించునది.

ఉ. 'మాతయు బేచనాఖ్యుఁడును మార్గణసేయకమున్నె తండ్రినిన్
జాతును బోయి, వారలకుఁ జోద్యముఁగొల్పుదు' నంచు నింతయుం
భీతియులేక యాతఁడు సమీపవినిర్మితమౌచునున్న శి
ల్పాతిశయానవద్యరుచిరాలయరాజముఁ జొచ్చి యచ్చటన్. 125

చం. అతులితమైన శిల్పముల యందము నద్భుతమంది చూచుచున్,
'కృతకము లేమి గావు, కళ కృత్స్నముగా వహియించి యున్న వీ
ప్రతిమలు, వీనిఁ జెక్కిన యపారకళాపరధాతకున్ నమ
శ్శతములు సేతు, వానిపరిచర్య యొనర్తును జీవితాంతమున్. 126

ఉ. ఇంతటి మూర్తు లెప్పుడును నెందును నేఁ గనియుండలేదు, నే
త్రాంతవిలోకనోర్మ్మిల రసార్ణవముల్ రచియించుఁ గొన్ని, భం
గ్యంతరతాండవంబుల సురాంగనలం దలపించుఁ గొన్ని, కం
సాంతకులీలలం భువిని స్వర్గముగా నొనరించుఁ గొన్నిటన్. 127

చం. మఱచెనొ పద్మసంభవుఁడు మచ్చ యొకింతయు లేని సృష్టినిన్
విరచనముం బొనర్చుపని, వేఁదుఱులన్ వికలాంగులన్ సదా
విరచనసేయుచుండుఁ, గనువిప్పొదవున్ ముదివేలు పీ శిలా
విరచితమూర్తిసంతతుల విభ్రమ మింత పరీక్షచేసినన్. 128

ఉ. ఱాలను దెచ్చి యందు రుచిరంబగురూపము లొండురెండిటిన్
మేలుగఁ జెక్కఁగాఁగలుగు మేటులు పల్వురు, కాని కొందఱే
నేలను గల్గు జంతుతతి, నింగినిగల్గు నిలింపసంతతిన్
ఱాలను దొల్చి విశ్వముకురంబుగఁ గోవెలఁ గట్టు నేర్పరుల్. 129

తే.గీ. అట్టి నేర్పరులందున నగ్రతముఁడు
వీనిఁ దొలచిన వరశిల్పివిశ్వసృజుఁడు;
కఠినపాషాణముల కిట్లు కళలు నేర్పు
నతని హృన్మార్దవంబున కవధి గలదె!' 130

*ఢంకన మూలవిరాట్టును జెక్కిన శిలలో లోపమెన్నుట*

పరభృతము. అనుచు బాలకుఁ డబ్రమందుచు నటకు వచ్చిన కార్యమున్
మనమునందున విస్మరించుచు మధువు జుట్టెడి మక్షికం
బునకు దీటయి మాటిమాటికి మునుపుఁ జూచిన మూర్తులే
వెనుకఁజూచుచు మందిరంబును విడక క్రుమ్మరుచుండఁగన్131

మ. అల వైకుంఠపురంబునుండి యిల కత్యంతప్రభావంతుఁడై
యలనల్లం దిగినట్టి శ్రీరమణు దివ్యాకారమే యిచ్చటన్
వెలసెంబో యన మీరు మూలవరులన్ విభ్రాజితాకారులన్
ఎలమిన్[1] స్నాపనచేయుచున్న యొక శిల్పీంద్రుండు గన్పించినన్.. 132

తే.గీ. అట్టి దృశ్యంబుఁ దా నెన్నఁ డరసియుండ
నందువలనఁ దత్ప్రాంతంబునందె నిల్చి
కన్ను లింతలు చేసి యా చిన్నవాఁడు
వెఱఁగునించుచు నద్దాని నరయసాగె. 133

తే.గీ. తేటనీటను నాశిల్పి నీటుగాను
ఆప్రతిమనుం గడిగి, తడియార్పివైవఁ
ద్వరగనే యెండె నదియును, తరుణభాస్క
రాతపం బొకయింత సాహాయ్యమొసఁగ. 134

తే.గీ. బాగుగా నిట్టు లెండిన ప్రతిమయొక్క
నాభిదేశంబు మాత్ర[2] మున్నంబె యయ్యె;
దాని కెంతయొ[3] వెఱఁగంది తలఁపు లేవొ
నాత్మఁ దళుకొత్త బాలకుం డనియె నిట్లు. 135

1. స్నాపనచేయుచున్న = స్నానముచేయించుటను చేయుచున్న (స్నానము చేయించుచున్న); 2. ఉన్నము = తడిసినది, తేమఁ గలది (ఆర్ద్రం సార్ద్రం క్లిన్నం తిమితం స్తిమితం సమున్న ముత్తం చ - అని అమరము); 3 వెఱఁగంది = ఆశ్చర్యపడి, విస్మయమంది.

ఉ. 'చెల్వగు మీదు చాతురికిఁ జేతు నమశ్శతముల్ మహాత్మ! ఆ
నల్వయు మీదుపాండితికి నారతిఁబట్టకపోఁడు, కాని నా
తెల్వికిఁ దోఁచుచున్నయది, దేవునిమూర్తిని గర్భిణీశిలన్
నిల్వనఁ దొల్చియుంటిరను నిక్కపుశంకయె నిశ్చితంబుగన్. 136

ఉ. దోషము గల్గినట్టి శిలతో నిట మూలవిరాట్టువిగ్రహం
బేసరణిం బొనర్చితిరి? యియ్యది శాస్త్రవిరుద్ధమున్, మిముం
బోషణసేయు రాజునకుఁ, బూని భజించెడు భక్తరాజికిన్
దోషకరంబు గాదొ? యొకతూరి మనంబునఁ జింతసేయుఁడీ!' 137

తే.గీ. అనుచు నాకస్మికంబుగా నశ్మమందు
లోప మారోపణముసేయు పాపగాని
నక్కజంబును, ప్రేమయు నొక్కసారి
పిరిగొనం జూచి, యా శిల్పివరుఁడు పల్కె. 138

చం. 'చిటికెనవ్రేలియంతయును చిన్నికుమారక! లేవు నీవు, నీ
విటువలె జాతిలక్షణము లెర్గియె పల్కితొ? లేక నన్ను నీ
విటులఁ బరాచకంబు లొనరింతువొ? దేవునిమూర్తి పట్ల నీ
కుటిలపువర్తనంబులను గూడును తీరనికీడులే సుమా!' 139

కం. అనినం బాలకుఁ డనె, 'నో
యనఘాత్మా! నే మిముఁ బరియాచకమాడం
జనుదునె? శిలఁ గల లక్షణ
మునె తెల్పితిఁ, దగదు మూలమూర్తుల కంటిన్!' 140

కం. అని వెఱవక పల్కెడి చిఱు
తని చొఱవకు నబ్బురపడి, తచ్ఛిల్పియుఁ బ
ల్కెను, 'కుప్పిగంతు లిడగం
జనునే మారుతికడ! నీఁకుఁ జాలును మాటల్. 141

### డంకనకు శిల్పివర్యుని ప్రతిజ్ఞ

మ. ఇదిగో సుత్తె కుమార! దీనిఁగొని యిందెందున్నదో చూపుమా
త్వదనుధ్యాతదృషత్ప్రదోష, మది తథ్యంబేని ఖండించుకొం
దుఁ దదశ్మంబున మూలమూర్తి నిటులన్ దోషాలవాలంబుగా
నొదవంజేసినయట్టి మత్కరము నంహోనాశనైకార్థినై.' 142

కం. అని మునువెన్క లెఱుంగక
యొనరిచి కఠినప్రతిజ్ఞ నురువడిఁ జని యా
చినవానిచేత సుత్తెను
జొనిపెం దచ్ఛిల్పియు మదిఁ జొప్పడు కినుకన్. 143

### శిలనుండి జల, మండూకములు వెలువడుట

చం. ఇటుల హఠాత్తుగాఁ బ్రవికటించిన యాస్థితినుండి వీఁగ నా
చిటిపొటివాని కేగతియుఁ జేతమునందునఁ దోఁపనందునన్,
దటుకునఁ బోయి నాభికడఁ దత్ప్రతిమం దగ మోదె సుత్తెతో,
చటుకున దాన వెల్వడెను జల్లనినీరును, నందుఁ గప్పయున్. 144

తే.గీ. బెకబెకారవంబులతోడ భేక మపుడు
ప్రస్తరాంతరస్థితమైన వారినుండి
పుడమికిం బడి కుప్పింపఁ గడువెఱంగుఁ
బూను చూపుల స్థపతియు దానిఁ జూచి. 145

చం. సరగున వచ్చి బాహువులు సాఁచి కుమారుని లేవ నెత్తి, నీ
రురలెడి చూపులం గనుచు, నుద్భటహార్దముతోడఁ బల్కె, 'ఈ
చిరుతతనంబునందె యెటు శిల్పపరీక్షణవిద్య నింత నే
ర్పరితన మూనితయ్య! యెవరయ్య త్వదీయసుధీప్రచోదకుల్? 146

చం. ప్రతిభకు వర్ణలింగములు, ప్రాయము లేమియు లెక్కలేవు, స
త్ప్రతిభగలట్టివార లెవరైనను పూజ్యులె, కాన నార్య! నీ
ప్రతిభకుఁ గేలుమోడ్తు, పిడివాదము సైచినయందుకుం గృత
జ్ఞత నెదఁ గూర్తు, నీ పరమసౌహృదముం గననేర్తు నాత్మలోన్. 147

ఉ. బాలునిచేత వాదమున భంగమునందినదానికన్న, దో
షాలయమైన యశ్మమున నన్నిటికన్నఁ బ్రధానమైన యీ
మూలవిరాట్ స్వరూపమును మూర్ఖతఁ జెక్కితినన్న బన్నమే
శూలమువోలె నాయెదను స్రుక్కఁగఁజేయుచునున్న దియ్యెడన్. 148

కం. ఇట్టుల దోషావహమై
నట్టి కరంబునకు ఛిన్నమగుటయెతక్కన్
నెట్టన వేఱొకమార్గము
తట్టదుగాఁ దరచిచూడ ధర్మస్మృతులన్!' 149

*శిల్పి తన దక్షిణకరమును ఖండించుకొనఁబోవుట*

మ. అనుచుం బాలకు నేలకుం దిగిచి భూర్యావేశసందష్టుఁడై
చని, చెంతంగల గొడ్డలి న్నెడమ హస్తంబందునం దాల్చి ద
క్షిణహస్తంబు నికృత్తముం బొనరుపన్ సిద్ధంబుగా నున్న యా
తని యుత్క్షిప్తకరంబుఁ బట్టి యెవరో తప్పించి రాకార్యమున్. 150

పునస్సమాగమము

చం. 'వెనుకను నిల్చి యెవ్వరిటు భీతియొకింతయు లేక గొడ్డలిం
గొనుచు మదుద్యమంబుఁ జెడఁగొట్టెడివార' లటంచుఁ జయ్యనన్
వెనుకకుఁ ద్రిప్పి శీర్షమును వీక్షణసేసెడు శిల్పికంటికిం
గనుపడె నమ్మఁగాఁ దగని కమ్రమహాద్భుతదృశ్య మచ్చటన్. 151

ఆ.వె. మఱచె నాలయంబు, మఱచె శిల్పంబుల,
మఱచె మాణవకుని, మఱచెఁ బ్రతిన,
మఱచెఁ దన్నుఁ దానె, మఱచె నెల్లజగతి,
గరిమ దాని నతఁడు గన్నయంత. 152

ఉ. వెంటనె లేచి బాహువులఁ బెల్లుగ సాఁచి యతండు 'మల్లికా!
ఉంటివె యింకఁ బ్రాణముల నూనియె నీ' వని హర్షబాష్పముల్
కంటికిమంటికిన్ వఱదఁగట్టుచుఁ గాఱఁగ, వెన్క నున్న యా
పంటవలంతివంటి వరవర్ణిని నక్కునఁ జేర్చె మక్కువన్. 153

తే.గీ. ఔను! మల్లికయే యుండె నతనివెనుక,
తనను విడనాడి వచ్చిన తనయు నరయఁ
గాకతాళీయముగ వచ్చి కాలమునకుఁ
గాచికొనియెను నాథునికరము నామె. 154

ఉ. ఆడఁగఁబోవు తీర్థ మెదురైన విధంబున నిన్నియేండ్లకున్
రూఢిగఁ బ్రాణనాథుఁడు నిరూపితుడై యట నొక్కసారిగం
బోఁడిమిమీరఁగం దనుఁ గవుంగిటఁ గూర్పఁగఁ జేష్టఁదక్కి త
త్క్రోడసుపట్టికాలిఖితకోమలపోలిక నిల్చె నామెయున్. 155

తే.గీ. కరఁగ నీరీతి నొకకొంత కాల మింతి
తొలఁగి తద్బాహుబంధంబు నిలుచుఁ జెంత,
అంతలోననె యతఁ డామె నావరించుఁ,
గరలతల సాఁచి మఱికొంత గాఢముగను. 156

తే.గీ. వంతలను బాపు, వలవంతఁ బాఱఁద్రోలు,
వైరముల మాన్పుఁ, గాలంపువ్యవధి మార్చు,
పల్కులకుఁ గాని ప్రేమను పాదుకొల్పు,
మంచికౌఁగిలి మించిన మందు గలదె! 157

తే.గీ. ఇట్టి కౌఁగిలిలోఁ బ్రభవించినట్టి
వేడిలో లయింపఁగఁ జిరవిరహజనిత
దుఃఖవార్నిధి, కౌఁగిలిఁ దొలఁగి ప్రక్క
ప్రక్కగ నిలిచి రొకకొంతవడికి వారు. 158

ఉ. ఊరటనొంది కొంతగఁ, దలోదరి నాథునితోడఁ బల్కె, 'కా
వేరితరంగహస్తములు వే నను నీడ్చుకపోవ, దవ్వులం
దీరసమీపకుంజమున నేఁ బడియుంటిని తెల్విఁదప్పి, నా
తీరును గాంచి, జాలిగొని ధీవరుఁ డొక్కఁడు గాచె నన్నటన్. 159

తే.గీ. బేచనాహ్వయుఁడైన యాబెస్తఱేడు
నన్నుఁ గూతుగ మన్నించె నిన్నినాళ్లు,
ఇపుడు మిముఁ గూడఁ గొనివచ్చె నిటకు నన్ను
మాన్యుఁ డీతని గనుఁడు సన్మాన మెసఁగ. 160

తే.గీ. బేచనార్యుని యింటనే ప్రియముమీరఁ,
గంటి నితని,భవత్కులకంధివిధుని,
డంకనాహ్వయుఁ, బ్రియమార నంకమందుఁ
జేర్చి లాలింపుఁ డార్య! యీ చిఱుతవాని.' 161

కం.తు. అనుచుం దనతో నరుదెం
చిన బేచనధీవరపతిఁ, జెంతనె విస్మితుఁడై
కనుచున్ నిల్చిన బాలుని,
వనితారత్నము నెనరున వల్లభునకుఁ జూపఁన్. 162

చం. అతులితమోదవిస్ఫుటహృదంబుజుఁడై స్థపతీంద్రుఁ డంతటన్
సతికి మహోపకారియగు జాలరి మున్నుగ సత్కరించుటో,
అతులితమోహనాంగుడయి, అశ్మపరీక్షను దన్నె గెల్చియు
న్నతరుణు మున్ను లాలనమొనర్చుటొ తోఁపమిఁ దత్తరించుచున్. 163

కం. తనయుని మున్నుగఁ గౌఁగిటఁ
గొని, తత్సహితంబుగఁ జని కుతుకంబున బే
చనచరణాబ్జంబులఁ బడి,
తనదు కృతజ్ఞత నతనికిఁ దప్పక తెలిపెన్. 164

తే.గీ. ఉత్కటంబగు భావంబు లొదవినపుడు
మాటలాడదు వక్త్రంబు; మాటలాడు
నశ్రుసిక్తాక్షులే, అరుణాననంబె,
[1] ఒలమందలి సర్వాణుజాలకంబె! 165

తే.గీ. కాన మాటలాడడు శిల్పకారుఁ డపుడు;
తనువుచే, వదనంబుచేఁ, గనులచేత
వర్తనముచేత నాదరవత్సలతలఁ
జూపు బేచనాఖ్యునిపైని, సుతునిపైని. 166

తే.గీ. ఆప్తజనసమాగమజనితాద్వితీయ
సుఖనిషిక్తాంతరుండయి సుంతకాల
ముండి, సుతునకుఁ దాఁ జేసియున్న ప్రతిన
స్మృతికి రా నిట్లు వల్కెను శిల్పివరుఁడు. 167

*జక్కన మఱల కరమును ఖండించుకొనఁ బూనుట*

ఉ. 'బాలున కోడితిన్, మిగుల పాపమొనర్చితి గర్భిణీశిలన్
మూలవిరాట్ స్వరూపమును మూర్ఖతఁ గూర్చి, తదీయపాప ని
ర్మూలన కింక నాదుకరమున్ బలిసేయఁగనిండు, మున్నుగం
బాలున కేనొనర్చిన ప్రమాణము నిల్పుకొనంగనిం డిఁకన్! 168

1. ఒలమందలి = దేహమునందలి, సర్వాణుజాలకంబె = అన్నియణువుల సమూహమే.

తే.గీ. మాటఁ బాటింపకున్నట్టి మనుజుకంటె
అధముఁడైనట్టి మానవుం డవనిఁ గలఁడె?
అందునన్ దైవవిషయమ్మునం దొనర్చి
నట్టి బాసను దప్పుట చెట్టగాదె!' 169

చం. అనవుడు మల్లికాసతియు, నర్భకుఁడున్, మఱి బేచనాఖ్యుఁడున్,
ఘనమగు వంతనంది 'కరఖండనకార్యము నాపుమయ్య! చే
టును దలపోయకయ్య! టకటొంకుతనంబునఁ జేయనట్టి దీ
యనుచిత మయ్య! కాన దురితావహ మెట్లగునయ్య! చింతిలన్. 170

తే.గీ. ధాత్రినిం 'బ్రమాదోధీమతా మపి' యని
కోవిదులు తప్పు సరిపుచ్చుకొనుచు నుంద్రు;
అజ్ఞతను జేసియున్నట్టి యఘము కింత
కఠినశిక్షను గుడుచుట కార్య మగునె? 171

తే.గీ. ఱాతిలో దోసమొదవిన ఱాతి మార్చి
అన్యశిలయందు నిర్మించు టగును దగవు;
కాని యనుపమశిల్పనిర్మాణచతుర
మైన చేతి నరకికొను టగునె తగవు?' 172

తే.గీ. అనుచు వారింపఁజూచెడు నాప్తజనుల
ప్రార్థనంబుల నాతండు పాటిగొనక
కరము ఖండించుకొనఁ బోవు కాలమునకు
అక్కజంబగు నొకదృశ్య మావహిల్లె. 173

ఉ. శాంతలతోడ, విష్ణునృపచంద్రునితోడను, పెర్మలై సుధీ
కాంతునితోఁ బ్రతిష్ఠకొఱకై యట నిర్మితమౌచునున్న వే
శ్మాంతరమున్ బరీక్షణముసల్పఁగ వచ్చిరి దృష్టిమాత్ర పా
పాంతకులైన వైష్ణవమహామునివర్యులు భాష్యకారులే. 174

## భగవద్రామానుజులకు జక్కన విషయమును నివేదించుట

తే.గీ. అక్కజంబుగ నచట రామానుజులను
కాంచినంతనె జక్కన కాంతతోడ,
ఆత్మజునితోడ, బేచనాయకునితోడ,
అతులభక్తిని సాష్టాంగనతి యొనర్చె. 175

తే.గీ. ఎఱఁగి, సంభ్రమంబునఁ దనయింతిఁ, దనయు,
బేచనాయకుఁ జూపించి ప్రీతితోడ,
చన్నవృత్తాంత మెల్లయు సంగ్రహముగఁ
జెప్పె జక్కన యతిరాజశేఖరునకు. 176

ఉ. ఈవిధిఁ జెప్పి, శిల్పి యనియెన్, 'యతిశేఖర! మీరు వల్కి న
ట్లా విధుసూర్యలోచనునె అన్య మెఱుంగక సంభజించితిన్,
ఈవిధి నాకుఁ గూర్చి హృదయేశ్వరినిం బ్రియపుత్త్రునిన్,
ఆ విధుసూర్యలోచనుఁడె హర్షముఁగూర్చెను మిక్కుటంబుగన్. 177

తే.గీ. అఖిలలోకావనుండైన హరిని మీరు
అన్యదైవంబు లుండెనే? అతఁడు గాడె
సర్వజీవుల కర్మల శాసకుండు,
సర్వజీవుల సౌభాగ్యసంప్రదుండు. 178

ఉ. కాని మహాత్మ! ఆ హరిని గ్రావమునందు రచించుటందునన్
నేనొనరించియుంటి నతినీచపుఁబాపము, గర్భదుష్టపా
షాణమునందు నా పరమసాత్త్వతుఁ దొల్చితి, నీ యఘంబునుం
బూని తరించుదారి యఘపూర్ణకరంబును ద్రెంచుటే కదా!' 179

భగవద్రామానుజులు జక్కనకుఁ గర్తవ్యము
నుపదేశించుట

కం. అని యర్భకుని విధంబునఁ
దనచెయ్దమునకుఁ దపించు తచ్ఛిల్పివరున్
ఘనకరుణారసదృష్టులఁ
దనుపుచుఁ బల్కిరి యతీంద్రతల్లజు లిటులన్. 180

ఉ. `బాలిశుభంగిఁ బల్కెదవు పాండితి యుండియు శిల్పవేదమం
దో లలితాంగ! నీదుచెయి నూరక ఖండనచేసికొన్న నం
హోలవనంబు గల్గునె? కృపోదధి యా హరి భక్తదోర్లతో
న్మూలనఁ గోరునే యఘవిమోక్షణమున్ దయసేయ జక్కనా? 181

కం.తు. ఇది దోషం బనుటలు నీ
సదమలవృత్తికిని, నీదు సౌశీల్యంబునకున్
నిదర్శనం బగుఁ గానీ
మధురిపుదృష్టిని సకలము మాన్యమె యగునోయీ! 182

తే.గీ. చేతనాచేతనాత్మకసృష్టి యెల్ల
నలరుచుండును శ్రీకేశవాంశతోడ,
పవలురాత్రులు వోలె నా పరమపురుషు
వేషములె యగు నిర్దోషదోషయుగము. 183

తే.గీ. దోష మనఁ గాదు పాషాణదోష మిలను
ఆత్మసంగతాహంకార మగును గాని;
జ్ఞానియైనట్టి జీవుండు దీని నెఱిఁగి
పావనంబగు బ్రహ్మైక్యపదవిఁ గోరు. 184

తే.గీ. వేదశాస్త్రవాగ్వర్తులౌ విప్రవరులు,
తతతపోధ్యాననిష్ఠులౌ తాపసులును,
నిత్యసత్యవ్రతులగు మునీశ్వరులును,
జ్ఞానమార్గాన బ్రహ్మను గాన నెంత్రు. 185

తే.గీ. అవని నందఱు జ్ఞానచక్షువులు గారు;
కాని, వారికి మోక్షంబు గాదు మిథ్య,
కర్మయోగులు కొందఱు గంద్రు దానిఁ,
గందు రందఱు భక్తియోగంబుచేత. 186

సీ. [1] తనలోన నజరుద్రు లొనరుటం జేసి శ్రీ
కేశవాభిఖ్య రాగిల్లు నెవఁడు,
[2] నిఖిలవిశ్వమునందు నిండియుండుటఁ జేసి
శ్రీమహావిష్ణువై చెలఁగు నెవఁడు,
[3] ఇంద్రియంబుల కెల్ల నీశుఁ డౌటను జేసి
వరహృషీకేశాఖ్య వరలు నెవఁడు,
[4] జగములు దనలోన సంవసించుటఁ జేసి
వాసుదేవాఖ్యుఁడై పరఁగు నెవఁడు ,

తే.గీ. ధర్మనాశంబు గల్గిన ధరణిలోన
ప్రభవమొందుచు ధర్మంబుఁ బాదుకొల్పు
నే పరబ్రహ్మ, మా యిందిరేశు నెవఁడు
భక్తిసంయుక్తి నిత్యంబు భజనసేయు. 187

1.`క ఇతి బ్రహ్మణో నామ ఈశోఽహం సర్వదేహినాం, ఆవాం తవాంగే సంభూతౌ తస్మా త్కేశవనామ వాన్` అని హరివంశమునందు చెప్పబడినట్లుగా `కశ్చ ఈశశ్చ కేశౌ, తా వస్మిన్ స్త ఇతి కేశః` - అని కేశవ శబ్దమునకు వ్యుత్పత్తి; 2. `విశ్వం వేవేష్టి వ్యాప్నోతీతి విష్ణుః`- అని విష్ణుశబ్దమునకు వ్యుత్పత్తి; 3. `హృషీకాణా మింద్రియాణా మీశః` - అని హృషీకేశశబ్దమునకు వ్యుత్పత్తి - `హృషీకం విషయీంద్రియమ్` - అని అమరము; 4. `వసంత్యస్మిన్ జగంతీతి వాసుః - వాసుశ్చాసౌ దేవశ్చ వాసుదేవః` - అని వాసుదేవ శబ్దమునకు వ్యుత్పత్తి.

కం. వానికిఁ బాపము లంటవు,
వానికిఁ బ్రాప్తించు మహితపరమపదంబున్,
వానికి సుఖదుఃఖంబులు
గానంబడుఁ దుల్యములయి, గణుతింపంగన్. 188

చం. [1] శ్రవణము, కీర్తనంబును, నిరంతరచింతనమున్, మురాంతక
ప్రవిమలపాదసేవయును, వందన, మర్చయు, దాస్యమున్, రమా
ధవునకుఁ గూర్చు చెల్మియు, యథామతి నాత్మనివేదనంబు, నీ
నవవిధమార్గముల్ దగును నందకధారిని గొల్చువారికిన్. 189

ఉ. కావున శిల్పిచంద్రమ! యఘాపహమార్గము గోరితేని, ల
క్ష్మీవిభుసేవ కంకితముసేయుము నీ తనుమానసంబు, లా
దేవ నొనర్చి కట్టు మిఁక దివ్యతరాలయరాజిఁ, గట్టి యా
దేవు నపాంగవీక్షణస్మృతిం ద్యజియింపుము నీ యఘాత్మతన్. 190

కం. అంతియ కానీ మూర్ఖపుఁ
జింతనచేఁ గత్తికి బలిచేసినఁ గరమున్
వంతలు దీఱునె? నీవీ
భ్రాంతి న్మానుము, కను మిదె భక్తిపథంబున్. 191

తే.గీ. శిలలలోపల బ్రహ్మంబు వెలువరించి
అట్టులోనను గలదు విరాట్స్వరూప
మనెడి శ్రుతిసూక్తులను నిరూపణము సేయు
కరము ఖండించుకొన నేమి గలుగు నీకు?' 192

1.'శ్రవణం, కీర్తనం విష్ణోస్మరణం, పాదసేవనమ్, అర్చనం, వందనం, దాస్యం, సఖ్య, మాత్మనివేదనం। ఇతి పుంసార్పితా విష్ణోభక్తిశ్చే న్నవలక్షణా, క్రియతే భగవత్యద్ధీతన్మన్యే ఽధీత ముత్తమమ్॥' అని శ్రీమద్భాగవతములో నవవిధభక్తి నిగదితము. దీనినే ఆంధ్రమహాభాగవతములో పోతనామాత్యులు, 'తనుహృద్భాషల సఖ్యముఁ, శ్రవణముఁ, దాసత్వముఁ, వందనార్చనముఁ, సేవయు, నాత్మలో నెఱుకయుఁ, సంకీర్తనల్, చింతనం, బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్ముఁ హరిఁ నమ్మి సజ్జనుడై యుండుట భద్రమంచు దలతుఁ సత్యంబు దైత్యోత్తమా' యని సప్తమస్కంధమునందలి ప్రహ్లాదచరిత్రలో దెనిగించినారు.

కం. కరుణాళుండగు వైష్ణవ
గురుఁ డీపగిదిన్ హితంబుఁ గోరి వచింపన్
పరమాదరమున నాతని
చరణంబుల వ్రాలి యిట్లు జక్కన యనియెన్. 193

ఉ. 'పార్థున కెట్లు కృష్ణుఁ డటు భక్తిరసాంబుధికర్ణధార! వే
దార్థమయామృతోక్తులను నర్థపథంబును దెల్పి పుణ్యపా
పార్థవివేకపూర్ణత మదల్పమనీషకుఁ గూర్చినార, ల
న్యార్థము లేల? మీదువచనార్థములే ఘటియింపఁ జూచెదన్. 194

చం. ధనికుఁడఁ గాను దీర్చుకొన ద్రవ్యము లిచ్చి భవద్రుణంబునున్,
వణిజుఁడఁ గాను దీర్చుకొన స్వర్ణము లిచ్చి భవద్రుణంబునున్,
జనపతిఁ గాను దీర్చుకొన సంపద లిచ్చి భవద్రుణంబునున్,
ప్రణతులు దక్క మీ ఋణము బాపికొనంగ నెఱుంగ నన్యముల్.' 195

కం. అని పదముల వ్రాలిన జ
క్కనశిల్పిని లేవనెత్తి, కరమున శిరముం
బుణుకుచు, 'వర్ధిష్ణుర్భవ!'
యనుచుం దీవించెను గురుఁ డాప్యాయితుఁడై. 196

రాజదంపతులు జక్కనను సౌమ్యకేశవాలయమును
నిర్మింప నియోగించుట

ఉ. అంతట విష్ణువర్ధనధరాధిపచంద్రుఁడు వల్కె, 'మల్లికా
కాంతను బుత్త్రుని న్మఱలఁ గాంచఁగఁ గల్గితి వీవటన్న వృ
త్తాంతము ధ్వాంతమం దొదవు దట్టపువెన్నెలవోలె మాకు, మా
శాంతలకు న్నితాంతతరసంతసకారకమయ్యె జక్కనా!. 197

తే.గీ. పరమసాధ్వి శాంతల, మాదుపట్టమహిషి
కట్టఁదలచెను నిజభక్తి కద్దముగను
విజయనారాయణస్వామి వేశ్మమునకు
సరసనే సౌమ్యకేశవస్వామి గుడిని. 198

కం. రామానుజగురువులు నీ
సేమంబును గోరి మున్నుఁ జెప్పినయటు లీ
శ్రీమందిరు మందిరమును
శ్రీమహితంబుగ రచించి చెలఁగుము గృతివై.` 199

తే.గీ. అనిన, శాంతల దరహసితాస్య యగుచుఁ,
గంటికొనలందు మెఱుపులు గడలుకొనఁగ,
జక్కనాచార్యునిం గాంచి సమ్మదమున,
శిరసు నూచి నిజాశ్రవం బెఱుకపఱచె. 200

తే.గీ. అపుడు రాణికి, ఱేనికి నంజలించి
`భవదభీష్టనిబద్ధుఁడ నవనినాథ!`
యనెడి వినయోక్తులం దన యాశ్రవంబు
వెల్లడించెను తచ్ఛిల్పితల్లజుండు. 202

*జక్కన అనవద్యముగ శ్రీ విజయనారాయణస్వామివారి*
*విగ్రహమును మఱల నిర్మించుట*

తే.గీ. విజయనారాయణస్వామి విగ్రహమును
సంప్రతిష్ఠించు దివసంబు సత్వరముగ
దరియుచుండుటచేత నూత్నానవద్య
మైన మూలమూర్తులఁ దొల్చు యత్నమూని
జక్కనాచార్యుఁ డాత్మజసహితుఁ డగుచు. 203

చం. అనుపమలక్షణాన్విత నవాశ్మమునందు నహర్నిశంబులున్
ఘనతరదీక్షమైఁ దొడరి కల్పనసేసెను మూలమూర్తులన్,
వనరుహపత్త్రనేత్రులను, వక్త్రకళాజితకోటిమిత్రులన్,
వినతరుజాపహర్తలను, విశ్వశుభంకరణైకవర్తులన్. 204

తే.గీ. మున్నుఁ దొల్చిన మూర్తికి మిన్నయౌచు
ముద్దులొల్కెడి యామూర్తి ముగ్ధ లగుచుఁ
గననివారును, గని భక్తికలితహృదులు
గానివారును లేరైరి క్షోణి నెవరు! 205

తే.గీ. ఆగతం బయ్యె నంతలో నఖిలజనులు
నెదురుచూచుచునున్న సమిద్ధచైత్ర
శుద్ధపంచమీశనివారశుభదినంబు,
అదియె తన్మూర్తి విష్ణు వౌనట్టి దినము. 206

భగవద్రామానుజులు
శ్రీవిజయనారాయణస్వామివారిని బ్రతిష్ఠించుట

తే.గీ. పాంచరాత్రోక్తవిధిఁ గట్టఁబడిన యట్టి
వేదికాకుండతోరణవిలసితంబు
అతులసుందరమగు ప్రతిష్ఠాలయంబు
నాటికిన్ ముందుగనె సదామ్నాయవిదులు,
సచ్చరిత్రులు, హరిభక్తిసారమతులు,
నైన విప్రులతోడఁ బర్యాప్తమయ్యె. 207

తే.గీ. రెండుదినములనుండి యఖండముగను
భాష్యకారులవారి యాధ్వర్యమునను
సపరివారుండు సద్భక్తిసంయుతుండు
నగుచు విష్ణువర్ధనుఁడు పాలుగొనుచుండ
సాగుచుండెను తత్ప్రతిష్ఠాక్రమంబు. 208

తే.గీ. మొదట సలిలాధివాసముం బొనరఁ జేసి,
ఉపరి, ధాన్యాధివాసంబు నొనరఁ గూర్చి,
పైని స్నాపనశయనాధివాసవిధులు
శాస్త్రహితముగ సద్భక్తి సంఘటించి ... 209

తే.గీ. రమ్యమంగళతూర్యవిరావములును,
భవ్యతర చతుఃశ్రుతిశాస్త్రవాక్యములును,
వరసుమంగళీగీతికాధ్వానములును,
దనరుచుండఁగ వీతిహోత్రుని రగిల్చి ... 210

తే.గీ. అగ్నిసంస్కార, శాన్తిహోమాదికంబు
లాచరించియు, ద్విజభోజనాదివిధులు
నిర్వహించియు, నాపైనిఁ బూర్వమందె
క్షీరమధుజలదధ్యాదిపూరితంబు
లైన కుంభముల దరికి నానయించి ... 211

తే.గీ. ఆ ద్రవంబులతో విగ్రహాంగములను
మంత్రయుతముగఁ దాఁకి తన్మాత్రజీవ
మానసాదిప్రకృతుల నందూనఁ జేసి,
పైనిఁ బంచవాతాత్మకంబైన ప్రాణ
మందునం బోయ విహితహోమాన్వితముగ ... 212

తే.గీ. ఇట్లు ప్రాణప్రతిష్ఠ గావించినట్టి
మూర్తి ముందర మలురేయి పుడమిఱేడు
బ్రాహ్మణులతోడ, నాచార్యవర్యుతోడ
నిదురయొనరించి, మూడవయుదయమందు ... 213

తే.గీ. సురభిశాభ్యంజనస్నానశుభ్రతనుఁడు
పట్టుపీతాంబరోత్తరవస్త్రవృతుఁడు
పట్టమహిషీప్రభృతిపరివారయుతుఁడు
నగుచు నాలయస్థలమున కరుగుదేర ... 214

తే.గీ. ఆదరంబున నాచార్యుఁ డవనిపతికి
స్వాగతము బల్కి యానాడు సల్పఁదగిన
కార్యముల నెఱిఁగించి, భూకాంతుఁ డందు
బంధుమిత్రాదులం గూడి పాల్గొనంగ ... 215

తే.గీ. మంత్రపూతజలంబుల మందిరమ్ముఁ
బ్రోక్షణముసేసి, యాపైని శ్రుతివిరావ
ములును మంగళతూర్యగీతులును జెలఁగ
గర్భగృహమును నట్లె ప్రోక్షణముసేసి ... 216

తే.గీ. సమధికాలంకృతంబైన చారుభద్ర
పీఠికాపూజ యొనరించి ప్రీతితోడ,
పైనిఁ దత్పీఠికామధ్యభాగమందు
రత్నవిన్యాసముం జేసి రమణమీర ... 217

తే.గీ. పిమ్మటం బ్రతిష్ఠామండపమ్మునందుఁ
దనరు కుండాలఁ బూర్ణాహుతిని బొనర్చి,
ఆపయిన్ గర్భగేహమ్మునందు నున్న
రత్నవిన్యస్తపీఠికారత్నమందు ... 218

ఉ. రాజును, రాణులున్, బ్రజలు, బ్రాహ్మణులున్, వివిధాధికారులున్,
రాజపురోహితుల్, స్థపతిరాజులు, జక్కనమల్లికాసుతుల్,
భ్రాజిలువేడ్కఁ గన్నుఁగవ వక్త్రము నిండఁగఁ గాంచుచుండ, వి
భ్రాజితవైభవంబునను వైష్ణవముఖ్యుఁడు నిల్పెఁ గేశవున్. 219

ఉ. అప్పుడె భద్రతూర్యరవ మాశల నిండెను, ఘంటికారవం
బప్పురమందు నెల్లెడల నాశ్రుతమయ్యెను, వేదమంత్రముల్
కప్పుమెఱుంగువేనలుల కమ్మనిపాటలు తీవలట్టు లిం
పొప్పఁ బెనంగికొంచు వెస నూర్ధ్వగతంబయి తాఁకె నాకముఁ. 220

చం. హొాయసలరాజ్యమందున మహోజ్జ్వలపర్వము పర్వె నా౦డు, శ్రీ
దయితుని కీర్తనంబె జనతాముఖనిర్గత మయ్యె వాడలన్,
మయనిభులైన శిల్పు లట మంజులరీతి రచించియున్న యా
లయమున నవ్యదివ్యకళ లాస్యముసేయ౦గ సాగెఁ బెల్లుగన్. 221

తే.గీ. ఆ ప్రతిష్ఠోత్సవక్రమం బరయువారి
నాల్కలందున నవ్వేళ నాట్యమాడె,
పావనాష్టాక్షరీమంత్రపాఠచయమె,
కృష్ణశరణాష్టకాదిసంకీర్తనములె! 222

ఉ. ఇమ్ముగ భాష్యకారు లిటు లిందురవీక్షణమూర్తిఁ బాంచరా
త్రమ్ము విధించినట్లుగఁ దదాలయమందుఁ బ్రతిష్ఠచేసి, న్య
స్తమ్మొనరించి యందునను ద్వాదశబీజసుమంత్రశక్తి, నా
పిమ్మట భూరమాదులగు వేల్పుల నెల్లఁ బ్రతిష్ఠచేసినన్ ... 223

తే.గీ. ఆ మహాత్ముని కధిపుఁ డత్యంతభక్తి
సపరివారు౦డై మ్రొక్కిన, సంతసమున
నతని లేవ నెత్తి పలికె యతివరుండు
'అవిరతాచ్యుతపాలితో భవ' యటంచు. 224

ఉ. పిమ్మట విష్ణువర్ధను౦డు పేర్మిని వచ్చిన భూసుపర్వబృం
దమ్ముల భూరిదక్షిణలఁ దన్పి, ద్వితీయవికుంఠరీతి ర
మ్యమ్ముగ నాలయమ్ము నట మల్చిన శిల్పుల కెల్ల నిచ్చె ని
ష్కమ్ములు, సొమ్ములున్, రుచిరకాంచనచేలగణమ్ము లిమ్ముగన్. 225

తే.గీ. పైని భూజాని పెరుమలైపండితునకు
జక్కనాచార్యునకుఁ బూజసల్పి యొస౦గె
కనక వాహన భూ వస్త్ర గణము లెన్నొ
వారొనర్చిన మేలుకుం బ్రతిఫలముగ. 226

ఉ. ఆపయి భాష్యకారుల పదాబ్జములందున వ్రాలి, విష్ణుధా
త్రీపతి పల్కె, 'సంగములు కృత్స్నముగాఁ బెడఁబాసి యున్న మి
మ్మే పగిదిం బదార్థతతు లిచ్చి కృతార్థులఁ జేయువాఁడఁ? గా
నీ పరికింతు నీవిధము నిక్కము మీకును నచ్చునం చెదన్ ... 227

తే.గీ. పరఁగ మేల్కోటలో మీరు భక్తిమీర
సంప్రతిష్ఠించి నటువంటి స్వామివారి
నిత్యభోగములకుఁ బ్రదానింప నెంతు
సారవంతములైన కేదారములను.' 228

తే.గీ. అనుచుఁ దత్పదాబ్జంబుల కర్చసేసి,
ధారవోసెను భూరికేదారములను,
సంతసంబున వైష్ణవాచార్యునకును,
దానకర్ణుండు - విష్ణువర్ధననృపుండు. 229

తే.గీ. ఈఁగతిం బ్రతిష్ఠాక్రమం బెల్ల ముగిసె,
మీఁదటఁ ద్రిరాత్రవిరతికై మీలితంబు
లయ్యెఁ దల్పులు; నిత్యార్చనాదివిధులు
ప్రక్రమింపంబడెను చతుర్థాహ్నమందు. 230

ప్రప్రథమకేశవార్చనాసమయమున
శాన్తలామల్లికలు నాట్యమాడుట

తే.గీ. ఆలయంబున నిటు చతుర్థాహ్నమందు
సాగు ప్రప్రథమార్చనోత్సవమునందు
పాల్గొనంగ వచ్చెను విష్ణువర్ధనుండు
శాన్తలాలక్ష్మలం గూడి సంతసమున. 231

తే.గీ. వారితోడ వచ్చి రితరబాంధవులును,
ప్రభుతఁ దీర్చెడి యధికారవర్గములును,
మహితపండిత, కవి, శిల్పిమండలులును,
భరతనాట్యకోవిదలైన భామినులును. 232

తే.గీ. వచ్చి రితరజనంబులు హెచ్చుగాను,
వచ్చె జక్కనస్థపతియు, వచ్చె నతని
సుతుఁడు డంకనయును, వచ్చె నతనిజాయ
మల్లికాసతియును, తండ్రి మల్లనయును. 233

తే.గీ. పాంచరాత్రహితంబుగాఁ బరమపురుషు
పూజ తాంబూలపర్యంతముగను సాగె;
అపుడు సాష్టాంగనతు లంద ఱాచరించి
కేశవుని నుతించి రిటు లావేశ మెసఁగ . 234

[1] శ్లో. 'భజామ్యహం శ్రీ వసుధాసమేతం,
భస్మాసురధ్వంసక మిందువక్త్రం।
మోహాకృతిం బిభ్రద మంబుజాక్షం,
శ్రీ కేశవం దివ్య మనంతరూపం॥' 235

[2] శ్లో. 'శ్రీమత్త్రైలోక్య పూజ్యాయ,
సర్వకర్మసు సాక్షిణే ।
ఫలదాయ నమో నిత్యం,
కేశవాయ శివాయ చ ॥' 236

[3] శ్లో. 'నమః కేశవనాథాయ, నయనానందమూర్తయే।
వేలాపురీనివాసాయ, సత్యజ్ఞానాయ విష్ణవే॥' 237

2. బేలూరు శాసనము సంఖ్య 58, 71 (క్రీ.శ. 1117); 1,3. ప్రాచీనశ్లోకములు (దాదాపుగా ఆకాలమునాటివే)

తే.గీ. ఇట్లు కను లఱమోడ్చి ప్రార్థించుచున్న
శాన్తలాదేవి తనుమనశ్చక్షువులకు
సర్వ మవ్యక్తమయ్యెఁ గేశవుఁడు దక్కః
తత్షణమె యామె పాదపద్మముల మ్రోగె
నర్తనోచితకింకిణీనాట్యరవము. 238

తే.గీ. అది గ్రహించిన లక్ష్మి యాయత్తయయ్యె
మేళవించిన వీణతో వైళముగనె,
ఆమె ప్రక్కన సంసిద్ధులైరి యంత
హృద్యమర్దలసుషిరాదివాద్యవిదులు. 239

తే.గీ. గర్భగేహమ్మునకు ముందుఁ గ్రాలుచున్న
నాట్యమండపమధ్యంబునందు నిల్చె
శాంతలాదేవి; తన్మండపాంతికమున
విహితరీతిని జనులు నివిష్టులైరి. 240

తే.గీ. మోహనంబుగ ముందుగా మురళి మ్రోసె,
పైని మురజంబు, నాపైని వీణ మ్రోసె,
వాని కనువుగ గళమెత్తి పాడఁదొడఁగె,
లయసమేతంబుగ జతిస్వరంబు లక్ష్మి. 241

తే.గీ. ఆ నినాదంబు శాంతల వీనులందు
సోఁకెనో లేదొ, నాట్యరసైక సంప్లు
తంబగుచు నామెలోని ప్రత్యణువు పొంగె;
ఆమెతనువు గదలె నప్రయత్నముగను. 242

తే.గీ. పాడఁగా లక్ష్మి స్వర శబ్ద పల్లవులను
రమ్యతరనృత్తగతులను రాణి చూపె,
పాడఁగా లక్ష్మి సాహిత్యపల్లవులను
రమ్యనృత్యాభినయముల రాణి చూపె. 243

తే.గీ. అట్టు లత్యద్భుతముగ నాట్యంబుసేసి,
శాన్తలాదేవి సమపదస్థానకమున
నిల్చి, ప్రసవాళి దోసిటం దాల్చి, హరిని
గూర్చి యీరీతిఁ బ్రార్థనోక్తులను బల్కె. 244

[1] శ్లో. 'యం శైవా స్సముపాసతే శివ ఇతి, బ్ర హ్మేతి వేదాన్తినః,
బౌద్ధా బుద్ధ ఇతి, ప్రమాణపటవః కర్తేతి నైయాయికాః,
అర్హన్ని త్యథ జైనశాసనరతాః, కర్మేతి మీమాంసకాః,
సోఽయం వో విదధాతు వాఞ్ఛితఫలం త్రైలోక్యనాథో హరిః॥' 245

చం. అమృతము జాలువారునటు లచ్యుతుఁ బ్రస్తుతిఁజేసి యీగతిన్
కమలపదంబులం దొనరు గజ్జెలు ఘల్లుల మ్రోగుచుండఁగన్
కమలదళాక్షు సన్నిధికిఁ గ్రమసితచ్ఛదయాన మూని యా
కమలదళాక్షి యేఁగి త్రిజగత్పతి కిచ్చెను కౌసుమాంజలిన్. 246

ఉ. ఆ మహనీయదృశ్యమును నాలయసంస్థితలోకు లెల్ల నెం
తో ముదమారఁ జూచు చటఁ దాల్చిన మూర్తులువోలె ఱెప్పపా
టేమియు లేక మ్రాన్పడిరి, యీగతిఁ బాయఁగఁ గొంతకాల మా
కోమలి కింకిణీరవమె కూర్చెను బోధము వెండి వారికిన్. 247

తే.గీ. అట్లు పుష్పాంజలి ఘటించి యచ్యుతునకు,
శాన్తలాదేవి స్వీయాంఘ్రిసరసిజాత
నిచితకింకిణులను డుల్చి నికటమందె
యున్న మల్లిక కొసఁగి నిషణ్ణ యయ్యె. 248

తే.గీ. అందులోఁ గల సందేశ మర్థమయ్యె,
మల్లికకు, దానికిం గొంత తల్లడిల్లె
నామెయును, పైని ధైర్యంబు నావహించి
గజ్జెలం బూని, నాట్యరంగాన నిల్చె. 249

1. ప్రాచీనశ్లోకము. శాన్తల శైవ,వైష్ణవ,జైన మతములందు సమానాదరము గల దని శాసనప్రమాణము గలదు.

స్వరపల్లవి: `దా దనిసా నిదని సా,
నిరి నిస దని దమ ॥ దా దనిసా॥

శబ్దపల్లవి: తాం తణిత దణజం
తది తదిమిత కిటతక
తదిత కిటకు, జణు
తదేంగిణత ॥తరి॥ 250

తే.గీ. అనుచు స్వర శబ్ద పల్లవు లద్భుతముగఁ
బాడు చాయింతి నర్తనమాడఁ దొడఁగె,
వానినే పల్కె లక్ష్మి చేవీణియయును,
వరమృదంగవంశ్యాద్యన్యవాద్యములును. 251

తే.గీ. పలుతెఱంగుల గతులతోఁ బాడు చామె
తదనుకూలంబుగాఁ బద వదన గాత్ర
నేత్ర విక్షేపరమ్యమౌ నృత్తగతులు
చూపి చూపఱడెందముల్ చూఱకొనెను. 252

తే.గీ. ఆమె యాటపాటల కొగ్గి యనుసరించె
వాద్యసంతతులే, కాని వాద్యరవము
కొగ్గి యామె యభినయింపకుండె నపుడు,
ఆ క్రమం బద్భుతావహంబయ్యెఁ బ్రజకు. 253

ద్విపద. ఇటు లద్భుతంబుగా నృత్తంబుఁ జేసి,
కుటిలకుంతల యిట్లు గొంతెత్తి పాడె ... 254

సాహిత్యపల్లవి: బృందావన రాసవిహారీ
ఇందీవరవర్ణ మురారీ
కందర్పసుందర, యదు
నందన, నందకధారీ
వందన మిదె, సుమ
వందన మిదె శౌరీ! 255

మ. అనుచుం బాడుచు నద్భుతంబుగను నాస్యంబందు నాభావమున్
మును పెవ్వారును జూపనట్టి ఫణితిన్ మోదంబునున్ భక్తితో
డను మిశ్రంబొనరించి చూపుచును నాట్యంబాడు నయ్యింతినిం
గనులన్ వాల్పక చూచుచుండ్రి జనులున్ గంధర్వులం బోలుచున్. 256

తే.గీ. పాటయందున నింపొందు ప్రతిపదంబు
నభినయించిన దామె నాట్యంబునందు;
అభినయానుకూలంబుగ నామెలోని
ప్రత్యణువు గదలిన దతిరమ్యముగను. 257

తే.గీ. గంటముం దాల్చి మున్ను వ్యాఖ్యాత యయ్యె
మల్లినాథుండు, కాని యీమల్లికాఖ్య
నటనమున్ జూచిన నతండు ఝటితిగాను
గంటమున్ విడనాడి, కాల్గజ్జెలూని,
అభినయింపఁడె సర్వకావ్యార్థములను. 258

కం. ఇటు లద్భుతఫణితిన్
నటనంబొనరించి యామె ననదోయిలినిన్
పటుభక్తిన్ ఘటియించెను
నటనామోహితదితిసుతునకు నరహరికిన్. 259

తే.గీ. ఇట్లు పుష్పాంజలిన్ సమర్పించి హరికి
మ్రొక్కె నాయమ భాష్యకారులకుఁ బిదప,
అప్పుడే జక్కనయుఁ జేరి నటకుఁ బ్రీతి
వ్రాలెఁ దానును యతివర్యు పదములందు. 260

తే.గీ. అట్లు వ్రాలిన వారిని యతివరుండు
బాధకరుణార్ద్రలోచనపద్ముఁ డగుచు
లేవనెత్తుచుఁ గురిపించె దీవెనలను
సతతశోభనకరముగ సంతసమున. 261

ఆశ్వాసాంతము

ద్విపద. నాళీకనిభరమ్యనయనాల వాఁడ!
బాలేందునిభరమ్యఫాలంబు వాఁడ!
కాలాంబుధరరమ్యకాయంబు వాఁడ!
పాలింప ధర్మంబుఁ బ్రభవించు వాఁడ! 262

కైవల్యవృత్తము. కైవల్యదాతా! కామితార్థప్రదాతా!
సౌవర్ణచేలా! సర్వసంసృష్టిమూలా!
శ్రీవత్సవక్షా! శీతలోష్ణాయతాక్షా!
శ్రీ వేంకటేశా! శేషశై లేశవాసా! 263

కం .శ్రీ వాసుదేవ! కేశవ!
భావుక రస వృత్త రమ్యపద బంధురమౌ
నీ వరకావ్యముఁ గైకొని
కైవల్యం బీయఁగదవె కరుణను నాకున్. 264

చం. తిరుమలవంశసంభవుఁడు, తెన్గున, సంస్కృతమందు భారతీ
వరకరుణావిశేషమునఁ బాండితిఁ గొంతగఁ గన్నవాఁడు, శ్రీ
కరమగు నుత్తరామెరికఖండమునందున నున్నవాఁడు, శ్రీ
హరిచరణాంబుజాతనిరతార్పితచిత్తుఁడు, దేశికాఖ్యుఁడున్. 265

కం. విరచించెను శిల్పికులా
భరణుండగు జక్కనార్యు భవ్యచరిత్రన్,
గరిమను ఋతుసంఖ్యం దగు
సరసోల్లాసంబులు గల సత్కావ్యముగన్. 266



## సవరణ పట్టిక-2

| పుట | పద్యము | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|---|
| 11 | 44 | 3 | బాపఁగఁనో | బాపఁగనో |
| 19 | 84 | 1 | తటులై | తటలై |
| 21 | 91 | 12 | షఢ్రుతుపతికిని | షడృతునాథునకును |
| 23 | 100 | 5 | ముదసిక్తములై | సంప్రీతములై |
| 26 | 108 | 2 | మఱుగునఁ | మఱుగున |
| 26 | 109 | 1 | ఉ. ఆస్యంబు రాకాసుధాంశుమండలమె, | సీ. ఆస్యంబు రాకాసుధాంశుబింబమె, |
| 27 | 113 | 2 | లౌ యుపలంబుల | లైయున్న శిలల |
| 39 | 40 | 2,3 | ఁ. దన్ముదసంవర్ధక | , నా ముదముం గూర్చెడి |
| 48 | 87 | 2 | నొండురుల | నొండొరుల |
| 52 | 109 | 1 | నిడుదంపు | నిడుపారు |
| 54 | 116 | 4 | ఛీభత్స | బీభత్స |
| 61 | 148 | 2 | భ్రమిసెను | బ్రమిసెను |
| 62 | 156 | 1 | మక్కజముగాఁ దను గాంచమనున్న | మబ్రముగ నయ్యెడఁ దన్గనుమన్న |
| 63 | 163 | 1 | ముద్దుగ | మేలుగ |
| 70 | 28 | 2 | పట్టంబర | పట్టాంబర |
| 76 | 64 | 4 | లాసికీ | లాసికా |
| 87 | 119 | 3 | పట్టంబర | పట్టాంబర |
| 98 | 13 | 2 | వరుతురగాధి | వరతురగాధి |
| 112 | 80 | 3 | యుదరమున్ భర్తాస్యమున్ | నుదరమున్ భర్త్రాస్యమున్ |
| 113 | 88 | 1 | నిముష | నిమున |
| 117 | 112 | 4 | లివ్వఁగ | లీయఁగ |
| 119 | 121 | 2 | వపుషంబులతోన్ | వపువులతోడన్ |
| 122 | 132 | 4 | నధిగమించుటె | నతిగమించుటె |
| 123 | 140 | 3 | నాహార్య | నహార్య |
| 126 | 156 | 2 | నిస్వని | నిస్వన |
| 126 | 159 | 4 | విహ్వలితాత్మఁ | విహ్వలితాత్మ |
| 127 | 160 | 2 | లిటులం | లిటులన్ |
| 127 | 162 | 1 | పరదారా | పరనారీ |
| 127 | 165 | 1 | శిరీషపేశలమైన | శిరీషముఁబోలు |
| 135 | 17 | 9 | నాథాంఘ్రుల | నాథాంఘ్రుల |
| 137 | 28 | 3 | భాసురయౌవనినిం | భాసురయౌవననున్ |
| 138 | 36 | 2 | దుస్సాధ్య | దుస్సాధ |
| 150 | 93 | 2 | నయ్యాహార్యవర్యంబునన్ | నయ్యద్రీశమధ్యంబునన్ |
| 151 | 102 | 2,3 | పంథా | పద్యా |
| 152 | 104 | 3 | యాతనిని వెండి ప్రయోజకు | వెండియును వానిఁ బ్రయోజకు |
| 155 | 115 | 3 | నాతని | యాతని |
| 159 | 133 | 3,4 | తన్ముదకరమైన యర్థముల | తన్ముదము ఘటించు నర్థముల |
| 165 | 165 | 3 | ,నాతఁడు ప్రాథమికోపచారముల్ | ఁ, బ్రాథమికోపచారముల్ |
| 167 | 177 | 2 | యాటాడచు | యాటాడుచు |
| 173 | 9 | 2 | శివునిం | శివునిన్ |
| 174 | 13 | 7 | దారా | దార |
| 181 | 47 | 1 | బ్రత్యుషసియందున | బ్రత్యుషసునందున |
| 181 | 48 | 2 | జేతములోఁ | ఆతనికిం |
| 187 | 75 | 4 | ప్రముద | ప్రమద |
| 187 | 77 | 1 | దీక్షులై | దీక్షతో |
| 188 | 83 | 3 | మాతృతుల్యులరు | మాతృమూర్తులరు |
| 212 | 208 | 2 | యాధ్వర్యమునను | యాధ్వర్యవమున |
| 221 | 259 | 1 | లద్భుత | లత్యద్భుత |

